# PREFACE.

This work is described under D. No. 1466-A in Volume VI (Vacana Kāvyas) of the Descriptive Catalogue of the Telugu Manuscripts in the Library. This is a prose work written by one Kola Śeṣācala Kavi belonging to Yādava class and dedicated to Sri Gode Venkata Jaggaraya, an enlightened Zamindar of Visakhapattanamu.

The work gives an account of the journey made by Śeṣācala Kavi to the Nilagiris in 1846 following the retinue of the then Governor of Madras. It describes vividly the climate of the places, the nature of the people and their peculiar customs and manners that the author came across during his journey. Besides, the work gives an account of the flora and fauna of the Nilagiri hills.

The style of the work is thoroughly classical (grānthika) and it is one of the best Vacana Kāvyas in Telugu literature. For the clarification of the new vocabulary he used, he gives foot-notes explaining their origin and intonation. The work gives minute details regarding geographical positions, latitudes and longitudes and meteorological observations. It is highly useful as a source of information regarding those times. As prose works of this type are few and far between in Telugu literature, this publication is expected to be a welcome addition. My thanks are due to Srimathi B. Adilakshmi, B.A., formerly temporary Pandit of this library for preparing the Press copy and to Sri S. Krishnamurthi, M.A., Telugu Pandit of this library, for correcting the proofs.

T. CHANDRASEKHARAN, M.A., L.T.,
*Curator.*

GOVERNMENT ORIENTAL MANUSCRIPTS
LIBRARY, MADRAS,
*27th May* 1953.

# పీఠిక.

మదరాసు దొరతనమువారి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమునందలి నవీన కావ్యములలో నీ నీలగిరి యాత్రా చరిత్ర D. Vol. VI. 1466-A సంఖ్యలో వర్ణింపఁబడినది. కాఁగితపు ప్రతి. దీనికి గ్రంథాలయమునఁ బ్రత్యంతరము లేదు. వ్రాఁత సుందరముగా నున్నది. ముఖపత్రమున "గిల్టు" చేయఁబడిన "శ్రీ మత్కృతిపతు లగు గోడే- వేంకట జగ్గారాయలుగారికి కోలా- శేషాచల కవి వలన సమర్పితంబగు నీలగిరి యాత్ర" అను నీ వ్రాఁతవలన నీప్రతి, కవి స్వహస్తసంపాదితమై యుండ నోపునని పొడకట్టుచున్నది. అవతారికలో 2 పుటల గ్రంథ పాతము గలదు.

నీలగిరి యాత్ర యను నీగ్రంథము నీలగిరి యాత్రా చరిత్రలకు సంబంధించినది. మదరాసు దొరతనమువారు పూర్వము విశేషముగ వేసవిలో తమ పరివారముతో నీల గిరికి వెళ్ళుట యాచారమై యుండెడిది క్రీ. శ. 1846 వ సంవత్సరమున నప్పటి గవర్నరగు "ట్వీడెర్" దొరగారు తమ కార్యనిర్వాహక వర్గముతోఁగూడ నీలగిరికి పయనమైరి. ఆ కార్యనిర్వాహక వర్గములో నొకఁడగు "తామస్ సిమ్సన్" అను దొరవారి యాఫీసున ప్రధానోద్యోగి యగు మాంగాడు శ్రీనివాస మొదలారి యను, గుమాస్తాగానున్న ప్రకృత గ్రంథకర్తయగు కోలా శేషాచల కవియు నా పరివారముతో నీలగిరికి వెళ్ళిరి. శేషాచల కవి క్రీ. శ. 1846 మే 12 వ తేదని చెన్నపురినుండి బయలుదేరి తొమ్మిది నెలలుండి తిరిగి క్రీ శ. 1847 జనవరి 13 వ తేదిని మదరాసు చేరుకొనెను. ఈ కాలములో శేషాచల కవి తన ప్రయాణమును గూర్చి తెలుపుచు, నీలగిరిలోని విశేషములను తన యనుభవములను నేకరించి నీ గ్రంథమును రచించెను.

కృతికర్తయగు శేషాచల కవి చెన్నపట్టణమునందలి చింతాద్రిపేట నివాసి. ఇతఁడు తన వంశమును గురించి గ్రంథాంతమున చెప్పుకొని యున్నాఁడు. ఇతఁడు యాదవ కుల సంజాతుఁడు. కోలా వీరరాఘవునకు ప్రపౌత్రుఁడు. తెప్పలనాయనికి పౌత్రుఁడు. వెంకటాచల నాయనికి మంగమకు పుత్రుఁడు. తన తాత ముత్తాతలనే కాక బంధుజాలమంతటిని నీసమాలికలో వర్ణించియున్నాఁడు. ఇతఁడు విశిష్టాద్వైత సంప్రదాయానుగామి. గణిత శాస్త్రమును మాంగాడు శ్రీనివాస మొదలారియొద్ద నేర్చుకొన్నట్లు చెప్పుకొనియున్నాఁడు.

ఈ గ్రంథము దప్ప యితని రచనలేమియు గాన్పించుట లేదు.

దీనిని కవి విశాఖపట్టణమున సుప్రసిద్ధములైన జమీందారి కుటుంబములలో నొకటియగు గోడే కుటుంబమున నుద్భవించిన శ్రీ వెంకట జగ్గారాయ నృపాలుని కంకితము చేసి యున్నాఁడు. కృతిపతియగు నీ వెంకట జగ్గారాయఁడు భూగోళ, ఖగోళ, జ్యోతి శ్శాస్త్రములయందు ప్రవీణుఁడై విశాఖపట్టణమున నొక నక్షత్ర శోధన శాలను (observatory) నిర్మించెను. మఱియు నీతఁడు సంగీత సాహిత్యములందభినివేశము గలవాఁడైనందుననే శేషాచల కవి యీ గ్రంథము నీతని కంకిత మొనర్చుట ప్రసక్తమై యుండును.

ఈ గ్రంథము మూఁడు ప్రకరణములది. ప్రథమ ప్రకరణ మీతఁడు నీలగిరి చేరు నంతటివరకుఁగల వృత్తాంతమును తెలుపును. రెండవ ప్రకరణము నీలగిరియందలి విశేషములను తెలియఁజేయుచున్నది. మూఁడవ ప్రకరణమునందాతని తిరుగు ప్రయాణమును గూర్చియు త్రోవయందలి యద్భుతములను గురించియు వర్ణింపఁబడియున్నది.

"నీలగిరి యాత్ర" వచనరూపమున నున్నను పద్య కావ్య సంప్రదాయము ననుసరించి యాశ్వాసాద్యంత పద్యములు రచింపఁబడినవి. వానిలో గర్భకవిత్వము బంధకవిత్వము గల వృత్తములు గలవు. కృతిభర్తృ వంశావతారికయు పద్యరూపముననే గలదు. దీనిని బట్టి శేషాచల కవి గద్య రచనయందే కాక పద్య రచనయందుఁగూడఁ బ్రవీణుఁడని విశదమగుచున్నది.

ఇందలి వచన రచన ప్రశస్తమగు గ్రాంథిక శైలినున్నది. అందందు వ్యవహారానుగుణముగ నా కాలమునందలి రాజకీయ ప్రభావము ననుసరించి యన్యదేశ్యములును వాడఁబడియున్నవి. ఇది యాత్రా చరిత్ర కావున యాయా ప్రదేశముల యందు వ్యవహారములోనున్న పదములకు వాని ప్రత్యేకమైన యుచ్చారణ తెలియునట్లు కొన్ని గుఱుతులు కూడ నిందు పెట్టఁబడినవి. కేరళ ద్రవిడ పదములను వేఱుగా కవి సూచించియున్నాఁడు. దీనివలన నియమబద్ధమగు గ్రాంథిక రచనయందు నన్యదేశ్యముల నెట్లు జొనుపవచ్చుననుట దృష్టాంతీకరింపఁబడినది.

శేషాచల కవి తన ప్రయాణమున తగిలిన కంచి, వేలూరు, సేలము, కోయంబత్తూరు, మేట్టుపాళయము మున్నగు ప్రదేశములం దాను చూచిన జంతు వృక్ష క్రిమికీటకాదులను, అందందు నివసించుచున్న జనుల భాషను, ఆచార వ్యవహారములను, మార్గమధ్యమందలి యాటవిక జీవనమును, అందలి మృగములను, వానిని వేటాడు విధానమును, విపులముగా వర్ణించియున్నాఁడు. మఱియు విషయములు సులభముగా హృదయగతమగుటకు నొక చిత్రమును గూడ లిఖించియున్నాఁడు. ఇంతియే కాక భూగోళ శాస్త్ర విషయములను, వాతావరణాది సూచనలను కూడ యిందు జొనిపియున్నాఁడు. తన కాలమందలి ప్రజల నిత్య జీవితమును చక్కని వాఙ్మయ రూపమున రచనగావించిన కవులలో నీతఁ డద్వితీయుఁడు. "కవి ప్రజలలో నొకఁడు" అను సిద్ధాంతము ప్రచురముగా నున్న యీ కాలమున నీలగిరి యాత్ర కొన్ని వెలుఁగు బాటలను చూపకపోదు.

ఆధునిక కాలమున పరవస్తు చిన్నయసూరి "నీతి చంద్రికయే" గ్రాంథిక వచన రచనకు మార్గదర్శకమైనదని కొందఱు విమర్శకుల యభిప్రాయము. కాని నీలగిరి యాత్ర రచనము నీతి చంద్రిక కన్న పదేండ్లు పూర్వము కాఁబట్టి యీ మార్గదర్శకత్వము శేషాచల కవికే చెందవలసియున్నది. వచన యుగమని ప్రసిద్ధి గాంచి వచన రచనలకు ప్రాధాన్యముఁగల యీ దినములలో నిట్టి ప్రశస్త వచన రచన విశ్వవిద్యాలయాధికారులకును విద్యాశాఖవారికిని విద్వల్లోకమునకును విశేషముగ నాదరపాత్రమగుననుటలో సందియము లేదు.

దీనికి ముద్రణప్రతిని సిద్ధపరచిన తాత్కాలికాంధ్ర పండితురాలగు శ్రీమతి బి. ఆదిలక్ష్మమ్మగారిని, ప్రూఫులను పరిష్కరించిన ఆంధ్ర పండితులు శ్రీయుతులు సాళ్వ కృష్ణమూర్తి, ఎం.ఏ., గారిని అభినందించుచున్నాను.

టి. చంద్రశేఖరన్.

---

* N.B.—కోలా శేషాచల కవిని గూర్చి 1948 వ సం॥ అక్టోబరు 25వ తేదిన "త్రిలింగ" లో శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు ప్రచురించిన వ్యాస మిందలి కొన్ని విషయముల కాధారము.

# అవతరణిక.

వచనము—ఈ ధాత్రి నీలగోత్ర యాత్రాపరులగు నరుల కత్యంతోపయుక్తంబును స్వదేశ భాషాభ్యాస లోలురగు బాలుర కనవధిక వాచక వైభవోన్మేష కరంబును-సమధిగత శాస్త్ర లక్షణ విచక్షణ శిక్షితంబును నగు నీ గ్రంథంబునం బథంబునం గల యయ్యాయి సంవసథంబుల యవితథస్థితులును సకలజన సంసేవ్య భవ్య దివ్యస్థల మహామహిమలను గొందఱ కమందానందాశ్చర్యకర సౌకర్యంబులగు కొన్ని కార్యంబులను గానంబడు.

అత్యావశ్యకంబు లగుటం జేసి "ఇంగిలీషు" మొదలగు కతిపయ గ్రామ్య పదంబులు ప్రస్తుత వ్యవహారాను గుణంబుగా నిందు నయ్యెయెడలఁ బ్రయోగింపంబడియెం గావునఁ దత్తద్గ్రామ్యపరిజ్ఞానార్థం బింగిలీషు శబ్దంబుల కెల్ల నీ "*" సంజ్ఞయు గ్రామకుల పర్వత దేవతాంతర నామంబులు దక్కఁ దక్కు ద్రావిడ పదంబుల కెల్ల నీ "§" గుఱుతును నన్య గ్రామ్యంబుల కెల్ల నీ "X" సంజ్ఞయు నాదియందును గొన్నియెడల నాద్యంతంబుల యందును మీఁది కడను నిలుపంబడియెం.

*ప్రాద్యుపసర్గాదులం దక్కఁ దక్కు పదంబులమీఁద 'నజా' దులగు పదంబులు చేరునప్పుడు సంధివలన రూప భేదములం బొందిన యయ్యజాదిపదంబులకుఁ బైభాగంబుల సులభ జ్ఞానార్థంబీ (,) గుఱుతును నునుపంబడియెం. ఎట్లన్నను ఇందు మొదలి పద్యంబుననుండు కల్పకోర్వీజ మభీప్సితంబొసఁగు నను వాక్యంబునం గల కల్పక ఉర్వీజము అభీప్సితంబు ఒసఁగు నను పదంబులఁ బరపదాదిమంబులైన యచ్చులు చేరునప్పుడు కో, మ, బో, అను రూపంబులయందుఁ బోలె గుఱుతులు గొఱలుచుండు.

అంకెలతోడ వ్రాయంబడు సంఖ్యా వాచకంబులుగల యాయాయి యూరుల దూర సమీప పరిమాణంబు 'న్యూనాతిరిక్త' ంబని యెన్నందగునది.

ద్రవిడ భాషంగల యీ ழ యను వర్ణం బాంధ్రంబున లేమిం జేసి తత్స్థానంబున నీ గ్రంథంబున నీ క్రింద నుదహరించిన చందంబున ళకారంబిడి దాని ప్రక్కన ద్రావిడం బగు నా ழ వర్ణంబును లిఖింపఁబడియెం. తదుచ్చారణంబు ఱకార ళకార మధ్యగతంబు॥ తిరుమళి ।(ழி)। ఔ॥.

---

* అనవసరములని తోచుట చేతను ముద్రణ సౌకర్యము నుద్దేశించియు నీ గుఱుతులు విడువబడినవి.

# నీలగిరి యాత్ర.

## ప్రథమ ప్రకరణము.

ఉ॥ శ్రీ జనకాత్మజా లతిక చెన్నువహింప నగణ్యపుణ్య తే
జో జయశీలతాది గుణసూన వితాన మజస్రముం గడున్
రాజిల సంశ్రితాళి దనగం జొలుపారెడు రామకల్ప శో
ర్వీజ మభీప్సితంబొసఁగు వేంకట జగ్గనృపాల మౌళికిన్.

ఉ॥ శంకరుఁ డార్యమానస వశంకరుఁ డానత లోకపంక నా
శంకరుఁ డంబికావరుఁడు శాజిన్ శరుండు మహేశ్వరుండు మీ
నాంక హరుండు చంద్రధరుఁ డాదరణం బిగుకొత్త శ్రీగడే
వేంకట జగ్గరాయలకు విశ్వవిభూతు లొసంగి ప్రోవుతన్.

చ॥ సరసిజనాభ సంభవుఁడు సర్వచరాచర భూతసృష్టి ని
ర్భర నిపుణత్వవైభవుఁడు వాగ్రమణీధవుఁ డింద్రముఖ్య ని
ర్జర కృత భవ్యసంస్తవుఁ డజస్రము వేంకట జగ్గరాయ శే
ఖరుఁ గరుణాధురంధరత గల్గి చిరాయుపేతుఁ జేయుతన్.

సీ॥ స్ఫీత కారుణ్యసమేత ధూతాతంక
        జాత చేతోజాత మాత సీత
నతదివస్పతి కృతదితి సుతహృతి యతు
        లితనుతితతి పశుపతి సతి సతి
శతధృతి సుదతి శాశ్వత కళావతి కృపా
        మతి సరస్వతి సమంచిత గుణవతి
నిఖిల భూతగణ ప్రముఖుఁడు శ్రితావనో
        న్ముఖుఁడు దంతిముఖుండు పూర్ణసఖుఁడు.

శ్రీశుభాపి కళాకార్య సిద్ధులెల్ల
సతతమొనగూర్చి రక్షించు భ్రతశాల
చెన్నమల్లయ్యగోత్రు రాజితచరిత్రు
శతమఖి విభుని వేంకట జగ్గవిభుని

చ॥ ప్రకటనిజాంగమేచకవిభా కలితాబ్దము నీలకంఠకా
తుకము ఘటింప ముద్దుగల తోరపుపల్కుల నిచ్చసోమ మా
హాకములుగాఁగ జెన్నలరు నార్యశిఖావనధుర్య గంబు భా
కుకగళ సర్వమంగళను బూని భజింతు మదిష్టసిద్ధికిన్.

## నాగబంధము.

చ॥ విరతవిగాహన ధీరసిక ! వేంకటపు జగ్గపతీ ! గొడేకులో
త్తర ! హరిశాయహార శర దారద దివ్యనగేశ రాజకీ
ర్తి ! రహింగొనంగ నీరచన దీనజన ప్రియ ! భావితేందిరా
ధర ! విశదోపకారధన ! దాన కకుత్స్థ ! గభీరమానసా !॥

గీ॥ ప్రార్థనంబొనర్తు నవధరింపుము దీనఁ
బ్రకరణములు మూఁడు పరగఁజేసి,
యేను నీలగిరికి నేగిన చారిత్ర
మెల్ల వచనరచన నెఱుకపఱుతు.

## షష్ఠ్యంతములు.

క॥ శ్రీ రమణీయ గొడేకుల
నీరాకర రాజజనిత నిస్తులమణికిన్
సారగుణగణమణికి సదు
దార కృపా భరణికిన్ మహా ధితరణికిన్

క॥ ప్రశమిత శత్రువ కాదా
ర్య శర్వమిత్రునకు జగ్గరా.

(ఇచ్చట మాతృకలో రెండు పుటల గ్రంథపాతము గలదు.)

# వచనము.

శ్రీమంతులు ధీమంతులు గుణవంతులునగు హిందూ ప్రముఖ నిఖిలజనపరంపరం బెంపారుచు మిగులం జెన్నగు చెన్నపురంబునకు * గవర్నర్ అండు కమాండర్ యిన్ చీఫ్ అనంబడు నధిపతియు నఖిల సేనాపతియుగా నియుక్తుండయి యుండు * యూరోబ్దేశ సముద్భవుండగు * హిస్ ఎక్సలెన్సీ లెఫ్టనెంట్ జనరల్-దీ మోస్ట్ నోబిల్ జార్జి మార్క్విస్-ఆఫ్-ట్వీడేల్ కే.టి.అండ్ సీ బీ. యను పుడమిఱేఁడు దనపరివారంబుతోడ నీలగిరికి నరుగునెడఁ దత్పరిజన ప్రవరులలో నొక్కరుండగు * క్వీన్స్ డిప్టి అజిటన్ట్-జనరల్ అను నుద్యోగము వహించి యుండెడు * లెఫ్టనెంట్ కర్నల్ తామస్ సిమ్సన్ షాట్, సి. బి. దొరవెంట నతని యాఫీసులో హెడ్ క్లార్కు అనంబడు లేఖక ప్రముఖుండును మత్సఖుండునగు మాంగాడు శ్రీనివాస మొదలారికిని క్లార్కు అనంబడు లేఖకుండనగు నాకు న య్యాచార్యవర్యంబునకుం జను కార్యంబని వార్యంబయ్యె.

కలియుగ హాయనంబుల నాలుగువేలం దొమ్మన్నూటు నలువదియేడును శాలివాహన శకాబ్దంబులు వేయు నేడు నూటు యరువది యొకమిదియుం బోవం బరాభవ వర్షంబున వైశాఖ మాసంబున బహుళ పక్షంబునఁ దొలుఁ తిథికి సరియగు క్రైస్తు శకంబున వేయు నెనమన్నూటు నలువది యాఱవ సంవత్సరంబు మే నెల పన్రెండవ తేది భాను వాసరంబు దివంబునం ద్వితీయ ప్రహరంబున సార్ధఘటికాద్వయ పరిమితంబగు నవసరంబునం జెన్న పట్టణంబునకు సన్నికృష్టంబున రక్కసికేని చక్కటినుండు చింతాద్రి పేటయందు మదీయంబగు నిశాయంబు వెడలి నా చెలికాఁడగు శ్రీనివాస మొదలారిం గూడి పశ్చిమాభిముఖుండనై యద్దండ నుండు త్ర్యగ్గమ దేవతయగు నాది పొన్నప్ప దేవళంబు నకుంజని తద్దయు భక్తి నద్దేవికిఁ బ్రణమిల్లి చింతాద్రిపేటకుం బడమటి దిశ నర్థక్రోశ దూరంబగు ప్రదేశంబునంగల కాలేజియనం బ్రసిద్ధంబగు నధికారుల పాఠశాల యందాఱు సంవత్సరములుగఁ బ్రతిష్ఠింపఁబడియుండు "మాగ్నెటిక్ అబ్జర్వేటోరీ" యనంబడు నయస్కాంత పరీక్షా శాలయను "నాఫీసులో" మాగ్నెటిక్ అబ్జర్వేటోరి అసిస్టాంట్ అనంబడు నయస్కాంత పరీక్షాశాలా సహాయుండును మదీయమైత్రీ విధేయుండునగు రామధేను రామానుజ నాయక నామధేయుని సదేశంబునకుంబోయి యారేయి తన్నివేశంబున నిష్టగోష్ఠింబరితుష్టుండనైయా త్రియామ యతీతత్రియామయగుచుండ నమ్మిత్రంబు నా మంత్రణంబు చేసి యన్నెలవు నిర్గమించి పూవిరుందమల్లియను నూరితోఁ జేరిన పేట మఱునాఁడహంబునం బదిగడియలకుఁ జేరితి.

చింతాద్రిపేటకు నాపేటకు నేడు (7) కోసుల దవ్వగలదు. అందు వివిధ వస్త్రాది వస్తువిస్తారంబులగు కొన్ని యావరణంబులును బధిక జనోపయోగ్యంబులగు భోగ్యపదార్థంబులు నొక్క సత్రంబును జూపట్టెడు. మఱియు నక్కోటిక నికటంబున దక్షిణ భాగంబున భాగవతాగ్రగణ్యుండయి ద్రవిడ భాషం గందాళ ముదలి యాండానను పేరంబరఁగి స్వమత సిద్ధాంత పద్ధాశయుండగు భగవద్రామానుజముని సార్వభౌమునకు భాగినేయుండును బరమభక్తి విధేయుండును మహాశయుండునగు దాశరథి నామధేయుండు నెలవు కొనియుండు దేవళంబొండుగలదు. హారితవారణాభిధానుండగు శ్రీ వైకుంఠ నాథుం డమృత వల్లీనామ కమలాసనాథుండై యద్దేవాలయంబు నంద యింపొందుచుండు. ఆ సుకృతి నందుఁ బ్రకృతమందు ప్రాకారంబునం బచ్చపెర మాళ్లని

---

* ఇది పూందమల్లియని వాడంబడు.

వాక్రుచ్చెదరు. ఆ పెరుమాళ్ల కిప్పుడు తిరునాళ్లు నడుచుటలేదు. మొదలియాండానను సుధీనిధికి మేషమాసంబునం బూర్వఫల్గుని మొదలు పునర్వసువు తుదిగ సంవత్సరోత్సవం బెల్ల భక్తుల యుల్లంబుల కుల్లాసంబుగాఁ బ్రవర్తిల్లెడు. చెన్నపురంబునం గాఁపురంబుండు నద్దంకి వరదప్ప సెట్టియు, రవ్వా రామానుజ సెట్టియు నను వైశ్యకుల శ్రేష్ఠులగ్గుడికిం గట్టెదురం గుడికూడములనేసి గృహంబులు ప్రత్యగ్రంబులుగా గట్టించి సమగ్రంబులగు గృహోపకరణంబులతో సకుటుంబులగు శ్రీవైష్ణవ కులతిలకంబులకు సమర్పించి యయ్యగ్రహారికుల కందఱకుం బ్రత్యేకంబుగ మాడ చొప్పున మాసాశనంబు దప్పక యిప్పించెదరు.

శిథిలీ భూతంబగు ఖేయంబును ధ్వజస్తంభంబునుగల యొక్కకోట యప్పూవిరుందమల్లిపేట కివ్వలఁ గోసెఁడు దవ్వున దారికి దక్షిణంపు కడఁగలదు. ఆ సాలంబునకు బయలఁ గలకాలంబు† నింగిలీషు రాణిగారి రాణువతో జేరిన "సోల్జరుల" ను సైనికులనేకులను, నొక్కొక్క కారణంబున ఆఫీసరులనంబడు పడవాళ్లు గొందఱును నక్కడనుండు టంజేసి కమాండింగ్ ఆఫీసరు అనంబడు నొక్కవళ నాయకుండును సర్జన్ అను నొక్క వెజ్జును, చాప్లెయిన్ అను నొక్క యొజ్జయు నిచ్చలచ్చటనుందురు. మఱియుం గొన్ని మేడలు మిద్దెలు క్రైస్తు గుడియు బారక్సు అను సైనిక గృహవాటికయు నింగిలీషు భాషా పాఠశాలయు హాస్పటల్ అను చికిత్సాశాలయు నింగిలీషు తెరువరులవిడిదియు నున్నయవి. పెన్షన్ అను ననుజీవికంగొని జీవించు నింగిలీషు......నేన యచ్చోన కొండొకయున్నయది.

ఆ సాలంబును సైనికులును బడవాళ్లులోనగువారును దద్వసతులును నచ్చటి దళనాయకుని యధికారంబునకు లోనయియుండు. ఆ కోట చెంగట నొక్క కొటికయున్నయది. అది చిన్నది. పణ్యవీథికయున్నది. తెరువరులకు వలయు భోజ్యపదార్థంబులు ప్రాజ్యంబుగ దొరికెడు.

అయ్యూరికిఁ గొండొక మేరనుండు పూవిరుందమల్లియను గ్రామంబు పై గ్రామంబుకన్నఁ జిన్నది. దానం దాలుకు కచ్చేరియుఁ దాలుకు మునసఫు కోర్టునున్నయవి. అవశ్యకంబులగు పదార్థంబులచ్చోట నలభ్యంబులగుటంజేసి యక్కోట కడ నుండు నూరనుండియ తెప్పించికొనవలయు. పూవిరుందమల్లియందు దారికిం జేరువ జక్కులదొర దిక్కునం దిరుక్కచ్చినంబియను భాగవతోత్తము గుడి గానంబడియెడి. అనన్య సామాన్య సౌజన్యాది గుణగణావలంబియగు నక్కచ్చినంబి మహిమంబులు మిక్కిలి యక్కజంబులు. వాని నిట్టిట్టివని గట్టిగఁ దుదముట్ట బయలువెట్టుటకు నాశక్తి మట్టగుటంజేసి కొంతవట్టు వక్కాణించెద. విపన్నజన చాతక శరదుండగు కాంచీ వరదు నెడం దనకుఁ గల యనన్యాదృశంబగు భక్తి విశేషంబున కనురూపంబుగ నిజనివాస స్థలంబగు నీపూవిరుందమల్లి......నుండి భూపురంధ్రికిం గాంచియగు కాంచికిం జని పెరుందేవీ సనాథుండగు కరిశైలనాథునకు నాలవట్టంబుఁ బట్టు కైంకర్యంబు సౌకర్యంబుగా సలుపుచుండె. ఒక్కనాఁడు వ్యాస్తుని సన్నిధిం బరిచర్యావశంబునం బెద్దయుం బ్రొద్దు దడసి తన్నిదేశంబున నిజనివేశంబున కరుగుదేరం దెరువునం దఱుచగు నుఱుములు మెఱుములు వళ్లుఁ గరంబు భయం

---

† ఇంగిలీషు వారి వర్ణాచారంబున మగలకుం బోలె మగువలకుం బ్రభుత్వంబు వహించుట గలిగియుండుటం జేసి విక్టోరియా యను నామంబు గల రాజకుమారిక దన కన్నదమ్ములు లేమి నిక్కాలంబునఁ బైతృకంబగు రాజ్యంబు దాన పరిపాలనంబు చేసెడుఁగాన నింగిలీషు...రాణువ రాణిగారిదని వక్కాణింపఁబడియెడి. పురుష ప్రభుత్వకాలంబున నది రాజుగారిదని వాడంబడు.

కరంబుగ మిన్నుదన్ని యమోఘంబులగు మేఘంబులు గర్షకులుహర్షింపవర్షింపఁదొడంగె. ప్రాణిసంచారవిముక్తంబగు నన్నక్తంబున భక్తజనవిధేయుండుగావున నవ్విరక్తునకు సహాయుండై యాపద్విమోచనుండగు పుండరీక విలోచనుం డతనికి లోచనగోచరుండు గాక వెలుంగు మాత్రంబు దన్నేత్రంబులకుం దోఁప నొక్క శుంఠా కరకంజంబున బట్టికొని యుట్టలంబగు నట్టడి నతని వెంబడి నికేతనంబు దాఁకఁ దోతెంచె. అయ్యంతరంగ భక్తసత్తమునితో నప్పురుషోత్తముండు సల్లాపంబు సేయ మెఱసిఁగి నతని కెఱంగి పరిచరింపం దొడంగిన సాత్త్విదనంతావతారుండగు శ్రీభాష్యకారున కావశ్యకంబులగు కరిణీయంబు లద్దేవదేవు వలన దానెఱింగి యెఱింగించె. వెండియు నిట్టి మహామహిమంబుల కాటపట్టగునట్టి కాంచీపూర్ణునకు నిరవధిక దయాపూర్ణుండై ముమ్మాఱు సందర్శనం బొసంగిన యానుదర్శనధరు మూర్తిత్రయంబు నానంబి నిలయంబునంద వరద రంగ నాయక వేంకటేశ్వరులనం బేర్కొనంబడుచుఁ దేజరిల్లు. అవ్వరదరాజునకు వృషభ మాసంబున బ్రహ్మోత్సవంబు నడుచుచున్నయది. అక్కచ్చి నంబికి సంవత్సరోత్సవంబు కుంభ మాసంబున ధనిష్ఠా నక్షత్రంబున దొరకోలును మృగశీర్షంబున వీడుకోలునుగఁ బ్రవర్తిల్లుచున్నది. ఈ మహామహుఁడు సెట్టికొలంబునం బుట్టిన వాఁడగుటం జేసి చెన్నపట్టణంబునందలి మహోదారులగు బేరులు సకలోత్సవంబులు మహావిభవంబులుగ నడిపించెదరు. మఱియు నాగ్రామంబునం బ్రోవకు వైవస్వత దిశ వైద్యేశ్వరుండను పేరంబరగు గిరిజాప్రాణేశ్వరుని దేవళం బొకంటుగలదు. అమ్మహాదేవునకు బ్రహ్మోత్సవంబిప్పుడు లేదు.

పూవిరుందమల్లిపేట కవ్వలఁ గొండొక దవ్వునఁ బథంబున కుత్తరంబున దక్షిణ జగన్నాథంబనియు మహీసారపురంబనియుఁ బ్రశస్తంబయి ప్రస్తుతంబున నలవలచేఁ దిరుమళి (ప్రి) శైయని వ్యవహరింపఁబడు నొక్క గ్రామంబుగలదు. ఆ గ్రామంబున నభిరామంబగు దేవధామంబునఁ దిరుమంగవల్లియను జగన్మాత తోడ జగన్నాథాభిధానుండగు శేషశయానుండు భృగుమహర్షిశ్రేష్ఠువలనఁ బ్రతిష్ఠింపబడియెనని పెద్దలు సెప్పెదరు. అదేవాగారంబునందు ద్రావిడంబునఁ దిరుమళి (ప్రి) శైయాళ్వారనఁ బేర్కొనంబడు భక్తిసారుం డను తపసిమిన్న సన్నిధి పెన్నిధివోలె నున్నయది. అమ్మహర్షిశిరోభూషణుని నిర్దోషంబులగు మహత్త్వవిశేషంబులు శేషభాషాపతులకు దక్కఁ దక్కొరులకు లెక్కింప నశక్యంబులని యభిజ్ఞులు పెక్కడల వక్కాణింపుదురు. జగన్నాథునకు మిథున మాసంబునను, సుదర్శనావతారుండగు భక్తిసారుండను శుభాకారునకు మకరమాసంబునను, బ్రహ్మోత్సవ సంవత్సరోత్సవంబులు నడుచుచున్నయవి. చెన్నపురంబున "షెరిఫ్" ఆఫీసు మానేజరుగానుండు చిత్తుకాటి వేంకటసామి నాయఁడను బలిజకొలంబునం బొడమినయతం డద్దేవళంబున శేషవాహనంబును ధ్వజస్తంభంబును కల్పించి శీర్ణంబులైన గోపుర విమాన ప్రాకార ప్రముఖంబులు చక్కఁజేయించె. మఱియు నయ్యెక్కనాక కుక్కంటి గీమున్నయది. అక్కాల కాలున కిక్కాలంబున బ్రహ్మోత్సవంబుత్సన్నంబయ్యె.

పూవిరుందమల్లిపేటఁ గృత భోజనుండనై మధ్యాహ్నంబునం దరలి సాయాహ్నంబున భూతపురాఖ్య నామధేయంబగు శ్రీ పెరుంబూదూరను నూరితోఁ జేరిన వేంకట రంగపిళ్ల సత్రంబున విడిసితి. పూవిరుంద మల్లిపేటకుఁ బెరంబూదూరికి నయిదుంగాలు (౫।) కోసు పరిమాణంబగు దూరంబుగలిగె. అప్పెరుంబూదూరు గొప్పదియై యొప్పారుచు సవిధవర్తి బహుళజలాశయంబు గావున వివిధపదార్థసంపన్నంబై యున్నయది. అందుఁ గొన్ని సత్రంబులు శ్రీ వైష్ణవ గేహంబులుఁ జాత్తనివారి యిక్కలుం బెక్కు.

గలవు. అయ్యూరి యందా సూరివంశంబున ననంతాంశంబునఁ గేశవసూరికి
సూనుండై యనూన తేజోవిరాజమానుండై రామానుజాభిధానుండగు త్రిదండ
పాణి కోవెల యొండుగలదు. యాదవవాది మాయావాది భంజనంబును గూరేశదాశరథి
ప్రభృతి సుకృతి జనమనోరంజనంబును మొదలగు సద్గురు చూడామణిచరిత్రంబుల
పరిమితంబులు నపగత దురితంబులుఁ జిత్రంబులు బవిత్రంబులు నైనను, మిగులం బ్రశస్తం
బులు గావున గ్రంథ విస్తర భయంబునఁ బ్రస్తావింపనైతి. లీలాగృహీత మానుష వేషుండగు
నాశేషాంశునకు మేషమాసంబున శతభిషగార్ద్రాద్యంతంబులుగ సంవత్సరోత్సవంబును
మకర మాసంబున నార్ద్ర మొదలు పుష్యమి తుదగ గురుపుష్యోత్సవంబును మఱియు నానా
విధోత్సవంబులును దివ్యచక్షుర్జనలోచనాసేచనకంబులై జరుగుచున్నయవి. యతిరాజ
నాథవల్లియను దేవీమతల్లికతోడం గూడి యాదికేశవనాథుండగు వైకుంఠధాముఁ డద్దేవ
ధామంబునందు నభిరాముండైయున్నవాఁడు. ఆశేషశాయికి మేష మాసంబునఁ
జిత్రా నక్షత్రంబున ధ్వజారోహణంబును శ్రవణంబున నవరోహణంబునుగా బ్రహ్మోత్స
వంబు వర్తిల్లుచున్నది. మఱియు నాభూతపురియందు భూతపురీశ్వరుఁడను పేరం
బెంపారు వృషకేతను నికేతనంబుగలదు. ఆ భూతపతికిఁ దిరునాళ్లు నడుచుటలేదు.
పెరుంబూదూరికిఁ బడమటి ప్రక్క నొక్క తటాకంబు కమలాకరంబుఁ బోలెఁ గంకణోర్మి
కాలంకృతంబై పుత్తేరి యను పేరఁ గాలుచున్న యది. తత్తటాకంబునకు దక్షిణ
తటంబు నికటంబున మార్గంబునకు భర్గసఖుని వంక వేంకటరంగపిళ్లయను ధార్మికునిచే
నిర్మితంబులైన విశాల సత్రహర్మ్యంబులు రెండు నొక్క యిక్కన కవయైయున్నయవి.
ఆ సత్రంబు గోత్రామరక్షత్రియవైశ్యశూద్రులకనియుఁ దత్స్వార్థంబెఁ గిలీషువారు
లోనగు వారల కనియు నియమితంబులై యున్నయవి. అన్నెలవులం గొన్ని యంగ
డులు నిండులు నుండుటంజేసి తెరువరుల కక్కఱ గల యాహార వస్తువులు గొన్ని
సమకూరెడు.

పదునాఁడవ తేది సౌమ్యవారంబునాఁడు యామినీ ద్వితీయయామంబున
నందుండి పయనంబై యేడుంబరక (22) కోసు దూరంబున నుండు రాయాజీ సత్రంబుఁ
జొచ్చి యచ్చటనుండి చక్కని ప్రత్యగ్దిక్కున నీలగిరి కరుగు తెరువుఁ బరిగ్గించి దక్షిణ
పశ్చిమ దిశకు మరలి, మఱునాఁ డుష్ణకిరణుండు నభోమధ్యగతుండగుచుండఁ గాంచీ
నగరంబుఁ గాంచితి. అక్కాలం బుత్సవ కాలంబగుట విమర్శించి సుదర్శనపాణి
సందర్శనంబుగోరి యవ్వీడు చేరితి.

సత్యవ్రత క్షేత్రంబనం దనరు నాపురంబు సిరులకు దాపురంబై మహిమహిళకు
నూపురంబై... విష్ణుకంచి శివకంచియను నిరువెలుంగుల విభక్తంబై యున్నయది. అవీటి
యందు వరదరాజైకామ్రేశ్వరుల భవనంబులు భువన ప్రసిద్ధంబులై ఘనతర శిలాని
బద్ధంబులై యొప్పుచున్నయవి ఆద్దేవావాసంబుల నడుమ నెడపడక యిండులుం జుట్టం
జేసి రెండు గ్రామంబులు నొండొంటి నొరియుచు నఖండాకారంబై యొక్కవీథి సార్థ
క్రోశ పరిమితంబగు దవ్వున నిడ్పాటిల్లెను. ఆ ప్రోలున నాలుగేను వేలిండులుండునని
తోచుచుండెడు. మఱియు నప్పట్టణంబున ననేకులగు వైరాగులకు ననవరతంబు
నియతంబుగ భుక్తియుక్తంబగు సామగ్రులనిచ్చు సదావృత్తియను నుత్తమధర్మంబునకుఁ
బాత్రంబులగు సత్రంబులు గొన్నియు నుత్సవదినంబుల దీనానాథ జనంబుల కన్న పానీయ
దానంబులకుఁ దానంబులుగ సత్కర్మ రతుల వలన నిర్మితంబులగు ధర్మశాలలు గొన్నియు,
వైదేశికులకు విడియ ప్రదేశంబులుగఁ బుణ్యచరితులవలన రచితంబులగు సత్రశాలలు
గొన్నియు నున్నయవి. వీనిలోన గడనుడువంబడిన సత్రంబులు పదిలంబులుగ నరయ
నుచుపంబడి పట్టిజన్నిగట్టి ఉత్సవ కాలంబులఁ జెట్టితనంబున ధనంబు ఘనంబుగ రాక

కాని జనంబులోపల రాక కొప్పరు. నిజకులోచితాచార భాసురులగు భూసురులు లోనగు జనులెక్కువగఁ దద్విపరీతవర్తనులగు నత్త జ్యాతి జనులు దక్కువగఁ గ్రిక్కిఱిసి యున్నవారు. మఱియు నన్నిగమంబు నిగమాధ్యయన యజనాది నిష్ఠాగరిష్ఠులగు దేశిక శ్రేష్ఠుల వలనను, నానావిధ ధాన్యాది వస్తువిస్తారంబులగు నాపణ వారంబుల వలనను నంతరాంతర నిబద్ధ సమిద్ధ ఘంటికా వివిధ మంజుల సాలభంజికా పుంజ విరాజమానంబులగు వరదరాజైకామ్రేశ్వరాది దేవతా విమానంబుల వలనను దద్దేవతానిలయ ప్రాంగణ లోహ శృంఖలా సద్ధంబులై సముత్తుంగంబులగు మాతంగంబుల వలనను వివిధ విచిత్ర గతి జిత శరధితరంగంబులగు తురంగంబుల వలనను నభంగురరథాంగంబులగు ఖర్వాఖర్వ శతాంగంబుల వలనను సతతాపదాతవినుత చరితోన్నతులగు కులసతుల వలనను నాటలఁ బాటల మాటలఁ దేటలు పచరించుచుఁ జంచల దృగంచలవంచిత భుజంగపుంగవాంతరంగలగు చారుతర వారతన్వంగుల వలనను నశ్వత్థ కపిత్థ రంభా జంభా శోక మధూక బంధూక జంతుఫలకంటకఫల శ్రీఫల కరక క్షురక హయమార కాభ్రపుష్పఘనపుష్ప సర్వతోభద్ర పారిభద్ర లకుచ లికుచ శ్రీపర్ణ పర్ణతాల నారికేళ రసాల సాలాది విశాల సాల జాలంబులును గలకంఠ కలకంఠ శుక పిక శారికా ప్రముఖ వికిర ప్రకర కలకలాయమానంబులును గ్రమనీలశిలాసోపాన కలిత లలిత సరోవరంబులును వివిధ సుగంధి బంధుర సౌగంధికాది కుసుమ విసరంబులుం గల యారామంబుల వలనను నభిరామంబై యున్నయది. అచ్చోఁ దాలూకు కచ్చేరియుఁ జెంగల్పట్టు జిల్లాతోఁ జేరిన భాండాగారపు కచ్చేరియు నుండెడు

విష్ణుకంచియందుఁ బెరుందేవి యను నిందిరాదేవికిం బ్రాణప్రియుండును వరద రాజాహ్వయుండు నగు మందరధరుం డుండు విశాల మందిరంబొండు సుందరంబై యుండు. అయ్యరవింద సుహృత్తేజునకు దేవరాజను వేఱొక్క పేరు పెంపారు. ఆ చైత్యంబునకుఁ బ్రాచీ ప్రతీచీ భాగంబుల గోపురంబులు రెండుండెడు. అందుఁ దూరుపు గోపురంబు నూఱు మూరల పొడవు గలయది. పశ్చిమ గోపురోన్నతి పరిమితి నామతికి నిశ్చితంబు గాదు గాని దానికన్నఁ జిన్నదియై యున్నయది. అంతర్గత భాసమాన విమాన జాలంబై చూడ్కికి వేడ్క సేయుం జాలు ప్రాకారంబు గ్రాలుచున్నది. దానం గోటికన్యాదానతాతాచార్యాభిధాన కల్పితానల్పశిల్ప శతస్తంభ మండితంబగు మండపం బాదిగఁ గతిపయ మండపంబులును బసిండి తగడుల నైగడు గరుడస్తంభంబును బావన జీవనంబులగు ననంత పద్మ సరోవరంబులును గతిపయ దేవతాయతనంబులునుం గలవు. హస్తిగిరి మస్తంబునఁ గౌస్తుభాభరణుండగు దేవరాజు దేజరిల్లెడు. ఆ కొండ కొండొక హెచ్చులోచ్చుగ ముప్పది యడుగుల పొడవు గలయది. అపవృత సంశ్రితార్తియగు నత్తివర దుండను దేవతాచక్రవర్తి దారుమూర్తి యొండు పశ్చిమ ద్వార పరిసరవర్తియగు నూఱు కాళ్ల మండపంబునకు దండ నుండు నాయనంత సరోవరంబున నుండెడు. అతీతంబైన తారణ వర్షంబున వర్షంబు లేమిం జేసి చెఱువులు దొరువులు నదీ నదంబులు మొదలగు జలాశయంబులు శోషించె. వఱపు నెమ్మేపించె. ఆకాలంబున నకాసారంబా వాసంబుగ నుండు నయ్యత్తివరదుం డెల్లవారికిఁ దెల్లంబుగఁ గానంబడి నానావిధ పూజా విధానంబుల నాప్యాయనంబునొందె. అయ్యత్తివరదుండను పురుషోత్తముఁ డుండు చోటొక్కింత శీర్ణంబై యుండ ధార్మికులు యథాపూర్వంబుగ నిర్మించిరి. పూర్వద్వారంబునకుఁ జేరువఁ బద్మసరసి విలసిల్లెడు. అక్కోవెలకు వెలపల దక్షిణ భాగంబున వేగవతి యను పుణ్య ద్వీపవతి మహాప్రభావవతియై నుతికెక్కెడు. అద్దేవ వృషభునకు వృషభమాసంబున నప్రతీకాశ విభవంబగు బ్రహ్మోత్సవంబును దక్కగల సకలోత్సవంబులు నయ్యాకాలంబుల

జరుగుచున్నయవి. నేత్రోత్సవకరం బగు నచ్చటి బ్రహ్మోత్సవంబుఁ బోలిన యుత్సవంబు తదితర దివ్యదేశంబుల నెందేనియు లేదనియు నక్కడి గరుడవాహన సేవ మిక్కిలి యొప్పు ననియు నక్కడక్కడ జనశ్రుతి శ్రుతిగతంబగుచుండెడు.

శివకంచి యందు మహామహిమగల కామాక్షియను దాక్షాయణికిఁ బ్రాణేశ్వరుండయిన యేకామ్రేశ్వరుండను నభవుని దివ్యభవనంబు భువన స్తవ్యంబై యున్నయది. దానియ ప్రాచీ ప్రతీచీ ప్రదేశంబుల గోపురయుగ్మం బుద్దీపించుచున్నది. అందు దక్షిణగోపురోచ్ఛ్రయంబు నూట యిరువది మూరలు గలయది. పడమటి గోపురంబేను గనుగొన్నవాఁడ గాను గాని దానికన్నఁ జిన్నదట. పూర్వోక్త గోపురద్వయోచ్ఛ్రయ పరిమాణంబు కున్నొక్కతఱి యాత్ర ముఖంబున నెఱింగిన మదీయసుహృత్తముఁడగు రామధేను రామానుజనాయని వలన నెఱింగినవాఁడ. మఱియు నామంచుమలయల్లునిల్లు సముచిత సహస్రస్తంభ ప్రభృతి కతిపయ మండపంబుల వలనను శివగంగయనం గంపానది యనం బెంపారు కాసారంబుల వలనను దోరంబగు ప్రాకారంబు వలనను మిగుల మనోహరంబై యున్నయది. ఆ శివాలయంబు వరదరాజ దేవాలయంబుకంటె విస్తృతంబు. ఆ తెఱగంటి యింటికి బయలఁ దైర్థిక ప్రార్థనీయంబయి సర్వతీర్థంబను పావన తరం బగు సరోవరం బొండుగలదు. దానియందెన్నండును మండూకంబు లుండవట. కామాక్షియను మాహేశ్వరి భవనం బేకామ్రేశ్వరుని గేహంబునకు బాహిరంబునఁ గొండొక సన్నికృష్టంబున గోపుర చతుష్టయోపేతంబయి విఖ్యాతంబయి వేఱుగ దైవాఱుచున్నయది. శాశ్వతంబుగఁ బ్రతిష్ఠాపితంబగు కామకోటియను యంత్రపీఠంబున నాలోకమాత నిస్సమాధిక విభవ సమేతయై యున్నయది. అమ్మీనాంకహరునకు మీన మాసంబున బ్రహ్మోత్సవంబయ్యెడు. వెండియు నద్భుతావహచరిత్రంబగు నాసత్యవ్రతక్షేత్రంబున దీపప్రకాశాది హృషీకేశాలయంబులును గచ్ఛపేశ్వరాది మాహేశ్వరాలయంబులుం బెక్కులుగలవు. నాఁటిమాపటివేళ దంతావళవాహనారూఢుండయి మఱునాఁడు హర్మ్ముఖంబునఁ గృత మహోన్నత సుందర స్యందనారోహణుండయి వీథుల విజయంచేసిన వందారు జనవరదుండగు వరదునింగాంచి సంతసించితి. ఇంతకుమున్నె నేఁ గనుంగొన్న తత్తద్దేవాలయోత్సవకాలంబుల దర్శనోత్సుకులై వచ్చు జనంబులకంటె నీదేవరాజోత్సవాగత జనంబులెక్కుడుగ నాకుఁ గానంబడియె. ఆకరణియ లోకులచే వర్ణింపఁబడియెడు.

పదు నాలుగవ తేది గురువారోదయంబునఁ గంచి నిర్గమించి మధ్యాహ్నంబున నోచేరియను నూరికింబోయి యన్నెలవున నా కన్న మున్న విడిసియున్న నావారె నీలగిరికి నరుగు వారిం జేరితి. రాయాజి సత్రంబున కవ్వల నీలగ్రామంబునకుం బోవు చక్కని త్రోవ నయిదుం బదిక (౫౨) కోసు మేర చాలిసెట్టి సత్ర బును నచ్చ్యోడకు నాలుగు (౪) కోసుల దవ్వున నోచేరియుం గలిగి యున్నయవి. చాలిసెట్టి సత్రంబున కవ్వలం గోసెఁడు దవ్వునఁ గల దామల ను గ్రామంబు చెంగల్పట్టుకకు నెల్లయయ్యె. అవ్వల చిత్తూరి * జిల్లా.

ఓచేరి యనునది చిన్నదియైనను నైగిలీషు తెరువరులకు విడిదిగ నొక్కయిక్కయు ద్విజులకుఁ బదజులకు సుప్రయుక్తంబుగ విభక్తంబయి ధార్మిక నిర్మితంబైన యొక్క సత్రశాలయు నక్కడ నుండుటం జేసి పథికులకు వలయు నాహార పదార్థంబులు గొన్ని చేకూరుచుండెడు.

---

* జిల్లా యనఁగా సరహద్దు.

పదునేనవ తేది భార్గవ వాసరంబునం బతంగుం డస్తంగతుం డయిన పిదప నొక్క గడియకక్కడనుండి వెడలి నాలుగు ముప్పాతిక ($1\frac{3}{4}$) కోసున నున్న వాలాజాపేటను నక్కొకటిక కు నొకటియు నరపరక ($1\frac{5}{8}$) కోసునంగల రాణీపేటను నప్పేటకు నొకటియు నరముప్వీసము ($1\frac{7}{8}$ కోసుననుండు పాలేటినిదాటి యయ్యేటి యావలి దరికి నాలుగునర ముప్వీసము ($4\frac{7}{8}$) కోసు దవ్వున నివ్వటిల్లు వేలూర ను గొప్ప సంవసథంబు మఱునాఁటి యహంబున ఘటికాదశకంబునకుఁ బ్రవేశించితి. పూర్వాహ్ణమున మల్లి దొరఁగాని వేలూరు నేరుదాక నిప్పుకల నెకలఁబోలి సకల జనాలికి జాలిగొలుపం జాలిన పడమటి గాలియు దుస్సహ దేహతాపంబగు నాతపంబును వేడ్రంబుగఁదీండ్రిల్లు చుండె. పాలేటి పరిణాహంబు త్రిపాద క్రోశ పరిమాణంబు. ప్రవాహకాల మునం దక్కఁ దక్కిన కాలంబున నయ్యేటఁ గృపీటంబు లింక కుండవంట.

వేలూరు విరివిగలయది. * కంపెనివారి దండుకొండొక యున్నది. మండీల్లు మళిగలు జవిళీలు లోనగు నంగళ్లు మిగులం గలవు. అనురూపంబులగు నానా రూప ధాన్యంబులు, ఫలంబులు, శాకంబులు ననేకంబులుగఁ జేకుఱు. ఆ తలంబు పృథగ్విధ జాతి జన బహుళంబు గావున నవిరళ సుఖావహంబుగఁ గానంబడదు. వీథులు సంబాధం బులు గావున హేయంబులై యున్నయవి. ఎంగిలీషువారి విడిదియుఁ దాలూకు కచ్చేరియుఁ గొన్ని సత్రంబులు నున్నయవి. ఎనిమిది నెలలుగ వానలేని యచ్చో నద్దివ సావసానంబునఁ గొండొక వృష్టి కృషీవలతుష్టి నుత్పాదించె. వేలూర నొక్కకోట గలదు. ఆ సాలంబున జలకంఠేశ్వరుం డను గరళకంఠుండుండు నిశాంతం బొండు గలదు. తద్గ్రామ పూర్వికాధికృతులగు తురుష్కుల దేవగేహ గర్భంబున కటకగ నిడిన దృఢతరంబగు కుడ్యం బొక్కటి గానంబడుచుండెడి. ఆ వామదేవధామంబనల్ప శిల్పనైపుణ్యోద్దామంబులగు మండప ప్రముఖ శిలాస్తోమంబుల నభిరామంబైనయది. అయ్యది యాధునికాధికారులచే నాయుధనికాయ్యంబుగఁజేయంబడియె. మకర ప్రకర శరణంబగు పరిఖావరణంబున నుల్బణంబగు నవ్వరణంబున నానావిధ సౌధ నికురుంబంబును నధునాతన దేశాధీశ కేతన పుంగవంబును నుండెడు. వెడియు నక్కోటలోఁ గుంపెనీవారి కూటువతోఁజేరిన జోదులుఁ గమాండింగ్ ఆఫీసరను నొక్క దళనాయకుండు నున్నవారు. వేలూర నొక విశాల శైలంబుగలదు.

పదునాఱవ తేది శనివారము త్రియామ ద్వితీయ యామంబున నా గ్రామంబు నెడవాసి (7) సప్త క్రోశ దూరంబుననుండు పళ్లికొండయను కొట్టిక నపరదిన ప్రాహ్ణంబున డాసితి. వేలూరికిం బళ్లికొండయను నూరికి నించుమించుగ మధ్యంబున విరించిపురంబను సంవసథంబు చూపడియె. అయ్యెడ మార్గసహాయుండను భర్గ డాకితజన కల్పవల్లియగు మరకతవల్లియను మహాశక్తికనురక్తుండయియుండు దేవళం బొండుగలదు. అది పద్ధతి కర్ధేశ దిశ నరక్రోశ దూరంబున నుండుకతంబునఁ దద్దేవతా సందర్శనంబు సమకూరదయ్యె. ల త్ర గ గ్రే

* ఎంగిలీషువారి దేశంబైనయిలావృత ద్వీపంబునకు యూరోప్ అనియు దానికి నీ జంబూద్వీపంబు తూరుపుగా నుండుటంజేసి యీస్టిండియ యనియు నెంగిలీషుభాష వ్యవహరింపఁబడుచుండు. అట్టి యీ తూరుపు జంబుద్వీపంబు నెంగిలీషు దేశాధికారిణియగు రాణీయొద్ద గుత్తగొని యేలుచుండువారి యుమ్మడి సభ ఈస్టిండియ కంపెనీ యని చెప్పఁబడుచుండు. అట్టి ఈస్టిండియ కంపెనివారు కంపెనివారనియుం బర్యాయంబుగ వ్యవహరింపంబడియున్నవారు.

పల్లికొండ యను నూర న్యూనాధిక్యంబుగ మనుష్యాగారంబులును నగ్రహారంబును నాపణవారంబును దాలూకు కచ్చేరియు నింగిలీషు బాటసారుల విడిపట్టును గనుపట్టెడు. తెరువరుల భుక్తికుపయుక్తంబులగు కొన్ని పదార్థంబులున్నవి. అన్నెలవున రంగనాయకుండను శ్రీ వైకుంఠనాయకుండుండు సదనంబొండు గలదు. ఆ ప్రాసాదంబున భక్తజనాభీష్టసంధాయకుండగు నా రంగనాయకుండు హృదయంగమమగు భుజంగతల్పంబున ననల్పసుఖుండు నుదఙ్ముఖుండునై శయనించియున్నవాఁడు. అక్కమలనాభు నాభికమలంబునఁ గమలభవుండు వామభాగంబున నతాభిమతప్రద పదకమలయగు కమలయు నఖిలఖలకరుణాధూర్వహయగు సర్వారాధ్య రారోహయు నున్నవారు. నమజ్జనదోహదప్రదాయకియగు రంగనాయకి యా రంగనాయకు ననుంగు దేవేరియై దైవారుచున్న యది. ఆ శ్రీవత్సవత్సునకు బ్రతివత్సరంబును బ్రహ్మోత్సవంబు మేష మాసంబునం దొలిరిక్కఁ డెక్కియుం బెక్కుటగఁ బ్రవర్తిల్లుచున్న యది. ఆ లోకనాయకుం డుత్తరరంగనాయకుండని కొనియాడంబడిరూడు. అప్పరమదయాపరుండు పరుండుటం జేసి ద్రవిడులు "పళ్ళికొండా" యని చెప్పుదురు. అది కతంబున నా పల్లె పల్లికొండయను నామంబున నభిరామంబయ్యె. అయ్యది విష్ణుకంచికంటెఁ బురాణంబని యా స్థలపురాణంబుచే వక్కాణింపఁబడియెడి. ప్రామాణికులగు నచ్చటి పౌరాణికుల వలన నా విన్నంతయు నెంతయు సంతసంబున నుపన్యసించెద.

తొల్లి దర్పితారాతివిష హరీషుండగు నంబరీషుండను నిర్దోషుండు తత్ప్రదేశంబునకు సదేశంబుననుండు బీజాచలంబున సుచితస్థలంబున నిలిచి, <u>హృషీకంబుల</u> గెలిచి తలంపున ఫణిఫణ తల్ప నిరవుకొల్పి పెద్దకాలంబు తపంబుసల్పి సాక్షాత్కరించిన విరించిజనకు నరుం దిలకించి హర్షప్రకర్షంబునఁ బులకించి యంజలిపుటంబు నిటలతటంబున ఘటించి భక్తిరసావేశంబున నటించి ప్రదక్షిణప్రణామ పురస్సరంబుగఁ బ్రణుతించి యా ప్రణతార్తిహరుండు వరంబు వేఁడుమనవుడు, ననవరతంబు నీ యవనీతలంబు నధివసించి యాశ్రితజన దురితంబుల నశనయింప ననుగ్రహింపవే యని యభ్యర్థింప నదామోదరుం డత్యాదరంబున నియ్యకొని యల్పకాలంబునన భవదీయ సంకల్పంబు నీడేర్తునని యంతర్హితుండయ్యె. అంతఁ గొంతకాలంబునకు నొక్కకతంబునఁ బసిండికొండపై నిండోలగంబుండి పురందరాది బృందారక బృందంబు ప్రసంగవశంబున సర్వానుపర్వ పర్వేందుముఖులకన్న మిన్న, యున్నలు మొగంబుల వేలుపు రాణి, వాణియని కొన్ని కారణంబులు నిర్ణయించి యత్తెఱంగు విరించి కెఱింగించిన నాకర్ణించి కొండొక విచారించి యా నిలింపులగుంపులం గాంచి తెలుఁగంటియన్నులమిన్న యప్పన్నగశాయి పట్టంపు దేవి కమలాదేవియె గాని పెఱవారు గారని పేరెలుంగునం బలుక నప్పలుకులు చెవులకు ములుకులై యమ్మలికమ్ము గొలుపు నప్పలుకుల చిలుకలకొలికి యంతరంగంబునఁ గింక యంకురింపఁ బరియత్నంగంబు దిగ్గన డిగ్గి పల్లికొండకుఁ బడమరనుండు నందిదుర్గంబను నెలవు డగ్గఱి యచ్చటం బెచ్చు పెరుగు మత్సరంబునం గొన్ని వత్సరంబులు దుశ్చరంబగు తపశ్చరణంబున నుండె. అంత నక్కాంచనగర్భుండు కాంచనాంబరు గుఱించి తన్మనోజ్ఞంబగు యజ్ఞంబు చేయ నుద్యమించి పంచాననాది మృగసంచార పాత్రంబైయున్న సత్యవ్రతక్షేత్రంబున కరుగుదెంచి, విశ్వకర్మ రావించి ద్వార చతుష్టయ జుష్టంబై విశాలంబైన యాగశాల నిర్మింప నియోగించి వేల్పులం బుడమివేల్పులం బిలుపించి తన్నుఁ గన్న కన్నె మొఱఁగిన నిజసతికిఁ బ్రతిగ సువర్ణపుత్రిక గల్పించి వసుపరావసు ప్రముఖులు ఋత్విజులుగ నాంగిరసుండు హోతగ రఘుకులాచార్యుం డధ్వర్యుండుగ సత్యయజ్ఞ మరీచు <u>లుద్గాతలుగ</u> యాజ్ఞవల్క్యుం డధ్యక్షుండుగఁ దక్కఁగల వేద విదులు సభాసదులుగ వరించి సవనం బొనరింపుచుండ

నయ్యవసరం బాద్యంతంబుగ నెఱింగి తన్నుఁ దొలంగిన మగని జన్నంబునకు బన్నంబు సేయ నుద్యోగించి నిర్నిరోధ క్రోధ సమావేశ పరవశయైన యా సరస్వతి క్రక్కున నొక్క సరస్వతియై తన్మఖంబునకు నభిముఖంబుగ నుల్లోల కల్లోలమాలా ఘోరయై నిరర్గళ వేగంబున నేగుదేరం గాంచి యవ్విరించి యయ్యాపగఁ బాపఁగ నాపద్విమోచనుండగు పద్మలోచను హృత్పద్మంబునఁ దలంప ననుకంప నా జగన్నేత ధాత మహోత్సాహంబు నిష్ప్రత్యూహంబుగ మనుప నూహించి రంగనాయకాభిధానంబు వహించి యా ధునికవరోధంబుగఁ బల్లికొండ నుత్తరముఖుండయి పరుండి వెండియు నక్కడికిఁ దొలిదిక్కున నెక్కువ తక్కువగ సార్ధయోజన చతుష్టయ దూరంబునఁ దిరుప్పార్కడలను నెలవునఁ దన్నామంబుతోన తెన్నండి మఱియు నయ్యెడకుఁ బెచ్చులొచ్చుగ సార్ధయోజనద్వయ దూరదేశంబగు కాంచీప్రదేశంబున దిగంబరుండై యథోక్తకారి యను పేరను బొలిచి నిలిచె. ఇవ్విధమున ముయ్యెడలఁ దన్ను నవరోధించు రమానాథుని నా ధుని గడువంబార నేరక యతని చరణ పుండరీకంబులకుఁ గొండొక దొలంగి కంచికిం జేరువఁ దూరుపుగం బాఱె. పదంపడి వసిష్ఠాది మహర్షి శ్రేష్ఠులప్పరమేష్ఠిబింబోష్ఠిం బరివేష్టించి యమరోత్కర్షంబు డింద నుచిత వచనంబుల నభినందింపఁ గినుక దేఱి తన్నుఁ జేరిన పంకరుహపూర్వుం బోఁడిఁ గూడి సురజ్యేష్ఠుండు సంతుష్టుండై యవశిష్టంబగు నయ్యిష్టి విధానంబు నిర్దుష్టంబుగ ననుష్ఠించి పూర్ణాహుతి సేయఁ దత్క్రతు నిష్ఠాగరిష్ఠతకు మెచ్చి విష్టరశ్రవుండు దృష్టిగోచరుండయి స్రష్టకభీష్టవరంబు ప్రేమంబున నొసంగి వరదుండను పేర నెసంగి యచ్చో నర్చారూపంబున నానావిధ పూజా విధానంబులఁ దనియుచుండె. అట్టి వరదుని కునికి పట్టగు కంచికంటెఁ దొల్లింటిదగు నుత్తర రంగనాథు నిమ్ము మహిమమ్ము మఱియు నెట్టిదనినం గాంచీ నగరమ్మునం ద్రిరాత్రమ్ము వాసమ్ము సేసిన డానెడు నిర్వాణం బప్పల్లికొండ నొక్క నిశీథిని వసించినం జెందు సందియంబు లేదని దత్స్థల పురాణంబున వర్ణింపఁ బడియెడు. భాషా యోషయైన కూలంకష క్షీరనది యనంబరగె. దానిం దెలుంగునఁ బాలే అని లోకులు వాక్రుచ్చెదరు. అయ్యది పల్లికొండకు నుదగ్దేశం బ్రవహించుచున్నది. అక్కఱ్ఱు వక్కడ నిగివి తక్కువ. మున్నంబరీషు తపంబు సంపద కాస్పదంబయి పల్లికొండ దండ దండధరు కకుప్పున నొప్పు బీజాచలమ్ము శిఖరమ్మున నెల్లమ్మ యను నామమ్మున నలరు ముఱ్ఱాడుమొగమ్ములవాని యమ్మ కిమ్మగు దేవళమ్మొక్కటి గలదు. అక్కొండ రాచూలి పల్లికొండ కండపండు కీళచ్చూరను నూరికి గ్రామదేవత. ప్రతివత్సరంబు మకర సంక్రాంతికిఁ బూర్వ దివసంబగు భోగిపండుగ నాఁడు వేడుకలు పృతిల్ల నా తిప్ప పయికిం బోయి లోకులనేకులా సర్వమంగళకుం బొంగళ్ళు వెట్టి నీరాజనాది పూజనంబుల నారాధించి యుప్పొంగెదరు. ఆ తఱిఁ బేరెములగంబడని యొక్క పక్షియుగ్మంబు ప్రత్యక్షంబయి యా దాక్షాయణికి నివేదితంబగు నోగిరం బాహరించి పోవునఁట. మకరమాస పుష్యనక్షత్రంబున నుత్తరరంగనాథుండా బీజాచల రాజంబుఁ బ్రదక్షిణించి వచ్చుచుండు. అయ్యెడ నెడనెడ మండప పదులను నుపచారంబు లాచరించుచు జనంబులు మనంబులలర ననువగ్గింతురు. అత్తఱిగట్టుదారి యగ్గట్టుచుట్టి వచ్చుట కొక్క యహోరాత్రమ్ము పట్టు. రంగనాయకీ సనాథుండగు నయ్యుత్తర రంగనాథునిం బొడగాంచితి. మిగుల సంతసించితి.

పదునేడవ తేది నాదివారంబు నపరాహ్ణానంతరంబున నత్తలంబు దొలంగి కోసెఁడు దవ్వరిగి యగరమను నూరియేటుత్తరించి యత్తమిస్ర ప్రథమయామంబునకుఁ దోట్లాళంబను కొటిక నికటంబునకుఁ బోయితి. నడుమఁ బితృప్రసూ సమయంబున నొక్కింత తూరగ దొరఁకొని కొండొక తడవునకు వానయై తోడ్తోన ధారాసంపాతంబగుటం

జేసి యచ్చోటు నిర్గమింప నేరక యూరక మార్గంబున ననుచర వర్గంబుతోడ శకటంబుల డింప నేమించి నివసించితి. అత్యుత్కృష్టంబగు నా వర్షంబా త్రియామం తృతీయ యామ పర్యంతం బంతకంతకుఁ బెఱుగుచుఁ దఱుగుచు దురంతంబుగాఁ గురియుచుండె. అజ్జడి నేఁ బడిన యిడుమ లిడుగక నొడువ నెక్కువ దడవయ్యెడు.

జడి యుడిగిన వెంబడి నయ్యెడనుండి వెలువడి నాలుగు మ్ముప్పాతిక వీసము (౪॥—) క్రోసుదూరంబు సని సోమవారంబున నుదయంబైన పిదప జామునకు నామూరుపేట యను నూరఁజేరితి. పల్లికొండ కవ్వలనందు నగరమున నదియి న్నూరు గజముల వెడల్పు గన్నయది. నిర్జలంబైయున్నయది. పల్లికొండకుం దోటాళంబునకు నాలుగుంబాతిక (౪।) క్రోసు మేరగలదు. ఆసారాభియుక్తంబగు నా నక్తంబునఁ దోటాళంబుఁ బొడగన ననువుపడదయ్యె. ఆ యూరపేట గొప్పది. ఇంచుమించుగ వేయి యిండ్లును మెండుగ నంగడులు నుండెను. అచ్చోటఁ దురకలు గలరు. తెరువరుల కాహారార్థంబులగు ద్రవ్యంబులును, నెంగిలీషు బాటసారుల విడిదియు, సత్రంబు నున్నవి. ఆ గ్రామంబున నాగేశ్వర లింగాహ్వయుండగు నాగేశ్వర దేవుండు భ్రమరాంబిక యను నంబికతోనుండు గుడి యొండుగలదు. అక్కుమార గురునకుఁ బెక్కు వత్సరంబులకు ముంద బ్రహ్మోత్సవ ప్రతిబంధంబుత్పాదిల్లె. నిత్యోత్సవాదు లిపుడు నడచెడు.

పదునెనిమిదవ తేదిఁ బూరాధిపవారాస్తమయ సమయంబునఁ బయనంబయి యయిదుంబరక (౫౽) క్రోసు దూరంబునం బోవుచు వాణియంబాడి యను గ్రామంబున కన్నిశామధ్యంబునం బోయితి. గట్టున వలన సుఖసంచరణంబగు సంసరణంబుకంటెఁ దిర్ఘగయనంబొందు కొండొక దావని విని తోడివారిఁగూడి యా సరణింబోయినాఁడ. అయ్యేకపది కొండొక నెడలేక తాటితోపు గల్గి దోపుడు గొనువారికిం బ్రాపైయుండెడు. అట్లున్నను నన్నుంబోలె నీలశైలంబునకుం బోవువారి సాహాయ్యంబు కలిమి నద్ధ్వంబున సాధ్వసం బుద్భవిల్లదయ్యె. అచ్చోట మాఁపటిపూట వాటంబగు నెక్కుడు తోడ్పాడు లేక చనినం జోరులవలనఁ గీడ్పాటు వాటిల్లు. ఆ యూరిపేటకు వాణియంబాడికి నడుమ నిరుచోటఁ బాలేటి దాఁటి పోవలయు. ఆ ఱిక్కరలు పరక క్రోసున కెక్కుడగు పరిణాహంబుగలవిగావు. పానీయంబులు లేవు.

వాణియంబాడి గొప్పది. ఎక్కువ తక్కువగ సహస్రాగారంబయి నానావిధ పణవారంబయి యొప్పు. ఇతర జాతి జనజాతంబు కంటెఁ దురకలు బహుళంబుగ నున్నవారు. వారలయ్యూర సార్థవాహ ప్రముఖులగుటం జేసి సార్ధులుగ నున్నవారు. అయ్యెడ నుండి యాజ్యంబు ప్రాజ్యంబుగా నజస్రంబును జెన్నపురంబునకుం వచ్చుచున్నది. కంచి తరించిన వెనుకఁ జెన్నపురంబునకుం బోలె నగారంబులు ద్వారంబులు నక్కడ నొక్కొక్కచోటఁ గానంబడియెడు. "ముసాఫరు ఖానా" యను నొక్క మండపంబును నెంగిలీషు తెరువరుల విడిదియు విపణియు నున్నయవి. వాణియంబాడికిఁ గొంత దవ్వుగల నేల 'వేదమలె' యను శైలంబొక్కటి గలదు. దాని యధిత్యకం దెక్కండ్రు పార్వతీయులు గాపురంబున్నవారు. మున్ను నేనిరుచోట దాఁటిపోవలయు నన్న పాలేటి జోటిలో నొక్కటి యా యూరిపేట కవ్వలఁ గొంత దవ్వునను మఱియు నొక్కటి వాణియంబాడి కివ్వలఁ జేరువను బాఱెడు. వాణియంబాడికిఁ బశ్చిమ భాగంబున ననతిదూరంబున వీసము క్రోసు పరిణాహంబునఁ బాలేరు మఱలఁ బాఱుచుండెడు. వాణియంబాడి కివ్వలంబాఱు పాలేటి యీవలి దరిలోఁ జిత్తూరి జిల్లా ముగినె. ఆవల నేలము జిల్లా.

చింతాద్రిపేట యాదిగ వాణియంబాడి కివ్వలంబాఱు పాలేఱు తుదిగఁ జెన్నపట్టణం బునంబోలె గులకరాల ఘట్టితంబగు ఘంటాపథంబు గలదు. మఱియు నవ్వాకదాఁకఁ గల * మయిలుల లెక్క గ్రమంబున నయ్యయి మయిలునకుఁ గొన్ని తలంబుల నుపలం బులఁ జెక్కియుఁ గొన్నిచోట్లఁ జెట్లఁ గొన్ని యెడల గోడల నల్లవన్నియల లిఖించియు నుండెడు. ఇమ్మయిలుల సంఖ్యలంబట్టి రెండు మయిలు లొక్క కోసువంతున నా యూరికిఁ గలదూరం బింతింతయని వ్రాయుచు వచ్చినాఁడ. ఈ కోసులునాలుగొక్క యోజనంబని యెఱుంగునది.

ఆ రాత్రి యంతిమయామంబున నా గ్రామంబున నుండి ప్రయాణంబయి పెద్దగయు దవ్వుచని యాఁకటి వెల్లిన నవ్వలఁ జన నేరక వారక వచనంబున నుచితంబు లగు సామగ్రులు గొఱలేక నాకడ నునికిం జేసి వ్రజంబున నొక్క కజంబు క్రింద భోజన కృత్యంబు నిర్వర్తించి కొంత సేపచ్చట విశ్రమించి తిరుప్పత్తి యూరను నూరద్దినాంతం బునం జేరినాఁడ. అది వాణియంబాడికి నాలుమ్ముప్పాతిక మువ్వీసము (౬౪౬) కోసు దూ రంబు. నాఁడు పవటి మూఁడవ జాము నపుడు దొడంగి మూఁడు గడియల పర్యంతంబు నిరంతరంబుగ నత్యంతంబగు వర్షంబు వర్షించె.

తిరుప్పత్తియూరు గొప్పదియైనను వాణియంబాడికన్నఁ జిన్నది. అచ్చటఁ బ్రతి సోమవారంబును సంతసాగెడు. కొండొక సన్నికృష్ట విప్రకృష్ట భూములనుండు గ్రామం బులనుండి బేహారులు నానా రూపవస్తుకలాపంబు లొక్కయూరికిం దెచ్చి సంకేతస్థల మ్మున నమ్ముటయ సంతయనంబడు. ఆ సంతలో సమీప గ్రామవాసులు వలయు వస్తు వులు జట్టిగొంద్రు. అది యొక్కొక్కయూరికి నొక్కొక్క దినంబు నియతంబుగనుండు. అత్తిరుప్పత్తియూరఁ దాలూకు కచ్చేరియు నెంగిలీషు బాటసారుల విడిదియు సత్ర శాలయుఁ గోలకంఠ కాలకంఠాలయంబులునున్నయవి. ఆయ్యూరను లబ్బెలున్నవారు. అచ్చోనధ్వన్యుల కావశ్యకంబులగు పదార్థమ్ములమ్ముచుండెదరు.

అయ్యూరికిఁ గొండొకనేల వేలకొలంది పార్వతీయులకుఁ దావలంబై విశాలంబై జవ్వాది మలె యను కొండగొయ్యొండును వెండియు వేరొండు కడవత్తి మలె యను కొండయు నుండెడు. వత్తిమలయందు గొందలు యుండు లుండుటయే కాక యోబళ రాయుండను పేర నారాయణుని గుడియుఁ గామాక్షి నామంబునంబరగు కామారి దేవేరి దేవళంబు నున్నయవి.

పందొమ్మిదవ తేది మేదినీకుమారవారంబునం బతంగుండు మఱుంగువడిన పిదపం బదిగడియల కక్కడనుండి వెలువడి యాఱుమ్ముప్పాతిక పరక (౬౪౭) కోసుననుండు మత్తూరను గ్రామంబు దాఁటి దానికయిదున్నర మువ్వీసము (౫౪౬) కోసుగల యిరు మత్తూరను నూరు మఱునాఁడు మధ్యాహ్నంబునఁ జేరితి. తిరుప్పత్తియూరికి మత్తూరికి నడుమఁ జిన్న యేరుల రెంటిని నిరుమత్తూరి కివ్వలఁ జేరువఁ బెన్నయను నేటిని దాఁటి నాఁడ. ఆ త్తరంగిణీత్రయంబు నిర్జలంబు. పెణ్ణయారని ద్రావిడంబునం బేరొన్న పెన్నయన్నది పరికకోసు పరిణాహంబుగన్నది. అన్నది చెన్నపట్టణంబునకు దక్షి

---

* మయిలనఁగా నెంగిలీషు గడియ; ఒక మయిలునకు (౧౭౬౦) వేయునేడు నూటయరువది గజంబులు. గజమొక్కటికి మూఁడు అడుగులు. అడుగొకటికిఁ బది రెండంగుళములు.

ణంబుననుండు గూడలూరు మొదలగు గ్రామంబులఁ బాఱి వారిధిం జేరుచున్నది. ఇరుమత్తూరు చిన్నది. ఎంగిలీషు పథికుల విడిదియు నొక సత్రంబు నున్నవి. యాత్ర పోవువారికి నాహారవస్తువు లెల్ల నబ్బుట యబ్బురంబు.

ఇరువదవ తేది బుధవారంబు రాత్రి రెండవ జామునందు నేడ నయ్యెడనుండి పయనంబయి యాఱునరవీసము (౬౹—) కోసు దూరంబుననుండు ధర్మపురి యను నూరు మఱునాఁ డరుణోదయంబునం జేరి తదుపాంతవనాంతంబునఁ గొంత విశ్రాంతి నొంది యవ్వల రెండునరవీసము (౨౹—) కోసు దవ్వునం గల యదమాన్ కోట యను నూరి రాజు గడియలకుఁ జేరినాఁడ. ఇరుమత్తూరి కవ్వలఁ గొంత దవ్వున నొక్క యేఱు గలదు. దాని నఱవలు కల్లారని చెప్పెదరు. అట్లు చెప్పుట రాతి యేఱనుట. పుడమి నెల్లెడ నేడపడక పడియుండు గుండులపై నన్నది పాఱుచున్నది గావున నయ్యేఱప్పేరు గన్నది. అది చిన్నది. బండులు లోనగు వాహనంబులు జనసందోహంబులు నడువం గొంత వాటంబుగ నుండుటకత్తటిని లోనుండు రాలపిండు లిసుకచే మెండుగఁ గప్పఁబడి యుండెడు. మఱియు నిరుచోట నూటపదేసి గజముల వెడలుపుగల ధర్మపురి యేటి దాఁటినాఁడ

ధర్మపురి గొప్పపేట. తాలూకు కచ్చేరియు సత్రంబు నున్నయవి. ఎంగిలీషు తెరువరులకు విడిది లేదు. కంపెనివారు నిర్మింపఁదలంపు గలిగియున్నవారు. సేలము కలెక్టరు జమాబంది కొఱకువచ్చు తఱి కచ్చేరి చేసెడు విడిది యొక్కఁడు గలదు. ఒక్క గొప్ప చెఱువు నొక్క యేఱు నొప్పారు. అందలి సత్రంబు మునుపండఁ దహశీలుచేసిన యరుణాచలయ్య యను బాపనయ్య గట్టించినయది. ఉద్యోగస్థులగు జన్ని గట్టు లప్పట్టున బిట్టు గనుపట్టుదురు. నానా విధంబులగు పణ్యవీథిక లనేకంబులుఁ గలవు. ఆధ్వనీనుల కక్కఱగలయవి పెక్కుగఁ జిక్కుచుండు. అయ్యెక్క వైకుంఠ శ్రీకంఠుల నిలయంబులున్నయవి. వైకుంఠుని పేరు వేంకటరమణుండు. శ్రీకంఠుని పేరు హరిహరనాథుండు. ఆ శివకేశవులకు బ్రహ్మోత్సవంబు లిక్కాలంబున లేవు. కాళికయను పేరం బరఁగు శూలి యిల్లాలి దేవళం బొండు గలదు. ఆ పేటకు బ్రక్కఁ గొన్ని యిక్కలొక్క కుడ్యంబుచేఁ జుట్టఁబడియున్నయవి. ఆ గోడ యచ్చోటఁ గోట యనంబడు. ఆ సాలంబు మున్నొక్క కన్నడ మన్నెగానిచేఁ బాలింపఁబడినయది. అందు లక్ష్మియన్న వాఁడంబడు రమాదేవితోడం గామాక్షియను నామంబుగల శ్యామలాదేవితోడం గూడి వాసుదేవ మల్లికార్జునాభిధానంబులం బూనియుండు హరిహరుల యాలయంబులు రెండు దనరారుచుండు. ఆ భక్త జనావన సముత్సుకులకు బ్రహ్మోత్సవాదులు వర్తిల్లెడు. అద్దేవాలయద్వయ మాత్రంబున కాయతి ప్రతివత్సరంబును సరాసరి వేయినేనూఱు రూపాయలు వచ్చుచుండెడు. పూవిరుందమల్లి పేట దాటిన పిమ్మట నచ్చటన గోక్షీర దధులు దొరకెడు. తక్కునెడల మేషదధి దక్కఁ దక్కినవి చిక్కకుండెడు.

అదమాన్ కోట చిన్నది. కొద్దిగా గొప్పగా నూటయేబది యిండులు రెండంగళులు నుండెడు. ఒక జలకణంబేనిలేని గొప్ప తటాకంబున్నది. అక్కడయు దాని చుట్టు ప్రక్కలయుఁ బైరువెట్టునంతవట్టు వర్షంబు రెండువర్షంబులుగ వర్షింపమిం జేసి

యు యయ్యారి వారిలోఁ బలువు రన్నెల నుపేక్షించి సుభిక్షంబులగు లాతిచోట్ల కరిగిరి. అదమూర్ కోటను నింగిలీషు వాటసారుల విడిమట్టు గలదు. సత్రంబు లేదు. చెన్న కేశవాహ్వయుండగు వెన్నుని కోవెలయు మహామహిమగల కాళి యను దేవి దేవళంబును ధర్మరాజను వరిష్ఠ నామంబు గన్న యుధిష్ఠిరుని గుడియుం గలవు. ఆ మీనాంక గురునకు మీన మాసంబున బ్రహ్మోత్సవంబు నన్నెలయంద యన్నగజాతకు జాతరయు జరుగు చుండెడు. అచ్చటి చెరువుకట్ట పైఁ జెట్టుల క్రింద డిగ్గినాఁడ. ఆ యూరికి గొంత దూరంబున మూఁకునూరను నూరలరారు. అందొక సానుమంతంబు పయి హనుమంత రాయని గుడియుండెడి. అతనికిఁ బ్రతి శనివారంబును బూజ నడచుచుండెడు.

ఇరువది యొకండవ తేది నాదితేయగురువార శర్వరి నిర్వది గడియలకుం దరలి యయిదు మ్ముప్పాతిక వరక (౫¾) కోసు దూరంబుగల తోప్పూరను నూరు మఱు నాఁటి తొలి జామునకుం జేరినాఁడ. దారిఁ దోప్పూరి కనుమ నలుమాఱు డిగ్గుచు బోవలయు. అన్నలు దింపుల లోనం గడపలియది గొప్పది. అక్కనుమ యొక్కించుక పెచ్చులొచ్చుగఁ బాదక్రోశ దూరంబు గలిగియుండెడు. కంపెనివారి పనిగొని చనువారి క్రాంతంబుఁ దత్ప్రాంతంబున నుండు బంట్రౌతు నధికారంబు క్రిందఁ గొందఱు కూలివార రుదెంచి బండివాఁడ నడ్వాహంబుల నల్లనల్ల నడుప ముందఱుం బిఱుంద నయ్యం దఱు శకటంబునట్టిట్టు దొరగిలనీక గట్టిగఁ బట్టికొని పదిలంబుగ దుర్గమంబగు నమ్మార్గంబు నిర్గమింపఁ జేసెదరు. అక్కరణి నక్కనుమ డిగ్గునెడ బండులపై మనుజులుండుట యుక్తంబుగాదని తోఁచుచుండెడు. పెఱతెరువరు లాభృతకులకు భృతియిడి యక్కైవడి నవతరింపవలయు.

అదమూర్ కోట కవ్వలఁ గొంత దవ్వు మొదలుకొని తోప్పూరు సేరువాఁకఁ గాన గానంబడియెడి. అక్కాననంబు చిఱుచెట్టుల గుట్టల ముండ్ల గుండుల నిండుకొని యుండెడు. ఉదయం బాదిగ నగ్గహనంబు గనుఁగొనుచు వచ్చితి. కొన్నియెడలఁ ద్రిక్కఁ దక్కునెడలఁ గొన్ని యడుగులైన నడువ నలవడదు. కొన్ని పట్లఁ బల్లంబులు గొన్నిచోట్ల గొప్ప మిట్టలు విట్టలంబుగ నున్నయవి. మున్న వ్వనంబున మువ్వన్నె మెకంబు లనేకంబు లిరవుకొని పథికుల కధికోపద్రవంబు సంపాదింపఁ గంపెనివా రక్కాంతారంబు గొంత వట్టు నిర్మూలంబు సేయించి శార్దూలంబులఁ దూలించిరి. అక్కాలంది నిక్కాలంబున నెక్కాలంబు నుండకుండిన నొక్కొక్క కాలంబునం గోలు పులులు మానిసి నొడిసికొని పోవుటం జేసి పగటి పూటనైన నొంటిపాటుగ నచ్చటఁ బోవుట కెట్టి పోటరికైన దిటము గలుగుట యరిది. చిఱుత గండులు మాత్రము గండు మీఱియుండునఁట. అక్కాననంబున నొక్క ప్రక్క నెక్కానియందు నొక్క కొండపై రెండు పుండరీకంబు లుండఁ గనుగొంటి మని నా వెంట ముందు వెనుక నడతెంచు వారిలోఁ గొంద ఱక్కడఁ జనునెడ వక్కాణించిరి.

తోప్పూరియందు గొన్ని మందిరంబులు రెండంగడులు నుండెడు. ఆపణికుల వలనం బథికులకుం దగిన జగ్ధిపదార్థంబులు సిద్ధింపవు. ఎంగిలీషు వాటసారుల విడిది యొక్కండును, సత్రం బొంటును నుండెడు. ఆ సత్రంబునఁ బ్రతివాసరంబును భూసుర వితానంబున కన్నదానంబు * మహిశూర రాజుగారివలన నడచెడు. అయెడ నుండువారు రెండు హాయనంబులనుండి తగినవాన గానకున్నవారు. తొలినాఁడెం దేని వానగురిసెంగాన

* ఇది మైసూరని వ్యవహారము.

నయ్యార నున్న చిన్న యేటికి మ్మాపటివేళ వెల్లువవచ్చె. అయ్యేఱు యెచ్చో రాదేని నీరు వట్టునకేని నీరు పుట్టు టరిది. సేలము జిల్లాతోఁ జేరిన యొక్క డఫేదారుఁడు గొందఱు బంట్రౌతులంగూడి తోప్పూర నున్నవాఁడు.

ఇరువది రెండవ తేది శుక్రవారంబునం గోశేశదిశం గుశేశయహితుం డంతర్హితుం డైన యనంతరంబ యొక్క గడియ కక్కడ వెడలి పదిరెండుంగాలు (౧౨) కోసు దూరమ్మునసుండు సేలమ్మను గొప్ప గ్రామమ్ము శనివారమ్ము తొలి యామమ్మునకుఁ జేరి నాఁడ. తోప్పూరికి నాలుగు మువ్వీసము (౪౬) కోసునసుండు పూజారిపట్టి యను కొట్టిక దనుకఁ, దొలినాఁడు గన్నట్టిట్టి యడవి కొండ తెగకుండెను. తొలివాసరంబున వాసరకరుండు చూపట్టిన రీతిఁ జూపట్టిన గట్టుం జుట్టుకొని త్రోవ వోవుచుండె. అద్దారి ఘోరదర్శనంబులగు ఘోరదగ్ధనంబుల కనేకపథికజనంబు భోజనంబగుచుండె. తాదృశదుర్దశ సంభవిల్లినప్పుడెల్ల నింగ్లీషు దొరలచ్చటికివచ్చి యచ్చాలల మెకంబులఁ బొరివుచ్చుచుండిన న్వెండియు వచ్చివచ్చి యొకండు రెండ త్తలంబు నత్తుకొనియుండెను. నాఁటికి నాలవనాఁటి రేయి యంచెలవాఁడు తలారి యనంబడు నొక్క భారిక వానితోడం గూడి "కోరంగుచ్చి" యను యఱవంబున వాడంబడు కొఱకచ్చు కత్తి వెలిగించి కరంబునఁ గీలించికొని నడతెంచు నెడ నక్షత్రోపం గూర్చుండి యొక్క వ్యాఘ్రంబు శీఘ్రంబ యవ్వాఁబుంగు గనుంగొని చెంగటి యటవి మఱుఁగు వడిపోయె ననియు, మఱియు నమ్మఱునాఁ డస్తమయ సమయంబునఁ బిఱికి మెకంబుల నఱిముఱిం బఱిమికొని తెరువునం బఱతెంచు నొక్క బెబ్బులిని వేరొక్క లేఖా వైతనికుండు గన్నారఁ గన్నాఁడనియు విన్నాఁడ. బెబ్బులులుఁ జఱుతపులులు సెలుఁగులు సలుగులు మొదలగు మెకంబు లగ్గి వెలుంగునకు నగ్గలంబుగ బెగ్గిలి డగ్గఱ నేరక దిగ్గనం బాఱుననియు నంచెలవాండ్రు భారికవాండ్రు బంట్రౌతులు నద్దేశంబుల నిశావసరంబుల నెగడుల నిగుడంజేసి చెంతల నిడుకొని యున్నవారు. అయ్యయనంబునం బయనంబున రేలఁ గేలఁ గొఱవి గొఱలదేనిఁ దెరువరి వెరవఱి యదుష్టసత్త్వంబుల వారిం బడి కీడు వొరయకుండ నేరఁడు.

సేలము చాల విశాలమగు నూరు. అందు నొక పణ్యవీథిక గలదు. అయ్యది కొండొక యొక్కువ తక్కువగ నరకోసెఁడు దైర్ఘ్యంబు గలయది. అవ్వీథియందు నానావిధంబులగు నంగళ్లు గలవు. సంపన్నులన్నెలవున మిగులం గలిగి యున్నవారు. పట్టుసాలివారు బిట్టు గానంబడుచున్నవారు. మేడలు మిద్దెలుఁ దోఁటలు మిక్కుటంబుగ నొప్పుచుండెను. పోలీసు తాలూకు కచ్చేరి, కలెక్టరు కచ్చేరి, ముంఫ్సీ కోర్టు, మునసబు కోర్టు, జిల్లాకోర్టు, సెషన్ కోర్టు నని చెప్ప బహు, నొప్పుదప్పుల విమర్శించు తలంబులు చొప్పడి యున్నవి. మఱియుఁ జికిత్సాశాలయుఁ గొన్ని సత్రశాలలు నింగిలీషుపథికుల విడిదియు వేరొక్కండును, రెండు చెఱువులుఁ గొన్ని దొరువులు నున్నయవి. న్యాయ విచారణ స్థలంబు లన్నియు నస్న్యానంబులై యున్నను ద్రుచ్చు లచ్చటచ్చట ద్రుచ్చి మిక్కిం జొచ్చెదరు. అట్టి చౌర్యం బనివార్యం బగుటం జేసి స్వాపతేయంబు గల కాఁపులు మాపులచ్ఛిద్రంబగు భద్రంబు గోరి నిద్రలుడిగి యుండెదరు. వారి యందుఁ గొందఱు తమ మందిరంబులఁ బరాస్కందులు డిగ్గకుండ, ముంగిళ్ల నినుపచట్టంబులు దిట్టంబుగ బెత్త కొక్కండుగ దూలంబులఁ జొప్పించి పందిలి చందంబునం బొందుపఱచి యున్నవారు. ఆ గ్రామంబున రెండు దేవధామంబు లున్నయవి. రమానాథుం డొక

గిరి నాథుండను నామంబుతో, సుమానాథుండు కిళువేనాథుండను నామధేయంబుతో నందుఁ బెంపొందెదరు. వారిదేవేరుల పేరులుఁ దెలుపునంతటివారు నాకుం జేకూరరైరి. దేవతా నామాంతరముల మఱికొన్ని యెడల నే నొడువకుండుటకు హేతువిదియ. అవృషాకపులకు వృషభమాసంబున బ్రహ్మోత్సవంబులు ప్రవర్తించెడు. ఆ జనపదంబుల నరదంబులు క్రింది పీఠంబులవఱకుఁ జారుతర శిల్పయుతంబులై చారువర కల్పితంబులై యున్నయవి. అపశిష్టంబులగు నూర్ధ్వావయవంబులు ప్రతివత్సరంబు నుత్సవకాలంబుల నుచ్చావచంబు లగు దండ వస్త్రాదులం గైసేసెదరు. సేలమునకుఁ గొంతదవ్వున శివ్వాయి యను గొప్పపేట గలదు. అందు సాలెవారు చాల నున్నవారు. జీర్ణంబగు నొకకోట యప్పేటకుఁ గొంత చేరువగు చోటఁ గలదు. ఏ డెనిమిది మాసంబుల నుండి యవృష్టికంబగు నద్దేశంబున నద్దివసావసాన దిష్టంబునఁ గొండొక వృష్టిబిందువులు భూతల పతితంబులయ్యె.

సేలమ్మునకుఁ బాకశాసనాశ ద్విక్రోశదూరదేశంబున శేరువరాయమలె యని చెప్పంబడు నొక్కతిప్ప యొప్పుచుండు. అప్పర్వతంబు ప్రభూత శీతంబగుటం జేసి వేసవి నెలంబునం దదాసన్న భూములనున్న ఇంగిలీషు దొరలవ్వసుంధరాధరంబధిరోహించి తదధిత్యక మున్న రచితంబులై యున్న యా వాసంబుల వాసంబుచేసెదరు. ఆ శిలోచ్చయంబుపై నింగిలీషుభాషఁ † గాఫీ యని పేర్కొనంబడు బీజ విశేషంబులు పండుఁగఁ బండుచుండు. కంచి యుత్తరించిన వెనుక విడిసినయెడ గడగఁ గడమ యెడల సత్రంబులు లేవు. వేలూరను దిరుప్పత్తియూరను సేలంబునను దక్కఁ దక్కొడలఁ దమ్ములమ్మునకుఁ గమ్మెరాకుల కాని యొండేని నవచాతమృదుళంబులగు నాగవల్లిదళంబులబ్బవయ్యె. ఇరుమత్తూరు దొరఁకొని కాచునం దోఁచిన వులుచని * వక్కల చిక్కుదుఁగాని నిరుచ్యంబులగు వక్కలు విక్రయకుల వలనఁ బొడగానవైతి. వేలూరు దొట్టి సేలమ్మునేరు నంతవట్టు నేతట్టు గనుఁగొన్న గట్టులే కనుపట్టుచుండు. అట్టి యూవట్టు నాగట్టులలోనం గొన్ని జనంబుల కునికిపట్టులై యున్నయవి. తత్రత్యులందఱు వాని యధిత్యకలఁ గృషీవలులై జీవించుచున్నవారు. ఆయా గ్రామోపాంతంబులఁ గల సానుమంతంబుల యుదంతంబు నా విన్నంతయుఁ గొంతలేక యెక్కడక్కడ వ్రాసినాఁడ.

ఇరువది మూడవ తేది శనైశ్చరవారమ్మున నిశావసాన యామమ్మున సేలమ్ము నతిక్రమించి యారున్నర (6½) కోసు దూరమ్మునఁ గాకాపాళియమ్మను గ్రామమ్మునరది నాదిమ ప్రహరమ్మునఁ గాంచితి. అక్కటికం గొన్ని కుటికలు గలవు. అందుఁ గందిపప్పును వెంకాయలుఁ, వంకాయలుఁ, దక్క్రంబుఁ దక్క వేరొక్క వస్తువులు చిక్కవు. సేలమ్మున నతివేలమ్మగు వాణిజ్యమ్మునఁ బ్రాజ్యమ్మగు ధనార్జనమ్ము నేయుచుండు ఫిషర్ను నింగిలీషు దొరకు విజంటును కార్యకర్తగా నచ్చోట కాపురంబుండు నరసింహశెట్టి యను పట్టుసాలియాయన యప్పాళియంబున విచిత్రతరంబుగ నొక్క సత్రవరంబు గ్రొత్తగ గట్టించియున్నవాఁడు. పట్టుసాలి వారి కప్పట్టున సెట్టియను పట్టంబు విస్పష్టంబై యొప్పుచుండు. ఆ ధర్మశాల, విశాలకక్ష్యాంతరచతుష్టయజుష్టంబై పరిపరి విధంబుల పథికజనంబుల కధికానందంబు డెందంబునఁ గ్రందుకొలుపుచుండు. నిరతిశయసుఖసంపాదకంబగు తాదృశ సత్రంబు నా నేత్రంబుల కదృష్టపూర్వంబని ప్రశంశింప సంశయింప. మఱియు న వ్వేశ్మంబునకుఁ బార్శ్వంబున విస్తృతంబగు నొక్కయశ్మంబు మల

---

* పచనం బొనరించిన పోకచెక్కల వక్కలని వ్యవహరించెదరు.

† Coffee.

పించి కొలను మొలపించి యున్నవాఁడు. తదీయంబులగు పానీయంబు లతిస్పృహణీయంబులై యున్నయవి. వెండియు నా శెట్టి తనకు యశంబు పుట్టఁ జేయునట్టి యొక్క పేట యచ్చోట నూత్నంబుగఁ జేయు యత్నంబున దాపునంగల కొండల కాఁపుల రావించి కొన్ని నికాయ్యంబులు గట్టించి యయ్యవి తదీయంబులు గావించి నిరపాయంబులగు తజ్జీవనోపాయంబులు సమకూర్చినవాఁడయ్యె. అయ్యెడకుఁ గొంత ప్రాంతంబుగ నెంగిలీషు పథికుల విడిది యున్నయది. అయ్యది * మక్డ నాల్డు సత్రంబని పేర్కొనంబడు. ఒక్కవర్షంబు గోలె వర్షంబులేని యా భూమిని నయ్యామిని నొక్క యామం బవిరామంబుగ ననుత్కర్షంబగు వర్షంబు వర్షించుచుండె.

ఇరువది నాలుగవ తేది నాదిమవారనిశం బంచవింశతి ఘటికాకాలంబున నా కాకాపాళ్లియంబు దొలఁగి (5 క్రో) సార్థపంచక్రోశదూరం బరిగి మఱునాఁటి మొదటి యామంబున ముద్దునాయనిపాళియం బను నూరు నేరి యొక్క దానవారి గుడి వెలిమండపంబున విడిసితి. అక్కోటికి వేంకటప్పనాయనిపాళియం బనియుం జెప్పెదరు. వంటచేసి భుజించుటవలన నద్దేశంబున దేవళంబులకును మండపంబులకును వారిశుద్ధ్యభావంబు భావింపఁ బడకుండెడు.

ఆపాళియంబున కంతికతటంబున శంకరదుర్గం బను కొండయొక్కండున్నయది. అయ్యది మున్ను కొన్నవెట్టువ గౌండనను నొక్క యలవ జమీందారుఁడు శూరుండై దుర్గంబుఁ జేసి కొండొక కాలంబు పరిపాలనంబు చేసె. అనంతరంబ యా గుబ్బలి తురుష్కుల కబ్బె. పదంపడి కంపెనీవారికిం జేపడియె. ఆ గట్టుచుట్టు నొక్క ప్రాకారంబు కంపెనీవారికిఁ జేపడియె. ఆగట్టు చుట్టు నొక్క ప్రాకారంబు సద్వారంబై యొప్పారు. అందు గొప్పయూరున్నది. ఆ గ్రామంబునామంబ యా గ్రామంబున కయ్యె. అయ్యది లొచ్చు పెచ్చుగఁ జతుశ్శత సదనంబులు, ననేకవిధాపణంబులు గలయది. దానం దాలూకు కచ్చేరియు, సౌందర్యవల్లీ సోమేశ్వరులను నుమా మహేశ్వరుల నిలయంబును, వినాయక నికాయ్యంబును గ్రామదేవతా నికేతనంబును లోనగు దేవాలయంబులు, నొక్క క్రైస్తు గుడియుం గలవు. ఆ శైలానువానునకు మీనమాసంబున నుత్తర తార రథోత్సవంబుగ బ్రహ్మోత్సవంబు నడుచుచున్నయది. అమ్మహీధ్రమ్మున నిర్నిద్ర రౌద్రుండగు వీరభద్రుని భవనంబును, వరదరాజనామకుం డగు కమలాకాముకుని సదనంబును, ఇంద్రరాజస్వామి యను నామంబుగల తులసీదాముని ధామంబును, మఱియుఁ గొన్నియలంతి దేవళంబులును మసీదులను యవన దేవభవనంబులు రెండునున్నయవి. చంద్రరాజస్వామికి మేషమాసంబున నుపత్యకయందు బ్రహ్మోత్సవంబు ప్రవర్తించుచున్నయది. ఆ శిఖరి శిఖరారోహణంబునకు సోపానంబులు లేనిచోట బాట వాటమై యున్నయది. అన్నగంబు నయిఁ బన్నగంబులు పంచజన ప్రముఖప్రాణి సంచయంబుఁ గఱవవు. కఱచిన విసంబెసకంబెసఁగదని యక్కడివారు వక్కాణింతురు.

ముద్దునాయని పాళియంబు శంకరదుర్గంబు కన్నఁ జిన్నది. అపగతకృపీటంబగు తటాకంబు నెంగిలీషు బాటసారుల విడిదియు, ముసాఫరుఖానా యను నొక మండపంబును గలవు గాని, సత్రంబు గానము. వల్లభరాయండను నారాయణుని యాలయంబు వెలయు. అజ్జంభశాసనానుజునకుఁ గుంభమాసంబున బ్రహ్మోత్సవంబు ప్రవర్తిల్లెడు. అయ్యెడ నా శంకరదుర్గంబు విధంబున నప్పాళియంబు మిగులఁ బ్రసిద్ధంబుగాదు. అప్పాళియంబున నద్దుర్గంబునఁగల దేవళంబుల నెల్లఁ దొల్లి బల్లిదుండైన గౌండనను

* Macdonold

మన్నెగాఁడన్నేల నేలునాఁడు నిర్మించినవాఁడు. గౌండనను బిరుదు దక్షిణదేశీయులగు వన్నియరను వారికిఁ బ్రాయికంబైయుండు. మాసదశకంబు నుండి వానలేని యయ్యుర్వి నపూర్వశర్వరిఁ గొండొక వర్షంబు గలిగె.

ఇరువది యైదవ తేది నిందు వాసరంబున వాసరపతి యాకసంబున నడుమనుండ నప్పాళియంబు విడిచి యయిదుం బాతిక పరక (౫|౨) కోసుదవ్వున నుండు పళ్లిపాళియంబుఁ గడచి యయ్యూరి కుఱంగటం బాఱు కావేరీతరంగిణి నుత్తరించి తీరస్థంబగు సత్రంబు జగన్నేత్రుండస్తంగతుండగుచుండఁ జొచ్చితి. కావేరి యీవలి దరితోన నేలము జిల్లా ముగిసె. అవ్వలఁ గోయంబుత్తూరి జిల్లా.

వాణియంబాడియుఁ బళ్లిపాళెంబు నాద్యంతంబులుగ సరణి కుట్టిమంబుకరణి ఘట్టితంబును, పార్శ్వద్వయోపేత శీతలచ్ఛాయాన్విత మహీజాత నివహంబును గాన నధ్వనీన సుఖావహంబయి యుండె. నేలముజిల్లాతోఁ జేరిన వివిధపథంబులు నీ విధంబున నధికానాతపాలవాలం బగు తరుద్రుమ జాలంబునఁ జాలఁ దనరారుచుండు. కావేరీ నది యేనూటయేబది గజంబుల పరిణామంబు గల పరివాహంబు గలయది. తన్మధ్యంబునఁ దృతీయాంశ పరిణాహంబున నీరు పాఱుచుండె. ఆ శైవలినికి నా త్రోవ రెండు రేవు లుండె. మదుత్తీర్ణంబైన చోట నయ్యేఁటు నన్నువలె యుండు గుండురాలు గొండొక నిమ్నంబుదాఁకఁ దెలిపిలేక పఱపియున్నమాడ్కిఁ దోఁచుటయకాక యట్లు పరీక్షించితి. మఱియు నవ్వాఁక ననేకవిధాకృతులగు మహోపల ప్రతతులు మెండుగ నిండుకొని యుండెడు. మెండియు లోతులేనిదై శకటయానంబున కనురూపంబైన నీరు దనరారు తఱి, నా రేవు త్రోవంగల గ్రావంబుల వలన శకటంబుల ననడ్వాహంబు లీడ్వనేరమిఁ గీడ్పడుటయకాక యపాయంబులు పెల్లుగ సంభవిల్లుఁ గావునఁ బళ్లిపాళియంబు నందలి కొంద ఱరుదెంచి యనశ్శోదకుం డ్రుమాదంబున బలీవర్దంబుల నడుమ నిరువు రిరు ప్రక్కలఁ జక్రంబుల నిర్వక్రంబుగఁ ద్రిప్పఁ బిఱిందికడ నిద్దఱు తద్దయు నొద్దికతోఁ ద్రోయుచుం దెచ్చి శకటంబుల నత్తటినీ తటంబునఁ జేర్చెదరు. అట్టిచేఁత కర్తృతనికులకు వేతనం బొక్కబండికి రెండణాలైన నొసంగవలయు. అక్కాలంకమ నొక్కొక్క యిక్కనుండు గుండుల వలన నధ్వగులధ్వంబరయుట దుస్సాధంబగుటం జేసి వారల సాహాయ్యం బనాదరణీయంబే నిదుమ నోడమ కుండదు. నవీనులగు నధ్వనీనులా నదిలో నడవనేరరు గాన, నాభృతభుజులు భుజంబులు పట్టికొని నడపి యన్నదిఁ గడపెదరు. అయ్యేఁటు నే దాఁటిన చోట జలం బూరుదఘ్నంబుగ నుండె. వేఱొండు రేవు నే నుత్తరించిన రేవున కనతి దూరంబున నున్నది. అయ్యది తోడెంపు రాళ్లగుంపు పఱపు లేదుగాని మిగుల మెఱకయుం బల్లంబుగ నుండుకతంబున నే విధంబునం బండ్లు వోనేరవు. నీరంబు తోరంబు గానియప్పుడు దక్కఁదక్కనప్పు డప్పయస్విని ప్రజలకేధ నిస్తరింప దుస్తరంబు గావున నా రేవునఁ బడవ నిడియెదరు. అప్పడవ నరవంబునఁ బరశైయని నొడివెదరు. అయ్యది యతిరసంబులు వడలుగాల్చి కాఁగుడు పడువున వెదురుబద్దల నిర్మితంబై మీఁదికడఁ జర్మపరిష్కృతంబైయున్నయది. మానవారోహణంబున కనుగుణంబైన తద్వ్యాసంబు మానం బయిదా అడుగులుండెడు. బండు లెక్కుదాని వ్యాసంబు కొలఁది పది రెండు పది మూఁడడుగులుండు. ఆకోలంబులు దృఢమూలంబులైనను ప్రవాహ కాలంబుల లోకులు వానిఁజేకొనిఁ యవ్వాకఁ దరింపఁ దత్తరింపుదురు. ఆ రేవునఁ బెల్లుగ పెల్లువ వర్తిల్లు నప్పుడ పడవలు పెక్కుతడవలు పారలి యంతర్గత పంచజనంబులకుఁ బంచత నాపాదించె. ఆ ప్లవంబుల నెక్కించు శకటం బొకటికి వెల్లువకొలఁది నరరూపాయ మొదలొక్క రూపాయ తుదగ మానిసి యొక్కనికిఁ బాతిక దొరఁకొని రెండురూకలు దాఁక నాతరంబుఁ

బుచ్చికొనియెదరు. అప్పుడవ్వార లేఁటేఁట రెండువేల రూపాయల దనుకఁ గంపెనీవారిఁ యొద్ద గుత్తగొనుచున్నవారు. అవ్వర్షంబున వర్షంబు లేమి నక్కరువున వెల్లువ రామి నన్నూఱురూపాయల వఱకు వారలకు నష్టి గలిగె. తత్పూర్వ వర్షంబులఁ బది పదు నేనుదినంబుల పర్యంతంబు విడువక పడుపలు విడువక యుండని యయ్యేఁటి నయ్యేఁటి మూఁడు మాసంబులుగఁ దేపలిపుట కాదాచిత్కంబుగ నుండె. ఆరేవున కొంచెంత దూరంబుగ నుత్తరంబున గంభీరంబగు నంభోమధ్యంబున నొక్క కుంభీరంబున్నదఁట. నా డిగిన రేవునకుఁ బాశపాణి దిశ న్యూనాధికంబుగ ద్విక్రోశ దూరంబున భవాని యను నూరు గలదు. ఆయ్యూరి చేరువం బాఱు కావేరికి వంతెన కంపెనీవారు కట్టించుచు న్నవారు. దానికిరువదివేల రూపాయలు వ్యయింపవలయునఁట. మఱియు నచ్చటఁ బ్రవహించు భవాని యను వాహిని కొక్కవంతెన నలువది వేల రూపాయలు వ్యయించి కంపెనీవారు నిర్మింపుచున్నవారు. కావేరీ మహాతరంగిణి శ్రీరంగ పట్టణంబునకు వారు ణాశఁ గొన్ని యోజనంబుల దూరంబున గొడవయను జనపదంబున మడక్కేరి యను నూరికిఁ జేరకయగు సహ్యపర్వతంబున జనియించి చనుదెంచి శ్రీరంగపట్టణంబునకుఁ బశ్చిమంబున రెండుయి యందొక్కం డొక్క పక్కగఁ బాఱి వేఱొండు వెండియు రెండుపాయలై యొక్క పక్కగ నప్పట్టణంబుఁ జుట్టికొని వచ్చి యమ్మూఁడు భాగము లును మఱియు నొక్కటియయ్యె పల్లపాలెంబు దారిగఁ బాఱి మున్ను దెల్పిన భవానియను నూరి కవ్వల భవానీనదిం గలసి చోళదేశంబున శ్రీరంగంబునకుఁ జెంగటఁ గ్రమ్మఱ నిరు భాగమ్ములై యమ్మహనీయస్థలమ్మునకు దక్షిణోత్తరములుగాఁ బ్రవహించె. ఉద గ్దిశం బ్రకాశిల్లునది "కొల్లెడమ్మని"యు, దక్షిణమ్మునఁ బాఱినయది కావేరి యనియుఁ గీర్తనీయంబయ్యె. మజ్జజ్జన వృజిన ప్రజాపనోదనంబున జగదాహ్లాద విధా యిని యగు నా దక్షిణకావేరీనది తొమ్మిదివిధమ్ములై యయ్యా స్థలమ్ములఁ గ్రుమ్మ రుచు నిరవధికమ్మగు మహిమమ్మునఁ బరగె త్రిలోకపావనములగు తజ్జీవనమ్ముల స్నానపానమ్ముల నాఁడు నమ్మునినాడు జన్మసాఫల్యమ్ము నొందినాఁడ.

నాఁటి నిశీథిని నా ఘనిఁ గ్రొత్తవారి చేరినఁ దొల్లింటి ప్రవాహంబు ద్విగుణంబై ప్రవహించుటం జేసి మఱునాఁడు ప్రాతఃకాలంబున నాకూలంకష నిస్తరింత మని నాఁడు పల్లె పాళెంబునందు విడిసియున్న నా తోడివారికి వాహనంబులతోడఁ గోలంబుల చేతన యావలి కూలంబుఁ జేరవలసెఁ గాక నాపోక పోలిక లేక యుండె. ప్రవాహకాలంబులం బోలెఁ దత్కాలంబునఁ గోలంబులు సన్నద్ధంబు గాకుండనిం జేసి వానినప్పుడ తెప్పించుటకును జక్రంబులూడ్చి బరువులు దించి యొక్కఁ డొక్కొక్కఁడుగ నెక్కించి శకటంబులు పశ్చిమ తటంబుఁ జేర్చుటకును దిమ్మటి వాని నెప్పటియట్ల సంఘటించుటకును బెద్దయుం బ్రొద్దు సనియె. ఆయాయాఫీసుల సామగ్రులంబూనిన కంపెనీవారి బండికిఁ దక్కఁ దక్కిన బండికిఁ బదియణాల వాతున సొంతగాండ్రిచ్చిరి. కంపెనీ బండ్లను దండును నంచెలవాండ్రును నప్పుడవ రెక్కనైడ వేతనంబు గానకుంద్రు.

కావేరి యావలి తీరంబున నుండు స్థలంబచ్చటి కొక్కంత తక్కువగ ముక్కాలు కోసెఁడు దవ్వున నున్న యీరోడను నూరఁ గాపురంబున్న యెల్లయ్య యను విప్రునిచే నిర్మింపబడినయది. అందు రెండు చిన్నగుళ్లున్నవి యయ్యంగళ్లు దక్క మఱియొకయిక్క యేనియుఁ గానము. బాటసారుల శకటంబులు దన్నికటంబున నిశ్శంకటంబుగ విడియుటం జేసి బెదరు గదురదయ్యె. అయ్యెడ నా రాత్రి గడపి యపరదినాపరాహ్ణంబునం బ్రయా ణంబయి యీరోడు నేరి నా తోడివారి యాగమనంబుగోరి యచ్చోటనున్నవాఁడ. వారు శకటంబులతోడ నన్నికటంబునకుఁ జేరుటకు నసామాన్యమగు నొక్కయామం బతీతంబయ్యె.

ఈరోడనునది కోటయుం బేటయుం గలయది. వ్యామద్వయోచ్ఛ్రాయంబుదాఁక నీల శిలాకీలితంబగు నాపాలంబు పూర్వకాలంబున నొక్క దొడ్డ రెడ్డి వలనం గలిగె. దాన రంగనాథ, తొండీశ్వరాహ్వయ, గరుడ వృషవాహుల గేహంబు లుండెను. నారాయణు రమణి రంగనాయకికి శూలపాణి రాణి వారణాంబ. మఱియు నా ప్రాకారంబున నగ్రహారంబును నితరవర్ణాగారవారంబునుం గలవు. కావేరి యాపలితీరంబున సత్రంబు గట్టించిన ముల్లయ్య యను జన్నిగట్టు చచ్చియున్నవాఁడు. నేఁబునం బెల్లుప్పు ప్రత్తి లోనగు సరకుల వ్యాపారంబు సేయు *షిపరను దొరకతఁడు నొక్క యెజంటు ను కార్యకర్త గావున నకోటలోనుండు నా దొర పెల్లుప్పు గిడ్డంగి యాతని యధికారంబునకు లోనయియుండు. అయ్యగ్గీర్వాణుండు సంగీత సాహిత్య విద్యాప్రవీణుండు గావునఁ దారాశశాంక ప్రభృతి కతిపయనాటక ప్రబంధంబులు శృంగారాది రసానుబంధంబులుగ రచియించియున్నవాఁడు. ఈరోడుపేట గొప్పది. దాన నొక్కపణ్యవీథికయున్నది. బేహారుల వలన వలయు నాహారవస్తువులు దారి నడచువారలకుఁ జేకూరు. అందలి కొంగశాయి యను నామంబుగల గ్రామదేవతకు మేషమాసంబున రథోత్సవంబుతోడ సంవత్సరోత్సవంబు జరుగుచుండెను. సితాసిత రుచుల మిగులఁ దఱుచగు బాణాల గొంగళ్లు పదియణాలచొప్పున విలుచువారికి జొప్పడుచుండు. తాలూకు కచ్చేరియు సత్రశాలయు నచ్చోఁ గలవు. కావేరీతీరంబు దొట్టి యీరోడుఁ జేరునంతవట్టు తెరువవిరళంబును సరళంబునుగాదు.

ఇరువది యాఱవ తేది భౌమవారయామినిం దురీయయామంబున నా గ్రామంబు నిర్గమించి, యమ్ముదుమ్ముప్పాతిక కోసుదవ్వునందనరు పెరుందొరై యను సంవసథంబు నపరదివసంబునఁ బదిగడియలకుఁ బ్రవేశించితి. అది చిన్నది. చోళేశ్వరుండను నాఖ్యచే విఖ్యాతినొందిన కుండలిమండనుం డుండు నిలయం బొకటి గలదు. అందలి యీశ్వరిపేరు వేదనాయకి. అప్పంచదుఃఖునకుఁ బంచపర్వోత్సవంబులె వర్తిల్లెడు. ఎంగిలీషు తెరువరుల విడిదియగుఁ గంపెనివారు గట్టించిన రెండు తొట్టికట్టులు గల రమ్యంబగు ధర్మశాలయుం గలవు. తెరువరుల కాహార పదార్థంబులు వలయునప్పుడు గలుగవు.

ఇరువది యేడవ తేది బుధవాసరంబున వాసరకరుఁడస్తంగతుండైన జాముకు నప్పెరుందొరై విడిచి కోసెడు దవ్వు గడచి దుర్ధర్షంబగు వర్షంబునకు లోఁబడితి. దినాంతానంతర ప్రయాణంబుల నాయా గ్రామంబుల నుండి నిశాంతపర్యంతంబుఁ *తారికవాండ్రేనియుఁ *దుడుకువాండ్రేనియుఁ గొఱకచ్చు కఱ్ఱల రగిలించుకొని యనుగమించుచుండెదరు గావున నాఁటి రాతిరి వారి చేతులలోని యలాతంబులు వారిధారాప్లుతంబులై యాఱిన మీఱిన యంధకారంబున దారిగానమి నా యనుచరవర్గంబు నేను నమ్మార్గమధ్యంబున శకటంబుల నిలువరించితిమి. ఆయాసారంబు దారవారిధారాపూరంబుగ నొక్క మూరుతం బనివారితంబుగ నుండి యనంతరంబ కొంత శాంతినొందె రే యెల్లఁగురియుచుండెఁగాన, నవ్వాన ననశ్చ్ఛదకులును సకలసేవకులు నత్తెరువున నీరవుబు గెలఁకుల తరువులె కాక వేతొండు వెరవులేక తద్దయుం దడిసి వడవడ వడఁకుచుఁ గడు నలజడిం బడిరి. శకటంబుల మీఁదివారికిని సంకటంబయ్యె. అవ్వర్షసమృద్ధికి నా పద్ధతి యంద యుండి యరుణోదయంబుకన్న మున్న యక్కడనుండి వెడలి పెరుందొరై కాఁబునర

---

* వీరు తలారియనియుం దోటియనియు నఱవంబునఁ జెప్పఁబడుదురు. ఇయ్యిరువురు సూరూరం గలిగియున్నవారు. వీరు మేర మిరాసీలవలన జీవించువారు.

(౬౪) కోసులనంగల శెంగపల్లి యను పల్లియకుఁ దొమ్మిది గడియలకుఁ జేరినాఁడ. అది నాలుగేను గుడిసెలుగలది. అందు సత్రశాలయు నెంగిలీషు బాటసారుల విడిదియు రెండంగడులు నుండె. వార్తాకంబులె కాక లాఁతి భోజనపదార్థంబులు లేకయుండె. మజ్జిగమాత్రంబు రువ్వకు రెండు తవ్వలిచ్చిరి.

ఇరువది యొనిమిదవ తేది గురువారంబునఁ గైరవారి వియన్మధ్యచారియై యుండు నెడ నయ్యెడఁ బెడవాసి యవ్విదునర (౫౪) కోసులనంగల యవినాశియను గ్రామంబు సాయంసమయంబున డాసితి. అప్పూర్వశర్వరీ వర్షంబ య్యుర్వినిం గలదయ్యె. అన్నెల వున నంతకుమున్ను వర్షార్థంబు గోలె వర్షంబు లేదు.

వినాశంబు లేమిం జేసి యవినాశి యని కథితంబయి భువన ప్రథితంబయిన యప్పురాతన పుణ్యప్రదేశంబున నవినాశీశ్వరుండను భవుని భవనంబు ఘనంబయి యొప్పుచుండు. అప్పీతాంబరాంబకుండు బృహత్కరుణాంబిక యను నంబికం గలసి భక్తజన సమాజంబుల పూజనంబులఁ దనిసి తదీయాభిమతంబు లప్రతిహతంబులుగ నరసి భృశంబగు యశంబున వెలసియున్నవాఁడు. ఆ దివ్యాలయంబునకు సవ్యాపసవ్యంబుల సౌందర్య యను నేఱును బ్రహ్మతీర్థంబను చెఱువు నొప్పారు. అప్పవిత్ర తమ క్షేత్ర చరిత్రంబు చిత్రంబును సజ్జనస్తోత్ర పాత్రంబునై శ్రోత్రంబుల కింపు సంపాదించుచుండు. అత్తెఱంగంతయు నెఱింగికొనుట కనుకూలంబగు కాలంబు సాలమిం జేసి కొండొక యాకర్ణించితిఁ గాన దాని నభివర్ణించెద. ఆ ప్రాసాదంబు గర్భాగారంబునకుఁ బురోభాగంబున నొక్క కూపంబు గలదు. అందలి జలంబులు భూమి మట్టమునకుఁ గొంత క్రిందుగనుండెడు. అయ్యుదపానంబులోని పానీయంబులు త్రిలోకీపావనియగు గంగాతరంగిణీ పానీయంబులు. అది యెట్టిదనినం, బూర్వకాలంబునఁ గాశీ విశాలాక్షీదేవి యవినాశి ప్రదేశంబున వాసంబుసేయ నాశించి తన యాశయంబుఁ బ్రాణేశ్వరుండగు కాశీ విశ్వేశ్వరునకు వినుపింప, ననుకంపావశంబున నమ్మహానటుం డక్కొమ్మ యుద్యమమ్మునకు సమ్మతించి నీ వమ్మహీకిం జని నన్ను గుఱించి తపమ్ము సముచితమ్ముగ సలుపుచుండు మచ్చోటికి విచ్చేసెదనని వాక్రుచ్చి వీడుకొలిపిన, నాక్షణంబున నాతొయ్యలి యాక్షేత్రం బధిష్ఠించి యొక్క వృక్షంబు క్రింద నాసీనయై యీశానాగమనం బపేక్షించి, యత్యుగ్రభక్తియుక్తిఁ దపంబొనర్చుచుండఁ బృథివీరథుండు భాగీరథి నచ్చటి కరుదేర నియోగించి తా నేగుదెంచి తననాతికి బ్రీతిగ నాతలంబున నివసించె. పదంపడి తద్వారణాశినుండి వియద్వారాశిగేహిని యంతర్వాహినియై యవినాశి దాసి గుడిలో వెలువడిన, నయ్యుదకంబు కతంబు మనోగతంబుగామి నక్కజపడి యక్కడివార క్క బంధంబుల నొక్క యంధువు రచియించిరి. అంతఁ గొంతకాలంబునకు నొక్క భూసుర సన్న్యాసి నిజసంచితార్థగోపనార్థంబు దండం బొండు సంపాదించి తత్పిచండంబు సరంధ్రంబుగావించి, దీనారంబుల నించి బాహుదండంబున నదియ దండంబుగం గీలించి పుణ్యక్షేత్ర తీర్థయాత్రావశంబున ధాత్రిఁ బరిభ్రమించుచు లోకప్రకాశకరంబగు కాశికాపురంబుఁ జొచ్చి గంగాతీరంబున నయ్యాశీరంబు నునిచి జలంబుల నిలిచి యయ్యతి యతినియతి స్నాన సంధ్యాది నిత్యకృత్యంబులు విధ్యుక్తక్రమంబున నిర్వర్తించుచుండ, నంతర్గత జాతరూపఖండ ప్రకాండంబగు నాదండం బభంగతర తరంగసంఘాతాపహృతంబయి యత్తరంగిణిం దాఁ గనుంగొన మునుంగ నాకర్షించి దిగుల్గొంది గ్రక్కున నక్కొల నక్కలంకకు లోనఁ గాలఁ గేలఁ దడవి తడవి కానక కొంతదడవు వంతమానక నివ్వెరపడి పదంపడి దారికృతతన్మనోరథుండయి భాగీరథి యథావిధి సమాచరితావశేషిత కాలోచిత కరణీయుండై సముచిత ప్రభావాతి మాత్రంబులగు దివ్యక్షేత్రంబులును దపోధనాగ్రగణ్య శర

ణ్యంబులగు పుణ్యారణ్యంబులును బవిత్రతాతిశయంబులగు జలాశయంబులును విచిత్ర చరిత్ర ధురంధరంబులగు మహామహీధరంబులును గామితప్రదంబులగు నదీనదంబులును నిరస్తసమస్తకలికలుషస్తోమంబులగు దేవధామంబులను, నిధ్యానించుచు నవినాశి డాసి కుండలికుండలుం డుండు నివేశనంబుం బ్రవేశించి యా ఖండపరశు నేవించి యతని దండం దనదండం బునిచియుండ దగ్గించి పెద్దయుంబ్రొద్దు విమర్శించి యమ్మహీపచుండు సంతుష్టుండై యి యవ్యష్టిమదీయంబని నిమ్మ గోపనంబును సురాపగాపహరణంబును బ్రత్యయంబు దోంచనాడి వేడినం గూడిన యద్దేవాలయాధికారుల వ్యాజదేవారాధకుల రావించి నిష్పక్షపాతంబుగ నిశ్చక్షణంబెక్కడి దిక్కడి కెక్కరణి వచ్చెననవుడు గర్భాగారంబున కగ్రభాగంబుననున్న కూపంబుం జూపి యుక్కాలమున్నక్కవేల నీ ప్రవహిం చేలం గొని యే వారిది గామి నీవృషగామి చేరువ నిడితిమనిన నెఱింగి పరుల కెఱుంగరాని దానిమూలంబు యాతనిచేతం దెరపించి యతండు నుపివిన వడువున నిమ్మ పకాండం బద్ధంబపిచండంబున నుండంబరకించి యాశ్చర్యంబునంబొదలి సంశయంబు వదలి యాతన్మాపోదకంబుల విముక్తపురంబునుండి వచ్చిన గంగోదకంబులని నిశ్చయించి సంప్రీత మనస్కులయి యమ్మస్కరికి నమస్కరించి దండంబొసంగిన నక్కర్మంది యమందానందంబుం జెంది పలుచందంబుల నయ్యిందుశేఖరు నభినందించి యద్దివ్యవర్తనంబుననుండె. ఆ వృత్తాంతంబున నాతని ప్రభావంబు దిగంతవిశ్రాంతంబయ్యె. అయ్యది యాదిచేసి, కాశికంటె వాసి యవినాశి యను జనవర్ణనంబు భువనపూర్ణంబయ్యె. ఆనాంటి లోతు జ్ఞాతంబు నేంతకు నద్దేవాధివాసాధినేత లాయామంబు చేతం దోరంబగు దారంబా నీరంబులో నెంతదూరంబిడిన నంతానంబు గానంబడమి దానం దోయంబు గొనునెడం బ్రమాదంబునంబడిన పాత్రాదికంబు సుకరంబుగ నుద్ధరణంబొనరించుటకు వ్యామద్వయప్రమాణంబగు నిమ్నంబున నయ్యంధుపరిణాహంబున నయోమయ తంతుసంతానంబుచే నల్లంబడిన యొక్క జల్లెడ సంఘటించియున్నవారు. అయ్యూద పానంబు పానాదికంబు నానారోగపాప నివారకంబు. గట్టు దొరపట్టి తపశ్చరణంబునకునికి పట్టగు కలిగొట్టు చెట్టగ్గుడి బయలంజూపట్టుచున్నది. అది "పాదిరి వృక్షంబ"ని ద్రవిడులు నుడివెదరు. సంస్కృతంబునం బాటలి యనియెదరు.

మఱియు నయ్యవినాశిం గాంపురంబుండువాండు కొండికవాండు సుందరుండను భూబృందారకనందనుండు చతుర్థవత్సరంబున నచ్చటి బ్రహ్మతీర్థంబను చెఱువునంబడి దాపిలోని గ్రాహంబున కాహారంబయ్యె. అంత శరత్త్రయంబున కనంతరంబున దురంతంబగు పుత్రశోకంబునకుం బాత్రయు సాశ్రునేత్రయుం గృశీభూతగాత్రయునగు తజ్జనయిత్రి తన తనయున కీనయగు పొరుగింటి పుడమితెలుంగంటి చిఱుతవానికి సప్తమ హాయనంబున నుపనయనంబు నయనపర్వంబుగం బ్రవర్తిల్లుచుండ నిజతనూజాతుం డాయురుపేతుండయ్యెనేని నియ్యెడ నుపనీతుండయ్యెడుంగదా యని యశ్రాంత నితాంత చింతాక్రాంత స్వాంతయై బంధుజనంబుం జూడ రోసి నిశాంతంబుం బాసి వివిక్తప్రదేశంబు డాసి పుత్రశోకావేశంబునం జేసి కందర్పసుందరా! సుందరా! యని సారెసారెకుం జీఱుచు వెలువెలంబాఱుచు వెక్కుచుం బొక్కుచు మూర్ఛంగూలుచు దేలుచు నుల్లంబున మల్లడిగొను తల్లడంబునం బనివిపనివి పలవించు తఱి, నక్కలపాలి కాతిలకంబు పురాకృత పరిపాకంబున ననన్యసామాన్య భక్తివశీకృత నీలకంధరుండును, నసాధారణ మేధాధురంధరుండునగు * సుందరుండను భూసురుండప్పథంబునం బోవుచు నవిరామంబుగం దన నామంబుచ్చరించుచు మిగులవగలం బొగులు నమ్మగువచెంత కరిగి తత్సంతాపోదంతంబంతయు

* ఇతండు సుందరమూర్తియనియు బేర్కొనంబడు

నెంతయు వినయంబున నాలించి కరమ్ము గనికరమ్మున నయ్యమ్మనూఱడించి యవి నాశేశ్వరు సన్నిధానంబునఁ గరుగుదెంచి ద్రావిడంబున సద్యోరచితంబగు హృద్యానవద్య దశకంబున నభ్యర్థించిన, నన్నిటాలాక్షు కృపాకటాక్ష నిరీక్షణంబుల నకాలంబున నిష్ఫలాలంబుగ నున్న యచ్చేలు వచ్చెరువుగఁ దత్క్షణంబ కాండ ప్రకాండంబున నిండిన నందుండి ప్రక్కనొక్క మహోగ్రగ్రాహం బుదగ్రదేహంబై సముగ్రానుగ్రహుండగు నయ్యుగ్రు నగ్రంబునకుఁ బఱతెంచి వక్త్రంబు దెఱచి క్రక్కిన, నచేతనుండును సప్త హాయన వయస్కుండగు నొక్కండిక వానిం గన్నదాని కొసంగిన నొసంగిన యస మానానందంబున నిజనందనుంగాని యయ్యిందువదన యత్యాశ్చర్యకరచర్యా ధుర్యుండగు నమ్మహీసురవర్యు నభివందనపూర్వకంబుగ నభినందించి యయ్యురగా భరణు నతాభిమతానుసరణం బంతఃకరణంబునఁ గొనియాడి యప్పూబోడి పుత్రసమే తయై కౌతుకంబున నిజనికేతనంబున కేతెంచి యన్నిగమవాహునకు వాహనంబుగ నొక్క గ్రాహంబు లోహంబున రచింపించి సమర్పించె.

ఆ శేషభూషునకు మేషమాసంబున మృగశీర్షంబునఁ దొడంగి మకర వాహనోత్సవ సహితంబుగ నీరాఱుదివసంబులు బ్రహ్మోత్సవంబు వర్తిల్లెడు. ఏ నా పశుపతి యాదవసి తంబు నొత్తెంచి నిజాభిధానం బన్వర్థంబుగ విపుల కృపాతరంగితాంబకయగు బృహత్క రుణాంబిక యను నీశ్వరికిం దత్పాదేశ్వరునికిం బరమభక్తియుక్తి నమస్కరణం బొన రించి ప్రమద మనస్కుండనైతి. మఱియు నా ధరణి వేంకటరమణుం డను రమారమణుని కోవెలయొండు వెలయుచుండు. ఆ బ్రహ్మవత్సలునకు బ్రహ్మోత్సవాదులు నడచు చుండెడు. అయ్యవినాశి లోచ్చపెచ్చుగ నుదవసిత శతకంబును నాపణశతకంబును గలయది. మేషమాంసంబయ్యెడ దుర్లభంబు. పచనంబునకుచితంబులగు తండులాది పదార్థంబు లుండెడు. కంపెనీవారి సత్రంబు నెంగిలీషు బాటసారుల విడిదియుం గలవు. ఆ నైలవున నేలము తహశీలుదారుండైన యణ్ణాజీ రావు తన పట్టికిం బుట్టిన కడుపు కుట్టు నెట్టనఁ బోగొట్టుట కయ్యవినాశీశ్వర ప్రార్థనంబుఁ జేసి తద్దయాతిశయంబునం జేసి నిజాభి మతంబు ఫలితంబగుడు నొక్క సత్రంబు గట్టించి దాన నన్నిదినంబు భూసుర సంతానం బున కన్నదానంబు నేయుచున్నవాఁడు.)

ఇరువదియవ తేది దైతేయగురువారంబు వేఁగుజామున నయ్యవినాశి నెడవాసి యాఱుం బాతికవీసము (౬|–) కోసుదూరంబున నున్న యన్నూర ను నూరు రెండాఱు గడియలకుఁ జేరినాఁడ. అవినాశికి లేశన్యూనంబుగ షోడశ క్రోశ విప్రకృష్టం బగు నీల శిలోచ్చయంబు సూర్యోదయంబు మొదలుగ లోచనగోచరం బగుచుండె. అన్నూరు చిన్నది. పథికుల కక్కఱగల పదార్థంబులు దుర్లభంబులు. పాల్కడలి యల్లు నిల్లును గ్రామదేవతయగు నంకాళమ్మ దేవళమ్మును నెంగిలీషు తెరువరుల విడిదియుఁ జెఱువునుం గలవు. కంపెనీవారు సత్రంబొండు గట్టించుచున్నవారు.

పేరుందొరె నిర్గమించి యరుగుమార్గమ్మునం బొడమిన వర్షంబు వర్షార్థంబుగోలె వర్షంబులేని యప్పుడమిం గలయది యయ్యె.

నాఁటి శర్వరి నిర్వది గడియలకు నన్నూరు దాఁటి కొటుపాళియం బను సంత సత్రంబపరదివసంబగు దివసపతిసుతదివసంబు నాదిమప్రహరంబునం జేరినాఁడ. దానికి దీనికి నాలునర (౬౪) కోసుఁగొలఁది గలదు.

ఈరోడు దొరకొని యన్నూరు చేరుదాఁక నిరుగెలఁకులఁ గల వ్రాఁకులవలన రమణీయంబయిన సాల విశాలంబుగ నొప్పుచున్నయది. అది గులకరాలఁగట్టిన లేనిదియైన నిట్టలంబగు మట్టిగట్టిన గలయది. అన్నూరినుండి మేటుపాళియంబు దాఁక సాల లేఱు నాభూమి నిమ్నోన్నతంబును శిలాకలితంబును గ నుండె. పెండియు గుండురాల క్కడక్కడ నెక్కుడుగ నుండెడు. అడ్డంబుగ నుండు గడ్డలలో నీలోపలంబులు సమంబులుగఁ బఱపియున్నను శకటంబుల కొక్కింత సంకటంబయ్యె.

నీలగిరికి నేనరిగిన తెరువునఁ గంచియు, వేలూరును సేలమ్మునుం దక్కఁ దక్కిన సామాన్య సంవసథమ్ముల వంకాయలుఁ దొండకాయలు మామిడికాయలు నుల్లిపాయలు నుప్పుఁ బప్పు బియ్యము నేయియు మీల యొండుగులును వేఁట యెఱచియుఁ గ్వాచిత్కంబుగ గోరు చిక్కుడుఁగాయలు గెనసుగడ్డలు లోనగు పదార్థమ్ము లమ్ముచుండెదరు. అల్పగ్రామంబుల వంకాయలుఁ గందిపప్పు నుల్లిగడ్డలు, దబ్బాటుగ వేఁట మాంసంబును శుష్కమీనంబులును దక్క మఱియొక్క ఖాద్యపదార్థంబు గానంబడదు. సేలంబున కవ్వల నరఁటి పండులు మామిడిపండులు నడుకులు సెనగలు బొరుగులుఁ బెఱుగును దాటి బెల్లంబును, నెల్లయూళ్ల మిగులం గలవు. వానలు లేమి భూమిఁ దటినీ తటాకాదికంబు లుపగతోదకంబులగుటం జేసి కంచికంటె నన్యంబులగు తానంబుల మీనంబులుం గానంబడవు. మేటుపాళియంబున భవాని యను వాహినిఁ గుశంబు భృశంబుగ ననిశంబుఁ గలిమి. ననిమిషంబులు విశేషంబుగ సమకూరు. సేలమ్ముగడచిన పిమ్మట నఱవ జాతులలో కొందఱు తెఱవలు పయ్యెద నిడకుండెదరు. అఱవ తెఱవ లందఱు శిఖిం జెక్కడ గుడిపట్టున గ్రుచ్చిళ్ళవెట్టి పుట్టంబులు గట్టికొనియెదరు. సేలము జిల్లా మొదలు మేటుపాళియము తుదగ నయ్యైవిడిమట్టులకుం గల మయిళుల సంఖ్య నల్లరాలఁ జెక్కి యొక్కొక్క మయిలున కొక్కొక్కచోట నాటఁబడియుండెడి. పెరుందొరై కవ్వల నచ్చటచ్చట జొన్న పయిరులు తరచుగం గలవు. పెరుందొరైనుండి పోవు త్రోవం గలవాన మేటుపాళియంబునం గలదు.

(మేటు పాళియంబు నూఱిండ్లుగలయదియని తోఁచెడు. ఆభూమిని భవానియను పేరుగల యేఱు పాఱుచుండు. ఆ నదియ పళ్లిపాళియంబునకు పశ్చిమమున నుండు భవానియను నూరికిం జేరికఁ బాఱునది. మేషమహిషవృషాదికంబులును శాకప్రముఖంబులును సామాన్యంబులగు ధాన్యంబులుం గలవు. సంత నాఁటికి మఱికొన్ని నూతన పదార్థంబులు విక్రీతంబులయ్యెడు. అయ్యెడ మేము చేరిన నాఁడ సంత. తెరువరులగు నింగిలీషుదొరలు విడియు నిలయంబును సత్రశాలయు నప్పాళియంబునం గలవు. అతావునఁ గ్రొత్తవాలాకం డున్నవాఁడు. అతని వేతనంబు మాసంబునకు నలువదిరెండు రూపాయలు.)

అయ్యెడఁ బడమటి దెసఁ గొండొక లోచ్చుగ మూఁడు కోసుల దూరంబున నీలగిరి నారోహించుట కాదియగు. ఆ సరణి నా ధరణీధర సమారోహణంబు శకటంబుల దుర్ఘటంబగుటం జేసి యమ్మేదినీధరంబు మీఁదికరుగువారందఱు మేటుపాళియంబునంద బండ్లనిడి వానిపై నిడిన సామగ్రులం గొనితేర నక్కడి క్రొత్తవాలు మూలంబుగ వలయు కర్షకరుల, నుత్తుంబుల, నడవలేనివారు డోలుల రావించికొనవలయు. డోలిక లెల్లప్పుడుఁ జొప్పడవు. అప్పాళియంబు నుండి కొండపై నుండు నుదకమండలంబుదాఁక సామానులు మోసికొనిపోవు మానిసి యొక్కనికిఁ బది యణాలును డోలీ మోయు మానిసి యొకనికి శారభేయంబునకును బ్రత్యేకం బొకటింగాలు రూపాయయు భృతి నియతమైయుండు. అప్పాళియంబునుండి యవ్వల నచలం

బెక్కు నంతవట్టు శకటంబులు వోవుటకు సంకటంబు గాని పథంబు గలిగియు నానా గ్రామంబులనుండి తద్గ్రామ మార్గంబున నానీలగ్రామంబునకుం బోవు వారెక్కి వచ్చు శకటంబులలోని పదార్థంబులచ్చటనుండి కొనిపోవుటకు వలయు భృతభుజుల వృషంబుల సమకూర్చ, నత్తలంబున నక్కొత్తవాలధికారులచే నునుపంబడి యున్న వాఁడుగావున నచ్చోటు దాఁటి యావల మల నెక్కుతలంబు దాఁక బండ్లం దోలుకొని పోయినను సామగ్రులు సానుమంతంబు పైకి నెత్తించికొని చన భారవాహులు సౌర భేయంబులు నచ్చో లభింపమింజేసి, యప్పాళియంబునంద బరువులు దించుట నిమిత్తం బుగఁ గూలికిం దోలు బండ్లు గలవాండ్రు, బండ్ల నవ్వల దోలు వాడుక లేదనియెదరు. కావున నా గ్రామంబునకా త్రోవంబోవువారు తమ తమ దేశంబుల శకటంబులఁ దెచ్చి కొను నప్పుడ యత్తిప్ప యెక్కు నెడదాఁక నడుపవలయునని బండ్లవారల నొడఁబఱిపిన, నా త్రోవ దాఁకఁదోలుదురు. అప్పుడు బండ్లలోని వస్తువులన్నియు పొంటుపాళియం బునఁ గూలివాండ్రచే ననడ్వాహంబులచే మోయించుకొని గుండెక్కుడు నెడ దాఁక బండి యెక్కి యరుగనగు. ఎందఱు దొర లెందఱు కర్మకరు లెందఱు తెరువరు లరుదెంచిన నందఱకు నక్కొత్తవాలె కర్మణ్యభుక్కుల శక్వరంబుల సమకూర్చవలయు. అందు మాకు ముందుగ, గ్రందుగ నేగుదెంచియున్న గవర్నరుగారు లోనగు నింగిలీషు దొరల వస్తువులకును నా యా యాఫీసుల నుండి యేతెంచిన యుద్యోగస్థుల వస్తువులకును నా కొత్తవాలు వైతనికుల బలీవర్దంబుల సంపాదింపఁ గొండొక యాలస్యంబయ్యెం గాన నేను నాతోడి వారింగూడి నాఁడు నమ్మఱునాఁడు నాయెడన యున్నవాఁడ.

స్రగ్విణి

* దేవదేవా ! బుధాధీన ! చక్రీ ! దరీ !
పావనా ! ధూతతాపా ! మహాత్మా ! కరీం
ద్రావనా ! నీలశృంగా ! మందోదరీ
జీవితేశాహితా ! శేషతల్పా ! హరీ ! ॥

భుజంగ ప్రయాతము.

హరీ ! దేవదేవా ! బుధాధీన ! చక్రీ !
దరీ ! పావనా ! ధూత తాపా ! మహాత్మా !
కరీంద్రావనా ! నీలశృంగా ! మందో
దరీ జీవితేశాహితా ! శేషతల్పా ! ॥

పంచ చామరము.

పరా పరా! ఖరాసురారి! భానుభాను భానిభా!
చరా చరాకరా! ధరా భుజా! యజాత్మ జాతజా!
ధరా ధురాహరా! ధరానుతాయుతా! జితాహితా!
హరా దరా దరా! నిరామయా! దయామయాశయా!

కం॥ ఇలలోఁ గోలాశేషా
చలకృత నీలగిరియాత్ర శ్రవణంబులకిం
పలరించు వచనకృతినిది
యెలరుం బ్రథమ ప్రకరణమయి యెల్లెడలన్.

* ఈ వృత్తంబునకుఁ దుదయందుండు "హరి" యను పదంబు మొదలిడ చదివిన భుజంగ ప్రయాతంబను వృత్తంబగు.

## ద్వితీయ ప్రకరణము.

క. శ్రీ వేంకట జగ్గారా
యా! వేంకటశైల విభు పదాంబుజ యుగళీ
సేవాపర! కరుణాకర
భావా! పరమనయశీల! బాంధవపాలా.

వ. విను మేటుపాళియము చేరిన వనుకం దొంటి ప్రకరణంబున శ్రుత దృష్టార్థంబులు వివరించితి; ననంతరోదంతంబు వక్కాణించెద నవధరింపుము. జూను నెల మొదలి తేది నిందువారంబున మార్తాండమండలంబు వ్యోమమధ్యంబు నలంకరింప మేటుపాళియంబు వెడలి కొంతయించుక మించుగ మూడుంగాలుక్రోసు దూరంబుననుండు బరళియారను ప్రదేశంబు సాయంకాలంబునం జేరితి. మేటుపాళియంబునకు రెండుమ్ముప్పాతిక వీసము (౨।।।–) క్రోసు నేలం 'కల్లార'ని ద్రవిడ భాషం బేర్కొనంబడిన జక్కారు యొక్కండు గలదు. కల్లారన ఱాతి యేఱని యర్థము. దానమెండుగ గుండులునిండి యుండుటం జేసి యాగడ్డ కల్లారని యన్వర్థ నామంబున విలసిల్లు. అల వాంగు నెలయ కాం గానంబడియెడు. దాన వంతెన యొండు గలదు. దానికవ్వలం గొంత దవ్వున నీలగిరి సమారోహణంబునకుం దొరకోలు. మేటుపాళెంబు దొరంకొని నీలశైలం బారోహించు దనుకం బథంబసంబాధంబుగాన శకటయానంబు సుకరంబని ప్రథమ ప్రకరణంబునం బ్రకటించితిం గావున నా వృత్తాంతం బిచ్చట నుజ్జగించితి. వినుండేను దత్ప్రదేశంబు కొత్తవాలుచే నిప్పించికొనిన శకటంబెక్కి కల్లారునకిద్దరిం జేరువనుండు మేదరవాండ్ర గుడిసెలదాంక నా చెలికాండ్రతోడంగూడి యేగితి. మేటుపాళియంబున కవ్వలం గొంత నేల దొరంకొని యా కటకారకుటీర పర్యంతంబు నిరంతర కాంతార సంవృతంబయి యున్నయది. ఆయరణ్యంబు వారణవారంబు లధివసించి బహువారంబులు పాంథులం బొరివుచ్చెనని మేటుపాళియమునందె నాకు వినికిం జేసి యయ్యవి యుత్తరించు నంతకు బెగ్గలంబగ్గలంబై యుండె. గిరి సమారోహంబాదిగ "బరళియారు" దనుక మార్గంబర్ధక్రోశంబని తోంచుచున్నయది. ఈ యర్ధక్రోశ దూరంబును గుధరసమారోహణంబునం గదిరిన దప్పితోం గాళ్లనొప్పితో బరళియారుం జేరితి. నాంటి బాట యేటవాలు కరంబెక్కుడు లేకుండె. ఆ యుపవ ఝరం బొకండు గలదు. అయ్యదియ బరళియారని చెప్పంబడియెడు. ఆ నిర్ఝరం బప్పర్వతాగ్ర సుషిరంబు నుండి హస్తిహస్త ప్రమాణంబునం జూపఱకు గోచరంబుగాంబడి ప్రవహించెడి. చెన్నపట్టణంబునకు లార్డు ట్వీడేల్ గారికిం బూర్వము గవర్నరుగా నుండిన లార్డు ఎల్ఫిన్‌స్టన్ గారిచే నచ్చో నొక ధర్మశాల నిర్మితంబయి యున్నయది. దాని పక్క యెదురం గొన్ని యాపణంబులున్నయవి. అందు శుష్కమత్స్యంబులును రెండు మూండు వగల కాయగూరలుం గానంబడియెడు.

రెండవ తేది మంగళవారంబునం బతంగుండు పూర్వ దిశాంగనా వదన మండలంబునకు సిందూరతిలకాయమానుండగుచు వెలుంగ బరళియారు నిర్గమించి హెచ్చుకుందుగం గోసెండు నేలనుండు మరపాలంబను ప్రదేశంబు పది ఘంటలకుం జేరితి. అచ్చోటదారికి నడ్డంబు వాఱు ఝరంబునకు మ్రాకులు పఱపి యాపయి మట్టి

గట్టించి వంతెన యొకండు నిర్మింపంబడియున్నయది. దానికి నర్థ్యంబగు నభిధానంబు ద్రవిడంబున మరపాలంబని ప్రసిద్ధంబయ్యె. మరంబన మ్రాను, పాలమన వంతెనగాన మ్రాని వంతెన యని యర్థంబు. అయ్యది నిరాలంబ ప్రదేశంబు.

నాఁటి యేటవాలు మఱి కొంత యెక్కుడగుటం జేసి యారోహకవారంబు లచ్చో మెచ్చుగ నలజడింబడి యుండి; నది యట్లుండ నా పడిన పాటులు కొండొక వివరించెద వినుండు. కొంత దవ్వు నడచి నడచి కాళుల నొవ్వుగదురఁ గొంతవడి నిలిచి నిలిచి కూర్చుండ గమకించి కాళులాటలుటుం జేసి వలనుగాక తూలం బోయి తోడివారల కయిదండ యూఁతగొని వెండియు నిలిచి యెట్టకేలకుం గూర్చుండి కూర్చుండి కూర్చుండజాలక తెరువునఁగద పయి పుట్టంబు పఱచికొని బాహువ యుపధానంబుగా నిడికొని కొంత దడవత్తమిల్లి యిత్తమిల్లి వెండియు లేచి మెల్లమెల్లగం బోవుచు నెడనెడ నానతపూర్వకాయుండనయి రెండుచేతుల రెండు మోకాళ్లం బట్టుకొని నిట్టూర్పు లడరం గొండొక దడవు నిలుచుచు నుదన్యార్దితుఁడనయి యా యయి నెలవుల మార్గంబున కడ్డంబు వోవు సెల వరవల నీరంబులు దోయిలించి దోయిలించి యాయాసంబు వోవ నానుచు నిట్లు మఱియుఁ బెక్కు పాటులం బడుచుం గ్రోశదూరంబేగి యావలం జన నేరక మిత్ర భృత్యవర్గంబుతోడ నా మరపాలంబునన నిలిచి యటునొక్క పెను చట్టుమాటున నొక మొనర్చి యారోగణంబుచేసి యచటన కొంతదడవు నేద దీఱం బరుండి యందుండి యొంటి ఘంటకుఁ దరలి వేళ న్యూనాధికగవ్యూతి దూరంబున నుండు కుణ్ణూరను గ్రామం బపరాహ్ణంబున నయిదు ఘంటలకుం జేరితి. కుణ్ణూరు డాయం బనుచోఁ దోరంబగు నా సారంబుచే సచ్ఛత్రులమయ్యు వేఁ దొంతు మాకు దొరకమిం దోఁగితిమి. కొండ క్రింది కల్లారుఁదొరఁకొని కుణ్ణూరి కీవలం గొంతదూరంబు దనుక నన్నిటి మూఁడుం బరక (32) కోసుఁ గొలంది బరఁగు. ఆ మీఁదఁ గొండ నెత్తం బగుట నారోహం బచ్చోటన పర్యవసితంబయ్యె. మరపాలంబు వెలలుట మొదలుగ నర్థక్రోశమార్గంబు నాఁటి పూర్వాహ్ణంబుకంటెం గొండొక యూర్ధ్వాభిముఖంబగు నేటవాలునం దనరుటం జేసి యంత దవ్వును బూర్వంబు నా వక్కాణించిన పాటుల కిప్పుడివాటిల్లె.

పినెక్కిన భూమి థరంబు నధోభాగం బాదిగ నారోహణానురూపంబగు నేటవాలుగం గొంత వెడందగ గుద్దలించి కట్టించిన త్రోవ కడముట్టంగలదు. దారి యయ్యది యొకని మిది యడుగుల కొలంది వెడల్పునకు లోచ్చునుం బదియే నింటికి మెచ్చును గలుగదని కానంబడియెడు. మార్గంబుకయి యగ్గట్టునం గొట్టిన పిలువు కొలంది యడుగులు నాలుగింటికిం దక్కువయుం బండ్రెండింటికి నెక్కువయు లేదు. అమ్మార్గంబు క్రమక్రమోర్ధ్వాభిముఖంబుగ గట్టుచుట్టు దిరిగి పోవుచున్నయది యెట్లనిన వివరించెద. ప్రథమారోహంబాదిగ బశ్చిమాభిముఖంబుగం గొంత నేలయు యామ్యదిశాభిముఖంబుగం గొంత మేరయు వెండియుం బ్రతీచీముఖంబుగం గొంతవట్టునుం బిదప నవాచీముఖంబుగం గొంత మట్టును మరలం బరమదిశాభిముఖంబుగం గొంత నెలవును, నుదగ్దిశాభిముఖంబుగం గొంతయెడయు గుడునుగం గొంత చోటును గాఁ గున్నూరి కివ్వలం గొంత దవ్వుదాఁక దారివోవుచున్నయది. ఇమ్మార్గంబు పూర్వదిశాభిముఖంబుగ మరలుట లేదు. తత్తద్దిగభిముఖంబుగ వక్కాణించిన యీ త్రోవ కొంతచో సమదిశంబుగం గొంతచో నయిమూలగం బోవుచున్నయది. అక్కొండ నెక్కనుంకించు డాదిగఁ గుణ్ణూరి కివ్వలం గొంత దవ్వు దనుక దా వంకం గొండ యెక్కుండు గొంతనేల సన్నికృష్టంబుగఁ గొంతనేల విప్రకృష్టంబుగ లోచనగోచరంబయ్యెడి. బరళియారున కవ్వలికొంత దవ్వు

మొదలుగాఁ గడు దూరంబు మార్గంబునకు వామభాగంబునం గరంబు లోఁతగు పల్లంబున్నయది. అయ్యది యీరెండు కొండలలోయయందు సెలనీరు వారని యీరవంబుతోఁ బాఱుచున్నయది. ఆ లోయ దారుణ నీరంధ్ర ధారుణీరుహమయంబయి కానంబడియెడి; నాగర్తంబు మహావ్యాళ జాలంబని యనుమితంబయ్యెడు. అయినను మార్గంబున కెగయనెక్కు నానుభిత్తి యిమ్ముగా మించేసి యీసత్త్వంబుల వలనం బాంథులకేమియుం బీడనంబు వాటిల్లదు. మదారూఢంబగు ధారుణీధరం బెడనెడ నంతర్గతంబులగు ప్రస్తరంబులఁ గలిగి మృణ్మయంబై యొప్పు తెరువునకయి చెక్కిన పార్శ్వభిత్తికలోని మృత్తికాంతరితంబులగు గండోపలంబులు జడులం దడిసి సోఁకిన మీఁది మన్నెల్ల విడిపోవ నొండొండ యరిలి పడియెడు. మఱియు నలువదియడుగుల పరిణాహంబుగల యట్లు ప్రతీయమానంబగు నొక్క మహోపలంబు పొదివికొనియుండు మట్టిరొల్ల మున్ను నడిచిన పథువున నానాఁటు బోవం బొరలి యీలోయంబడి కానంబడియెడి. ఆ గ్రావంబు త్రోవకయి చెక్కిన పక్కగోడం బొదువంబడి దారిమీదికిం గొండొక యొఱిగి యాతపత్రకల్పంబుగాం బాంథులకుం బాసక్రియాకలాపంబు నిర్వర్తింప, విశ్రమింప, ననువుగనుండె. అయశ్మం బాకస్మికంబుగాం బొరలిన తఱి కొంపటు క్రింద జనులు ప్రుందిరి. ఆ డాపలి వలపలి కొండలయడుగులనుండి కూటంబులదనుక మార్గంబునకు గోచరించు భాగంబులు నిబిడతర మహాగంబులు. తద్భాగంబుల మహాసత్త్వంబులు లేవు. వానియందుఁ బెక్కడలు దొంతర బంతులయిన వివిధసాలవిటపివిసరంబుల విలసిల్లి వీక్షణోత్సవంబు పుట్టించెడుఁ బెనుగుండు లుండు నెలవు లెడనెడఁ దరువు బగలని యెఱుఁ కానంబడియెడి. కొన్ని యెడలు బయలులయి చూపట్టెడు. ధారుణీధరారోహణంబాదిగాఁ గున్నూరు చేరువదనుకం బథంబు ద్రిక్కం దక్కగల నెలవులం దెరువరులు విశ్రమింప నిమ్మగు నికుంజ గానంబడదు. పక్క నొక్కంటి లోయయు నొక్కంటి గట్టునుం గనుపట్టెడు. బరిళియారు కడ మాత్రంబు త్రోవకు డాపంకం గొండొక నిలువ నిమ్ముగలదు. దాన నాపణంబులు గలవు. త్రోవకు వలపక్క విశాలంబుగాం గొంతగట్టు గొట్టి చదును సేసిన ప్రదేశంబునన మునుపు నడిచిన ధర్మశాలయున్నయది. ఎక్కనుండించుటకుఁ గున్నూరుదాఁక నిలువనిమ్మగు నెలవులేక తెరువరులు పడియెడి యలజడి యడుపంగడంగి పెక్కురొక్కంబు వ్యయంబొనరించి నిర్మలాత్ముండు లార్డు ఎలిఫినిస్టన్ప్రభుండా ధర్మశాల నిర్మించెను. తద్భవనంబాతఁడిద్దేశంబునకు బెక్కులగు మేళ్ళొనరించి యుపార్జించిన యశోమండలంబు విడంబించుచుండెడు. సవ్యభాగంబున దారికడకుం జూపట్టినగట్టు కున్నూరి చేరువను గోచరంబయ్యె. కున్నూర నీవలివంక నొక్క నిర్ఘరంబు బద్ధసేతువయి యొప్పు.

కున్నూరు గొంత సమంబగు నెత్తంబున నున్నయది. ఆ గ్రామంబు త్రింశద్ధామంబని తోఁచెడు. వివిధంబులగు నాపణంబు లొక్కబంతియయి చూపట్టెడు. అక్కడ గొఱియ మెఱచి, మీలమొండుగులు, కాయగూరలు బియ్యము నేయి పప్పు లవణంబును లోనగు పదార్థంబులుం గొన్ని భక్ష్యంబులును విక్రీతంబులయ్యెడు. నూఱు నూఱియ దుర్లభంబు. రొట్టెల గిడ్డంగియు, నంచెల చావడియు, నెంగిలీషువారి విడిదియుం, బథికులగు నెంగిలీషువారికయి నిర్మింపంబడిన హొటల్ అనంబడు పూటకూళ్ళ చావడియు, హిందువులకయి లార్డు ఎలిఫినిస్టన్ప్రభునిచే నిర్మితంబయిన ధర్మశాలయుంగలవు. ధార్మికుండీతడు కట్టించిన ధర్మశాలలు రెండును సర్వవర్ణసామాన్యంబులైయున్నయవి. కున్నూరికి నలువలకులం గొన్ని గట్టులెడనెడాఁ గనంబడియెడు. వానిమీద నెంగిలీషువారి మందిరంబులుగలవు. రోబ్డశన్ను డొక్కరుండక్కడ వసించి కాఫీ గింజలు తయారు సేయించుచున్నవాఁడు.

మూఁడవ తేది బుధవాసర మధ్యాహ్నంబక్కడనుండి వెడలి హోరావశేషంబగు సాయాహ్నంబున నుదకమండల నామక గ్రామంబుఁ జేరితి. ఆరోహణావసానంబాదిగాఁ నుదకమండలంబు దనుక మార్గంబు (౪½) సార్ధక్రోశ చతుష్టయ పరిమితంబు. కుణ్ణూరు దొరఁకొని హెచ్చుకుందుగ సార్ధక్రోశత్రయ పర్యంతంబు కొన్నియెడలం గొంత దవ్వెక్కుడుం గొంత దవ్వు దిగుడుంగాఁ గడమకోసెఁడు దూరంబునం గల యారోహావరోహంబులు దీర్ఘంబులుగా నుండుటం జేసి యెక్కుట దుఃఖంబుగ డిగ్గుట సుఖంబుగ నుండె. దాన మార్గశ్రమంబు కరంబు దోఁపదయ్యె. అట్లుండియు నంతరాంతరంబుల మాటిమాటికిం గొంత కొంత యలయిక పొలయింపఁబూనదయ్యె. అలజడి కోరువ నివారమ్మహీధరంబు వాహనగాములుగాకున్న మహాశ్రమంపడికాని యెక్కంజాలరు. శ్రాంతి యయ్యది యనుభవైకగమ్యంబు. మోటు జనులు మోటుపాళియంబునుండి పటువాత వెడలి ప్రొద్దుగ్రుంకు తఱికి ననాయాసంబుగ నుదకమండలంబుఁ జేరెదరు. బండులెగఁ ద్రొకిపోవుట కరంబు కడిందియయ్యు నాయయి యాఫీసుల పదార్థ సంచయంబులు గొనివచ్చిన కంపెని బండులమ్మార్గంబున మహాశ్రాంతి నీతంబులగుచు నాఱవ దినంబుదకమండలంబుఁ జేరె. బలవంతంబులు వేగవంతంబులు నన నెగడిన శ్రీరంగపట్టణోద్భాణంబులగు వృషంబులచే నాకృష్టంబులయ్యు నా శకటంబులు చేరుట కటఁ నన్ని వాసరంబులు గడిచెం దక్కువాని వక్కాణింప నేల! కుణ్ణూరి చేరువ మొఱవడిన గోత్రంబును మదారూఢధాత్రీధరంబును నాయూరి కొకవలన నొక్కండయియుండుననియనుమితంబయ్యెఁ దద్ధేతు వుత్తర గ్రంథంబున స్పష్టంబయ్యెడు. కుణ్ణూరు మొదలుకొని యుదకమండలంబుదనుక దారికిరుపక్కియలం గొన్ని యొండొంటికి విప్రకృష్టంబులును గొన్ని సన్నికృష్టంబులును గొన్ని సాంద్రంబులును గొన్ని విరళంబులునునయి హెచ్చుకుందులగు పెక్కు గుట్టలా నేత్రంబునం జూపట్టెడు. గుట్టలయ్యవి యెల్ల మృణ్మయంబులు. కొన్నింటం బలుతెఱంగులగు నొడ్డుగుండులు గానంబడియెడి. అగ్గుట్టలం గొన్నియెడలు సమతలంబులయి బయళులయి యున్నయవి. ఆ యెడలను దారిసూరెలం గల నైత్తంపుబయళ్లను శ్యామాకాది కతిపయ సస్యాలంకృతంబులయి కనంబడియెడు. అప్పంటకాఁపు లచ్చటచ్చటంగల గుట్టలపయి మిట్టలపయిఁ గుటీరంబులు పన్నికొని యున్నవారు. పార్వతీయులగు వీరికిం గన్నడంబు ద్రిక్కలాఁటిభాషం బరిచయంబు గలుగదు. మోటుపాళియంబున కివ్వలి విడిమట్టయిన యన్నూరు దొరంకొని యవ్వల వసించు వారలందఱుఁ గర్ణాట భాషయె వ్యవహరించెదరు. నుడివిన పార్వతీయుల చరిత్రంబు సవిస్తరంబుగ ముందు దేటపఱిచెద. మార్గంబునకు విప్రకృష్టంబులగు నగ్గుట్టల లోపలం బెక్కులుహరిత హరితంబులయి యవిషమతలంబులయి వృత్తంబులయి పాలాశ కంచులీకంచుకిత మత్తకాశినీవృత్తస్తనంబులుంబోలె లోచనాసేచనకంబులయి యొప్పెడు. కుణ్ణూరి కవ్వలంబోవం బోవం దారికి వామభాగంబునం దద్విధంబులగు కతిపయకుధరంబు లొక్కొటం గూటువయయి కానంబడియెడు. కుణ్ణూరికి నుదకమండలంబునకు మధ్యంబున మార్గంబునకు దావంకం గొంత నేలం గేత్తి యను గ్రామంబు గలదు. దాన నెంగిలీషు దొరలయు నితరులయు నికేతంబులునుం గతిపయాపణంబులునుం గలవు.

గాటికనద్దాన లార్డు ఎలిఫినిస్టోన్ మహీపాలుండు తా వసింపంగట్టించిన కాంతనిశాంతం బొక్కండుగలదు. జార్జి జేమ్సు కాస్ మేజర్ దొరగారు తద్భవనంబు విలిచికొని యందు వసించెదరు. ఆ యూరికీవలం ద్రోవలో నొక్కపల్లె యున్నయది. తన్నామంబు మఱచినాఁడ. అచ్చో గొన్ని పూరియిండ్లు నంగళ్లుం గలవు. నీలాచలంబు

నధిత్యకాతలంబున నుండు నుదకమండలాఖ్య సంవసథంబు చింతాద్రిపేటకు నొక్కడుం బాతికవీసంబు (౧|–) కోసులమించిన నలువదిరెండు (౪౨) యోజనంబులనేలనున్నయది. ఆ యుదకమండలం బెంగిలీషు భాషయందు ఊటకమండ్ అనియు ద్రావిడ భాషను ఒత్తైయనియు * ఉతకమండ్ అనియుం బేర్కొనంబడియెడు. అందు నేవలనం గాంచిన నగ్గులు నుట్టలు నిట్టలు నగుపట్టెడు. ఈ విధంబునన యా గ్రావంబునందు నెల్లయెడలం గనంబడునని విన్నవాడ. ఇక్కడ నాకు దృష్టంబులగు నధిత్యకాధరంబులం గొన్ని ములు పొదరు ప్రాంకుల సీలుగు లేమి సుగమంబులయి వానిం గలిగి కొన్ని దుర్గమంబులయి యున్నయవి. ఇట్టి గట్టులు పెక్కులు గలుగుటంజేసి యింగిలీషు వారు నీలగిరి హిల్స్ అనియు నీలగిరిస్ అనియు ననంగా నీలగిరి కొండలనియు నీలగిరులనియు బహుత్వంబు దోఁప బహువచనాంతంబులై యిప్పర్వతంబునకు వ్యవహరించెదరు. రెండియు నీలగిరియనుటకు మాఱుగా బ్లూ మవుంటెయిన్ అనియు నన్వర్థనామంబు వారిభాషను వ్యవహరించెదరు. ఈ నీలగిరి యందర్థంబు కోయంబత్తూరి జిల్లాలోఁ జేరినయది. అర్థంబు మళయాళపు జిల్లాలోఁ జేరినయది. రెండువత్సరంబుల కొక్కమాఱు సర్కారువారు † కమాండింగ్ ఆఫీసరును నీలగిరికి నియమించెదరు. అతనినే యా రెండు జిల్లాలకు జాయింట్ * మేజిస్ట్రేటు అను విచారణకర్తగా నియమించెదరు. నానాదేశంబుల నుండి యేతెంచి నీలశైలంబున వసించు సైనికులగు నెంగిలీషు ప్రభువుల కార్యంబులు నిర్వహింప నక్కమాండింగ్ ఆఫీసరు నియమింపఁబడియున్నవాఁడు. ‡ తహశీలుదారుం డొక్కరుం డేఁబది రూపాయల జీతగాఁడును గొత్తవాలొక్కండు నలువది రెండు రూపాయల జీతగాఁడునుగా నప్పర్వతంబున నియమితులయి యున్నవారు.

“మంజనికోరె” “కాందల” యనవి యుదకమండలంబునకునాంతర గ్రామంబులు. కాందలు హెచ్చుకుండుగ నిన్నూఱు గృహంబులును రెండు నూనాపణంబులును గొన్ని చిల్లర యంగడులుం గలిగియున్నయది. ఇక్కొటిక యొక్కండ యక్కొండ కన్న గొప్పయది. అయ్యూర గవర్నరు లప్టినెంట్ గారి మేడలో లార్డు ట్వీడేల్ గారు వసించినవారు. కోత్తగిరి యను గ్రామం బొకం డుదకమండలంబునకు నాఖండల దిశ సార్ధ సప్త క్రోశదూరంబునంగలదు. అందుఁ గొంద ఱింగిలీషువారున్నవారు. అచ్చట నంతల చావడి రొట్టెల గిడ్డంగియుంగలవు. అప్పర్వతంబున మఱియుంగొన్ని గ్రామంబులుగలవు.

ఉదకమండలంబున నెంగిలీషువారివి యేనూఱుదనుక సదనంబులుగలవు. అందుం బెక్కులు గుట్టలపయి మిట్టలపయి జూపట్టెడు. కొన్ని యధిత్యకాతలంబునం గనుపట్టెడు. అందుఁగొన్ని యుప్పరిగెలును గొన్ని దద్దడంబులును గొన్ని యీాడుబిల్లలచేఁగొన్ని యిటుకచేఁగప్పంబడినవియునై కానంబడియెడు. అచ్చటి ప్రభూత శీతంబునకు నిరోధంబును వెలుంగునకనురోధంబునుగాఁ దబాలయంబుల కెల్లఁగవాటుంబులును జాలకంబులును గాచఫలక నిర్మితంబులయి యున్నయవి. చెన్నపురంబున నుండియుఁ దదధీన దేశంబుల నుండియు బొంబాయి రాష్ట్రంబున నుండియు నేతెంచి యింగిలీషువారు శారీర సౌఖ్యార్థం బగ్గిరిని వసించుటంజేసి యందనేక నికేతనంబుల

---

* ఈ శబ్దంబు కర్ణాట దేశ్యంబని తోఁచుచున్నది.

† తత్కాలంబున * మేజర్ ఎస్. ఎ. గ్రాంట్ అనునతఁడు కమాండింగ్ ఆఫీసరు.

‡ అప్పుడు తహసీలుదారుఁడు వరదాచార్యుండను విప్రుండు. కొత్తవాలు వేంకట రమణయ్యయను బ్రాహ్మణుండు.

నారతంబును జనాకీర్ణంబులయి యున్న యవి. ఆయాయి నిశాంతంబులకు సథిత్య కాధిష్ఠిత గ్రామంబులకుం బోవుమార్గంబులు ఘంటాపథంబులయి యున్నయవి. అయ్యూరఁ గ్రైస్తుగుళ్ళు రెండును బధికులగు నెంగిలీషువారికయి నిర్మింపఁబడిన హోటలనంబడు పూటకూళ్ళచావిళ్లు రెండును బొంబాయినుండి వచ్చిన పారసీకు లుంచికొనియున్న షాపులనంబడు గొప్ప మళిగెలు రెండును చెన్నపురింగల దానికి సరియైన క్లబ్ హవుస్ అనంబడు పూటకూళ్లు పెట్టించువారి సభాసదనంబొక్కండును చికిత్సాశాల యొకండును ధర్మశాలయొండును పంచెల చావడి యొక్కటియుంగలవు. ఆ షాపులం గ్రయ్యంబులగు పదార్థంబులు చెన్నపురంబునం బోలె యథోచిత మూల్యంబులయి విక్రీతంబులయ్యెడు. పూర్వోక్తంబగు కొండలునకుఁ బూర్వ దక్షిణంబున నర్ధక్రోశ దూరంబున వివిధ పదార్థ సంపన్నంబగు విపణి ప్రదేశం బొక్కండుగలదు. అందును దాని దక్షిణోత్తర వీథులయందును జనావాసంబులగు సదనంబులనేకంబులు గలవు. ఈ ప్రదేశంబెల్లఁ బెద్దబజారని పేర్కొనంబడియెడు. అపటికి దక్షిణంబునం జెఱువొక్కండు గలదు. అప్పణ్య వీథికకుఁ బ్రాగ్భాగంబునం బెచ్చులొచ్చుగ నిరువది సదనంబులుగల యొక యగ్రహారంబు గలదు. అందుఁగొన్ని బ్రాహ్మణేతరవర్ణుల భవనంబులుంగలవు. అయ్యగ్రహారంబునఁ బౌరోహిత్యం బాచరించు విప్రుండొక్కరుండు గలండు. తక్కుఁగల విప్రులు లౌకిక వ్యాపారంబులం బ్రవర్తించువారు. అయ్యుదకమండలంబునంగల మనుజ మండలంబునకు నప్పురోధసుం డొక్కండ పౌరోహిత్యం బాచరించువాఁడు. అయ్యగ్రహారంబునందు వినాయక హనూమపర్వాద్వయాధిష్ఠితంబగు దేవళంబొక్కండు గలదు. అవ్వినాయకునకుం బ్రతి సంవత్సరంబు సింహమాసంబున నుత్సవంబు నిర్వర్తింపఁబడియెడు. హనూమంతునకు దినదినంబారాధనంబు మాత్రంబు జరుగుచున్నయది. అయ్యగ్రహారంబునకు నీశాన దిశ ననతిదూరంబునం గతిపయ కుటికా ఝుటాటంబు గలదు. అయ్యదియ యుదక మండలంబను ప్రధాన గ్రామంబు తొలుతఁ గలిగిన యది. అప్పటివారు దానిని "రొుత్తె" యని పేర్కొనియెదరు. పూర్వోక్తంబగు పణ్యవీథికంగల పెక్కు నిలయంబు లొడుబిళ్లలంగప్పంబడి యల్పీయంబులయి మృణ్మయ కుడ్యంబులైయున్న యవి. ఆరైనిమిదియడుగుల చతురశ్రంబయి తలవాకిలి దొరఁకొని యొక్క యంతరాగారంబు వంటియరొక్క మహానసంబును నెల్ల గృహంబులం గలిగియుండు. కొన్నింటికి మాత్రంబు కొంత బయలు పెరళులయియున్నయది. ఈ గృహంబులు బహుళంబుగా మృణ్మయకుట్టిమంబులయి కానంబడియెడు. తదంతరాగార మహానసంబుల నడిమి యావరణంబు వైణవంబులగు కటంబులచేత రచితంబులయి పెక్కు గృహంబులం జూపట్టెడు. కొన్ని గృహంబులం గూటములుంగలవు. లాఁతి నికేతంబు లేతత్సదృశంబు లయిన కుటీరంబులు. సమస్తగృహంబుల తలవాకిళ్లు నాలుగడుగుల పొడుగు కొలందికి మించక యున్నయవి. ఇట్లు మనవారల వేశ్మంబులన్నియు గరంబు సంబాధంబులయి యుండు. అగ్రహారంబున నొక్క తహశీలుదారుని గృహంబును బెద్ద బజారున నొక్క సుబేదారుని యగారంబును విశాలంబులయి కాచఫలకాంచిత గవాక్ష కవాటంబులయి వాసయోగ్యంబులయి యొప్పెడు. ఈ రెండు భవనంబులు నచ్చట మిగులం బ్రసిద్ధంబులు. ఆ సుబేదారు భవనంబున నొక భాగంబున నా మిత్త్రుండగు శ్రీనివాస మొదలియు నేనును విడిసియుండితిమి. అన్నింటికి ననుకూలంబయిన యమ్మందిరం బద్దియకు మాకు దొరకుటం జేసి సౌఖ్యంబు గొఱవడక యుండె. అక్కొండమీఁద సారాయిగుత్త యేర్పడిన దినంబు దొరఁకొని పెక్కేండ్లా గుత్తయొత్తి యయిదారు లక్షల రూపాయలు సంపాదించిన యా సుబేదారుఁడు కొన్ని యేండ్లకుముందు లోకాంతర

గతుండయ్యె. అతండు పెక్కండ్రర్థుల నర్థంబులందనిపి మహావదాన్యుండన నెగడి యశః కాయుండయియున్నవాఁడు. అతని యనుజన్ముండు లక్ష్మణనామధేయుండగ్రజుండుం బోలె స్థూలలక్షుండయి యశంబున విరాజిల్లి కన్నూరింజేరిన మానందవాడియను గ్రామంబున సారాయి గుత్తయొత్తి యచ్చోటం దిరంబుగం గాపురంబున్నవాఁడగుటం జేసి కొండమీఁది వారిగృహంబు మాకు వసింపనయ్యె.

ఉదకమండలంబునం గల పెద్ద బజారున రొట్టెల గిడ్డంగులయిదును మేషమాంసంపు దుకాణంబు లిరువది దనుకను గోగ్రామసూకర క్రవ్యంబుల యంగళ్లు గొన్నియు మఱియు సకలవిధాపణంబులును గలవు. మేషామిషంబు మూఁడు నాలుగు దినంబుల దాఁక మురుగుడువోవక గ్రాహ్యంబయియున్నయది. అచ్చోట నప్పటి పెరుగు చిరుపగుటం జేసి తొలినాఁటి తరసంబ తఱచుగ నమ్మెదరు. కొండపయిం జేయు నేయి యవదాత రూపంబయి చూపులకింపైయున్నయది గాని మిగులఁ బూతిగంధి. కమ్మరాకులు లవంగంబులిడి కాచిన నగ్గవులు గొంత శాంతంబయ్యెడు; నయిన నాఘృతంబు వ్యవహారార్హంబుగాదు. కోయంబుత్తూరు మొదలగు సంవస్థలంబులనుండి కొందరొక్కొక్క సమయంబున సుగంధియగు ఘృతంబు కొండమీఁదికిం దెచ్చి విక్రయించెదరు. తక్కుతఱి యట్టి యాజ్యంబు పూజ్యంబు. తద్గత యాత్రాపరులు మార్గంబునన దొరకిన మంచినేయి నేకరించికొని యేగవలయుం గాదేనిం గొండ క్రింది యూళ్లనుండి మంచినేయి రావించికొనవలయు. ఇన్నిపాట్లు పడుటకంటె వెన్న గరఁగించి యుపయోగించుట కడుమేలు. దధిక్షీర నవనీతంబులు మిగుల రసవంతంబులు. లవణంబు మలినంబయియున్నయది గాని గుణంబునం గొఱవడినదిగాదు. మఱియు నయ్యది మంట్టిం గలసి యుంటం జేసి నీటం గరఁగించి యా నీరు పదార్థంబులఁ గూర్చికొనవలయు. అచ్చటం బండెడేసి లవణంబు రెండేసి రూకలకు విక్రయించెదరు. నిర్దోషంబయి ధవళంబయిన లవణం బొకానొక తఱిఁ దెచ్చి యవ్వెలకయమ్ముచున్నవారు. శుష్కంబులగు మీనంబులును రొయ్యలును దొరకెడుఁగాని పచ్చివి దొరకుట యరిది. అక్కడి చెఱువున నొకానొకప్పుడు గడుంజిఱుచేఁపలు గొన్ని దొరకెడు. దొరకినం బట్టినవారు భక్షింపక తెచ్చియమ్ముట కాదాచిత్కంబు. మత్స్యంబుల నిచ్చగించువారు మెట్టుపాళియంబునుండి యంచెలఁబడి రావించికొనవలయును. అప్పాళియంబు నందలి భవానీవాహినిం బృథుపృథురోమంబులు పెక్కులుగలవు. తాదృశంబులు దొరకిన జాలరులు వేళంబ శైలంబు మీఁదికిం దెచ్చియమ్మెదరు.

ఉదకమండలంబునం బ్రతి కుజవారంబు సంతసాగెడు. పెద్దబజారునకుం బూరువున సంత సాగుటకు బయలొక్కండు గలిగియున్నయది. యాసంత మునుఁగ యనఁటి మెంతి గుమ్మడి బెండ బీఱ యుసిరిక వదరు వంగ కాఁకర మావి పందిరి చిక్కుడు గోరుచిక్కుడుఁ గాయలును గంద చిఱుగడదుంపలును మునుఁగాకు నవిసెయాకును, గొయ్య తోఁటకూరలును- మామిడి యరఁటి పనస పంకరపనస దాడిమ పేరీఁదు దాఁక త్రాటి యనాస దోసపండ్లును నారికేళంబులను జెఱకుగడలును జెఱకుబెల్లంబును దాటిబెల్లంబును దాటి కలకండయుఁ జక్కెరయుం గతిపయవాసరమ్ములదనుకం జెడకయుండు. మఱికొన్ని శాకకంద ప్రముఖంబులును బాతువులుం గుక్కుటంబులును వానియండంబులును బాపురంబులును నుపత్యకా గ్రామంబులనుండి మీఁదికి నానీతంబులయి క్రయ్యంబులయి విరాజిల్లు. కలకండయుం దెల్లచక్కెరయు షాపులందక్కఁదక్కుచోటులం దొరకవు. మృగయులొక్కొక్క తఱిం గుందేళ్లం గొన్నవారి యిండ్లకుం దెచ్చి మెచ్చువెలకిచ్చు

చున్నవారు. బంగాళాదుంపలు కిచ్చిలి పణీలా కిచ్చిలి నిమ్మపండ్లు ముల్లంగి గడ్డలు తెల్లగడ్డ ఉల్లిగడ్డలు గసగసలు గంజాయి గోధుమలు కొఱ్ఱలు చామలు బటానీలు కాఫి విత్తులు నప్పర్వతంబునం బయిరగుటంజేసి యల్పమూల్యవిక్రీతంబులయ్యెడు. అగ్గుబ్బలిమీఁద గసగసపయిరు తోరంబుగాఁగలుగుటంజేసి యచ్చటను నల్లమందు డించి యమ్ముచున్నవారు. బంగాళాదుంపలు గొన్ని తాలఫల పరిమాణంబులయి పాకంబున మృదులంబులయి కరంబు రస్యంబులయి యున్నయవి. చిఱు కొలందులగు నక్కాందంబులు నచ్చందంబు లయిననియు. సుకందక మహాకందంబులు పృథుకపిత్థ పరిమాణంబులుంగలవు. గసగసలు మిగులం గమ్మఁదనంబు గలిగియున్నయవి. నల్లమందు మిక్కిలి చొక్కంబు.

* ఎంగిలీష్ రెడిష్ బీట్ రూట్ * నోల్ కోల్ * టర్నిప్స్ * కారట్టాట్ అను గడ్డలు * స్పినేజ్ * కాబ్బేజ్ అను శాక పత్రంబులు * కాలీఫ్లవర్ అను పుష్ప * విజిటేబిల్ మారోయను శాక శలాటువు. * రాస్ బెఱి * మెల్ బెఱి స్ట్రాబెఱి * బ్లాక్ బెఱి * హిల్ గూస్ బెఱి * పీచ్చెస్ * పియర్ * ఆప్పిల్ అనంబడు ఫలంబులు నమ్మలయందు కలుగుచున్నయవి. ఎంగిలీషు రెడిష్షనగా సీమ ముల్లంగి. ఇది యీ దేశపు ముల్లంగికంటెఁ గొంత నిడుద సన్నంబయి యెఱడాలు మీఱి కారంబును గొఱవడియున్నయది. బీట్ రూట్టను కందంబులు త్రివిధంబులగు రోహితవర్ణంబులయియుండు ఈ మూఁడును జిఱుతీపుగలిగి మూలకసరూపంబులయి కొండొక స్థూలంబులయి కనుపట్టెడు. * నోల్ కోలను కందంబులు తాలఫలసమ్మితంబులును బాలాశవర్ణంబులు నంతర్ధవళంబులునైయుండు. * టర్నిప్సను దుంపలు బంగాళాదుంపలవలె వివిధాకారంబులయి ద్వివిధంబులయినవి. ఒక్కండు ధూసరంబు మఱియొక్కండు కించిదరుణంబు. ఈ రెండు నంతర్ధవళంబులు. వీని పత్రంబులు ముల్లంగిం బోలియుండు. ఇవి యీ దేశపు ముల్లంగిభంగి రుచి కారముగొఱవడియున్నవి. * కారాట్టను గడ్డలు మూలకప్రతీకాశంబులయి కొంత నిడుదలయి యార్ద్రహరిద్రావర్ణంబులయి యీషన్మధురంబులయి కారమ్ము మానియున్నయవి. ఇవ్వివిధ కందంబులు పక్వంబు లొనర్చి యెంగిలీషు వారుపయోగించెదరు. వీనిలో నేవానికి లోవన్నియతు వళ్యాణింపఁబడవయ్యె. వానిలోవన్నియ పైవన్నియ యొక్కండయి యుండునని యెఱుంగునది. * స్పినేజి యనుశాక పత్రంబు కొండొక నిడుదలగు పత్రంబులు గలిగి బచ్చలింబోలి యుండును. ఇయ్యది ముద్గసూప సంయుత పక్వంబయినం జవులందొలంకుచున్నయది. కాబేజియను కూరాకు పద్మముకుళ కల్ప నవపలాశ గుచ్ఛాగ్రంబయి యామూలవిరళచ్ఛదంబయి యేకకాండంబైయున్నయది. అయ్యది ద్వివిధంబైయుండు. అందొక్కటి యరుణంబైయుండు. మఱియొండు తెల్లనివన్నియది. ఈశాక ద్వయంబు మేషమాంసంబుతోడ నొండెం బెసరపప్పుతోడ నొండెం గూర్చి పచించిన భోజన యోగ్యతా భాజనంబయి యున్నయది. ఈ యదియ గోవునుకూరాకని యాంధ్రద్రవిడులచే వ్యవహరింపఁబడియెడి. * కాలిఫ్లవరను పుష్పంబు తాళఫల పరిమితంబయి రేకులు లేక యంతయు బుడిపెలు గలిగియుండు; నయ్యది సితాసితరోహితవర్ణంబులఁ ద్రివిధంబయి యున్నయది. ఈ ప్రసూనంబు కాబ్బేజి యను శాక పత్రంబుంబోలె వండిన ననవద్యంబగు స్వాద్యంబయి యున్నయది. * విజిటేబిల్ మారోయను శాకశలాటువు కుమ్మడయాకారంబుంబోనియది. ఆశలాటువులుగొన్ని యవదాతంబులు గొన్ని పాలాశంబులు. ఈ రెంటి లోవన్నియ యవ

చాతంబుగనుండు. వీని పత్రంబులుం బువ్వులుం గుమ్మడులబోలి యుండుంగాని పుష్పంబులు మాత్రంబు వానికంటెనల్పపరిమాణంబులై యుండు. ఈశలాటువులు మనదేశంబు వారుపయోగించుట గానంబడినదిగాదు. ఇవి సీమ యానుగంబులనంబడు. * రాస్బెరీయను ఫలంబులు రాచయుసిరికలంతలయి తొళ్లు గలిగియున్నయవి. ఆ ఫలంబులు పాటల వర్ణంబును గొంతతియ్యఁదనంబును జిన్నవిత్తులును మార్దవంబును గలిగియుండు. * మొల్బెరీయను పండ్లు గొప్పలగు పిప్పలులంబోనివి చిటికెనగోలంది లావులయి జంబూఫల వర్ణంబులయి బుడపలయి యీషన్మధురంబులయి యొప్పు. వీనిం గంబళి బూచి పండ్లని మనదేశంబువారు వ్యవహరించెదరు. * స్ట్రాబెరీయను పండ్లుగలవు. అవి యింగిలీష్ స్ట్రాబెరీయనియు "వియల్లు" స్ట్రాబెరీయనియు ద్వివిధంబులు. అందు మొదలి విచటకాండతుల్యంబులయి బహిరంతరంబుల ధూసరంబులయి మధురామ్లంబులయి యొసంగు. రెండవయవి వానికంటెం జిన్నయవి. తక్కు లక్షణంబు లెల్లందుల్యంబులయి యుండు. బ్లాక్బెరీయను పండ్లు రాస్బెరీవలెనున్నయవిగాని మేచక రుచికంబులయి మధురామ్లంబులయియుండు * హిల్గాస్బెరీయను పండ్లు * తవిటి జామి పండ్లని మన దేశమువారిచే వ్యవహరింపఁబడియెడి. ఇవి యచ్చింత కాయలంతలయి ధూసరంబులయి రసబీజంబుల మన దేశంబు జామిపండ్లంబోలి యున్నయవి. మనదేశపు జామిపండ్లు మెండుగ భుజించువారికి గ్రహణిగలుగుచున్నయది. ఆ ఫలంబులట్టి గ్రహణినడంచుచున్నయవి. * పీచ్చెస్సను పండ్లు వర్ణంబున నాకారంబున ముంతమామిడి పండ్లంబోలి యున్నయవి. లోపల విత్తుగలవిగాని మీఁదలేవు. కొంత పుల్లఁదనంబును గొంత తియ్యదనంబునుం గలిగి యున్నయవి. లోపల విత్తు చుట్టిరాఁగొంత కండ యొల్లనిది. తక్కుగలయది యొల్లందెల్లనిది. * పియరను ఫలంబులు కపిత్థఫలపరిమితంబులయి యామంబులగు నప్పుడు పాలాశవర్ణంబులయి పక్వంబులయిన తఱిఁబీతవర్ణంబులయి యంతర్ధవళంబులయి మధురామ్లంబులయి యొప్పెడు. * ఆప్పిలను పండ్లు దాడిమీ ఫలపరిమితంబులయి వానియట్లు వివిధవర్ణంబులయి యంతర్ధూసరంబులయి బదరీఫలంబులకంటె మాధుర్యాధికంబులయి యేకాల్పబీజంబులయి యున్నయవి. వీనిన సీమరేగు పండ్లని మనవారు వ్యవహరించెదరు. ఇవ్వియిప్పుడు నేఁజెప్పిన పెలపండులకంటె శ్రేష్ఠంబులయి శరీరబలవర్ధకంబులయి సుఖావహంబులయి యుండు. * ఎంగిలీషు నామంబుల వ్రాయంబడిన కందశాక శలాటు ఫల గణంబు లారోగ్యావహంబై యుండు:

వడ్లు దిక్కుఁ దక్కు గల ధాన్యంబులును సకలోపస్కరంబులును గతిపయౌషధవస్తువులును నేరండ తిలనారికేళ తైలంబులును దేనియయుఁబోగాకును దములపుటాకులును పోకలును వక్కలును జనోపయుక్తంబులగు మఱికొన్నియుఁ గ్రింది యూళ్లనుండి పెద్ద బజారునకు మిక్కుటంబుగం దెచ్చియమ్ముచున్నవారు. వీని లోపలఁగొన్ని సంతలోఁ జవుకగా విలువంబడుచున్నవి: ఆయేఁడు చక్కని వర్ణంబులేమి బియ్యంబేడు దొరఁకొని తొమ్మిది పళ్లవరకును రూపాయకు నమ్ముచుండిరి. అక్కడినీటఁ గంది పప్పు చక్కగ శీఘ్రంబుగఁ బక్వంబుగాదు. కావున ముందుగాఁ గొంత లవణంబుగూర్చి యుసరుగాఁచి దానను డికించిన నప్పప్పు శీఘ్రంబు పక్వంబయ్యెడు. ఉదకమండలంబునుదకంబు స్వచ్ఛంబు మధురంబునయియుండు నట్టిది. చెన్నపట్టణంబు దొరఁకొని నీలగిరి పర్యంతంబు మార్గంబున నత్యుతదృష్ట చరంబు. తములపు టాకులలోఁ

* వియల్లు అనఁగా నడవి.

చెల్లనివియు నెక్కుడు కారము లేనివియుం గలవు. పెంకు బిల్లలంబోలి చాయ వేసిన వక్కలు ద్రిక్కంగ దక్కుగల వక్కలు చిక్కవు. ఆ వక్కలు చవిమాలి యున్నవి. చెన్నపురంబున నుండి నాయట్లుదకమండలంబునకుం బోయినవారలలోఁ గొందఱవ్వక్కలు నోర ద్రవణంబొనర్చుటం జేసి వాని మాని పోకలు వేసికొనసాగిరి. మున్ను చెప్పినట్లు గవ్వలుతోఁప విఱిచి కాఁచిన నేతి వండిన లట్టాది భక్ష్యంబు లెల్లం గరంబు రసనీయంబులయి యున్నయవి. అమ్మధుర భక్ష్యంబులు వీనె యొక్కంటికి వెల యణాలు పదేను పిడక లయ్యెడలేవు. వంటచెఱకు కొల్లతలుల నక్కఱగా యంత దొరకదు. ఉండ్రంబులు నతి రసంబులును వడలును దోసెలును గుగ్గిళ్లను వేఁపుడు గాయధాన్యంబులును గొన్ని పగల బొరుగులును నడుకులును జక్కిలంబులును మఱంత మామిడి పప్పు నబ్బజారున నమ్మెదరు. ఇంతకుమున్ను వెల దెలుపని శాకఫల ధాన్యాది పదార్థంబులు గొంత హెచ్చుగుండుగఁ జెన్నపురంబునందుఁబోలె వెలకు నమ్మెదరు. చెన్నపురంబున దొరకని ఫలాదుల మూల్యంబు హెచ్చనియు గుండనియు వక్కాణింప నాకశక్యంబు.

అన్యదేశంబులందుఁబోలె నీ ప్రదేశంబున వడలు నరంధ్రంబులుగా జేయుట లేదు. దానికిం గతంబొకండు గలదు. వివిధంబులగు నపూపంబులు తఱచుగ మగువలె యమ్మెదరు. అప్పర్వతంబునం జరించు పార్వతీయులును గ్రిందివనంబుల జరించు పిండారివాండ్రును నతిరసంబులు వడలు లోనగువానిని వడలని యసామాన్యంబుగ వ్యవహరించెదరు తత్తద్భేదబోధకంబులగు విశేషణంబులతోడ నాయా యపూపంబుల వ్యవహరించువారగుటం జేసి వడలకు * "దొండివడై" యని పేరిడి వెలయిచ్చి 'దొండివడై యిమ్మ'ని యడుగ దొరఁకొనుటవలన నమ్మెడు మగువలకు నయ్యది మర్మస్పృక్కగుటఁ జేసి వడలు నరంధ్రంబులుగాఁ జేయుట మానిరట.

వివిధలోహపాత్రంబు లక్కడ నమ్మంబడియెడు. మృత్పాత్రంబు లగ్గంబున వానుటు గానంబడదు. దిగువనుండి వచ్చుచున్నవి గావున హెచ్చగు వెలకు విలువం బడియెడు. చెన్నపురంబున నొక కాసుకు దొరకునంత నీళ్లకడవ యక్కడ నాలుగు కాకలకుగాని దొరకదు. అక్కడవలు పదింటి వెలకు నొక తపేల గొనవచ్చు. అక్కడవల కంటె బహుకాలము తపేలయుండు. మఱియు నాఘటంబులు సంతలోనే యమ్మఁబడుచున్నవి. కావున లేవడిగలవారును నీరసులకు బిందియులె వాడుచున్నారు. స్వల్పవితర భేదంబులు నిరంతరంబు నాకణంబులం గలవు. అక్కొండ మట్టితోఁ గుండ లొనర్ప నితరులు నేర్పు లేమిం జేసి వాని నక్కడఁ జేయరు. వర్ష్యమాణులగు పార్వతీయులలోఁ గోత్తరనువారు మాత్రము తన్మృత్తికతోడన పాత్రంబులు చేసెదరు. వాని నక్కొండ కాఁపుల వాడెదరుగాని మనవారు వాడరు. రంభాపత్రంబులు మాత్రంబతి మాత్రమూల్యంబులయి సంతతంబు సంతను విలువంబడియెడి. పోఁక పట్టగాడలెగక బజారున నమ్మెదరు. అవ్వి కొంచె మించుక మించుగ మూఁరెడు నిడుద కొలందియుం జేనఁడు వెడఁద కొలందియుం గలవు. వాని రువ్వకొక్కటి లెక్కన నమ్మెదరు. సాధారణ జనులంద అప్పట్టలు పూఁట పూఁటకు నాహారానంతరంబు భోజనపాత్రంబుల వలెం గడిగికొనుచుం జిరిగిపోవు దనుక వాడికొనుచున్నారు. అట్లు నేయ నొక్కపట్టు యొక్క పక్షంబునకు వచ్చుచున్నయది. సానుమంతంబుమీఁదఁ గానులవంబడు రాగినాఁణెములు చెల్లుచున్నవి. అకాసొక్కం డొక్కరువ్వతోడ సదృశంబుగ వాడుచున్నారు. ఆ కాసులు కొండ క్రిందఁ జెల్లవు.

* ద్రావిడంబునందును రంధ్రంబునకు దొండి యను పేరు గలదు.

ఉదకమండలంబునం గల గృహారామంబులయందు మనోహరాకార సౌగంధ్యంబులగు పత్రపుష్పంబులును నయనోత్సవకరంబులగు చిఱు వికిరంబులును గలవు. తత్రత్యపుష్ప పత్రరథంబులు తద్గోత్రంబునందె కలిగినవి కాని తక్కువ తావులు గలిగినవి కావని తోచుచున్నయవి. జాజులు సంపెఁగలు మల్లెలు మొల్లలు లోనగునవి యస్మజ్జనోపయుక్తంబులు లేవు. సేవంతులును మిగుల * గొజ్జంగులును గలవు. మాలకాకులు, గ్రద్దలు, నూరిఁగిచ్చికలు, గరుడపక్షులు, గోరువంకలు మఱియు వొంప రెండు జాతులు దక్క మహీమండలంబునం బ్రసిద్ధంబులగు నితరాండజంబు లమ్మండలంబున గానంబడవు. ఆ కాకోల గృధ్ర కలవింక గరుడ శారికలం గొన్నియేండ్లకు మున్ను కొంద ఱింగ్లీషు ప్రభువులు నేలనుండి పట్టి తెచ్చి యచ్చట విడిచిరి. అది మొదలుగ నవ్విహంగంబు లభివృద్ధంబు లయ్యెడుంగాని తొల్లి యవియు నక్కొండను లేవు. గరుడపక్షు లొకండు రెండు దక్క మిగుల లేవు కలరవంబులచొప్పుగల పులుగులో నున్నయవి.

నారికేళ తాల మాలకామల కామ్లికామ్ర మేత్తుకట్ఫల పిప్పల కంటకఫల దధిఫల యజ్ఞాంగ ఉదుంబర కదళీ బదరీ వట వకుళ రోచక ఖర్జూర కరక క్రముక తరులక్కుధరంబున లేవు. సాలంబుల శైలంబుల వ్యాళజాలంబుల భయకరంబులు నగమ్యంబులు నగు ప్రదేశంబుల జ్యోతిర్వృక్షంబులను చెట్లు కొన్ని గలవు. అవ్వి రాత్రులగ్గివలె వెనుదవ్వ గానంబడియెడు. అహంబుల దేజోరహితంబులయి యితర తరువుల కరణి నుండుటం జేసియు శర్వరీసమయంబుల సర్వవిధంబులం గలుగు సాధ్వసంబులచే దుర్గమ మార్గంబులచే నా స్థలంబులు డాయ జనులకు శక్యంబులు గామిం జేసియు నా వృక్షంబు లీయవి యని తెలియంగుట యసాధ్యంబయి యున్నయది. తద్విష్కరంబులందు చోటులను గతిపయ ధరంబుల గల గుహాంతరంబులను మహామును లధివసించెదరనియు వారిని దర్శించిన పుణ్యులు కొందఱు గలరనియు నచ్చటివారు ధ్రువంబుగ నుడివెదరు. "ఇరుళ్ కణ్" అను మఱియొక జాతి వృక్షంబులు గలవు. ఆ వృక్షంబులు నటికిన చోటులం దడియుండుదనుక నిప్పుచొప్పున వెలింగెడి. ఇరుళ్కణ్ణనంగాం జీఁకటికన్న నియర్థము.

శల్య శార్దూల తుండాల భల్లూక కోకచిత్రకాయ లులాయ స్తబ్ధరోమ రామాది జంతు సంతానంబులకు నిశాంతంబులగు ఘోర కాంతారంబులు గలవు. ఆ యడవు లుదకమండలంబునకు దవిష్ఠంబులయి యుండు. ఉదకమండలంబున బెబ్బులులుం జిఱుతపులులు మొదలు పందులుం దోడేళ్లుం గలవు. అవ్వి రేల నెరకయి యచ్చోట్లం గ్రుమ్మరుచుండు. అమ్మండలంబున నుండు కొండలలోఁ గొన్నింట ద్రుమఖండంబులు నిండియుండెడు. వాని నచటివారు "శోల" లనియెదరు. అనఁగాఁ దోపులని యర్థంబు. అట్టి తోఁపులందు బెబ్బులులు గలవు. నేను వసించిన మేడకు దక్షిణంబునఁ గోసెండు నేల నొక గుట్ట యున్నయది. అందలి తోపున నొక ద్వీపి యున్నయదియని విని గవర్నరుగారు కొంద ఱింగ్లీషు ప్రభువులతోఁ గూడి యచ్చోటికరిగి వృత్తారూఢులై నిజసేవక గర్జాచర్మవాద్యాది నిస్వనంబులచే నా వ్యాఘ్రంబును వెలిపించి వెలువరించి తుపాకి యేటులం గీటడంగించిరి. మఱియు నేనుండు ప్రదేశంబునకుఁ బూర్వదిశ నర్ధక్రోశదూరంబునం గల శైలంబున తోఁపున శార్దూలం బొకండు వసించుట విని గవర్నరుగారును మరికొంద ఱింగ్లీషు దొరలును దాని వేఁటాడు వేడుకపై నాడకుఁ జని యొక పొదలో డాఁగియుండిన యా వ్యాఘ్రంబునకుఁ బలుతెఱంగుల వెలువొట్టించి బయలువరించి తుపాకిగుండ్ల నేయ నా దెబ్బలంబడి నెట్టన నగ్గట్టు వెనుకకుం బాఱి వేరొక యారంబున దూఱిపోయెను. ఆ ప్రదే

* ఇవి రోజాపూ లనంబడు.

శంబు వోవ నసాధ్యంబగుటంజేసి యా దొరలు వోక మరలిరి. వెండియు నప్పసి దిండి నేయ రెండుమారులు వారువోయి యొనవెట్టియు దొరకక తిరిగిరి. పులియు గవర్నరు మొదలగు నెంగిలీషు దొరలు మృగయులతో మృగదంశకంబులతో సన్నగంబులయి మృగయాఖేలనంబునం బ్రొద్దుపుచ్చుచుండిరి. కోయంబుత్తూరు, మళయాళపు జిల్లాలలోఁ గరిం బొరివుచ్చినవానికి డెబ్బది రూపాయలును గరిణిని మారణంబొనర్చినవానికి నేఁబది రూప్యంబులును బులిం బొలియించినవానికి ముప్పదియైదు రూపాయలును జిఱుత నుఱుముచేసినవానికి దశరూప్యంబులును భల్లూకంబుం జెల్లించినవానికి రూప్యంబు లయిదును పారితోషికం బొసంగ దివాణంబువారు నిశ్చయించి యున్నవారు గావున నొక పులిం జంపినందులకు గవర్నరుగారికి సయితము ముప్పదియైదు రూపాయలు చేరెను. ఆ రూపాయలు వారు తమయొద్దనుండు మృగవ్యులకుం బంచిపెట్టిరి.

ఉదకమండలంబునం బ్రాఁచులుఁ, జీమలు, దోమలు, నల్లులు, బల్లులుఁ దేళ్లునులేవు. నూవుగింజల కంటె నిసుమంత యెక్కుడయి "తెల్లపూచి" యనంబడు పురుగులు గలవు. మిడుతలుంబోలె దుముకుచున్నవిగాని యెగయుటలేదు. కఠినస్థలంబున గట్టిగాఁ జిదుమక చావవు. ఆ పురుగులు విభావరుల నరుల నిదుర గదురనీక గుములయి కొఱికి నెత్తురు పీల్చుచున్నవి. అక్కడి యెక్కుడు శీతంబుకొఱకు మానులు దక్కఁ దక్కుగల యంగంబుల కెల్లఁ దొడిగిన యూర్ణావస్త్రంబులతోఁ బుడమిం బరుండిన నక్కుటంబు లప్పటంబులలో దూఱి మేనుల మానక కఱచికొని కరచుచున్నవి. ఎన్ని దినంబులకైన మనము తీసివేయకకాని యవి తాముగా విడిచిపోవు. అవ్వి యొడలం బాఱుట యొడలికి లెస్సగా దెలియంబడదు. వీని యుపద్రవంబు కొఱకు నందలి కలవారెల్ల మంచకాదులమీఁదను, లేనివారింటింటికిం బన్నికొనియుండు నటుకల మీఁదను నలుకాళ్ల పలకలమీఁదను బెట్టియలమీఁదను బవ్వళించెదరు. ఇట్లు మీఁదం బరుండువారికి నజ్జంతూపద్రవంబు దొడరదు. ఇక్కుటంబులు గొన్నియేండ్లకుమున్ను దొరంబుగ నుండెనఁట. అగ్గట్టుమీఁది గుట్టలతో మిట్టలలోఁ బెక్కులు మిక్కుటంపుం బచ్చని పచ్చికలు గలిగియుండుటంజేసి పసికిమేఁత కొఱంతలేకుండు.

నీలగిరి పులులు మానిసింగొట్టి మరిగినవిగావు గావున నక్కడ మనుష్యులకు వాని వలన నే హింసయులేదు. మరిగినపులి మానిసిం గొట్టుఁగాని తక్కినవి జోలికి రావు. ఈ యర్థంబు గొందఱకు సంశయితంబుగాన నివ్విషయంబు తేటపడం గొండొక వాక్రుచ్చెద. ఎల్లతిర్యక్కులుం దమకు ఘాతుకంబులు గానివి యెట్టి మహాసత్త్వంబులయిన వానిచేరువలకు గొంకక క్రుమ్మరుచుండు. క్షుద్రంబులైన నక్షుద్రంబులైన ఖగమృగాదులు మానిసి మెలఁకువంగాంచిన వెఱచఱచి పఱచెడు. ఇట్లు భయావహులగు మనుష్యులచేఁ బట్టువడునప్పుడెట్టి క్షుద్రజంతువేనిం దన లావు కొలందిని వారి బాధించెడు. జీవితాశ యెల్లప్రాణులకు బలీయసి యగుటంజేసి యెట్టి జంతువేనిం దన కపాయంబు గలుగునప్పుడు తెగువమయి మాఱుమలంగకుండునె! వినుండు. మదీయమిత్రుం డొకండు దన చిఱుతకాలంబున నూరఁబిచ్చికల నలవాటుగం బట్టుచుండు. అప్పక్షులు మెడమలంగనీక పట్టనఁగాని లేకున్నం జంచూపుటలం గదువడి నెత్తురుపుట్టంగఱచి బాధించు. అనుదినంబు మానవుల చేతుల బట్టువడుచుఁ బెరుగు పారావతంబులు గూళ్లనుండు తఱిం బట్టిన బెట్టుగం గఱచెడుఁగాని యవి సయితము మిన్నకుండవు. మా యింటి లోపునం జిక్కువడిన యొక్కకొక్కు నొక్కగదిలోనికిం జొరఁగొట్టి కవాటంబు బంధించి దానిం జంపుటకు నొకండు గడంగుడు నగ్గరాటంబు జూనింగి

పోవనీక్షణమున దన్నుం గొట్టవచ్చిన వానిం గొన్ని నాఁటులు గోరుల బఱికి నెత్తురు ప్రుట్టించేసి యొట్టకేలకు వాని కఱ్ఱచేఁ బిఱుకుమారె. ఇప్పగిది మాగృహంబు నందనేక వారంబులు జరిగె. మఱియు నొకండు తన మందిరంబున నొక యపవరకంబునం దూఱిన యొక పిల్లి నా తలుపు బిగియించి బెత్తంబునం గొట్ట నలులంకులు దిరిగి తిరిగి యొంటిపోవఁ ద్రోవగానక తప్పించికొన నాసలేమి నమ్మార్జాలంబు తెగువ నేసి వానిపయిం దిరిగి యెగిరి యెగిరి పెఱుకుచుఁ గొఱుకుచు వాఁడు మఱిమఱి కొట్టఁగా మఱిమఱి రేఁగి కడు శౌర్యంబుతో నతని దేహంబున నెత్తురుట్టం బెక్కు విధంబులఁ జీఱి మీఱిన నాతం డవ్వేదనచే నగ్నియగ్గలంబగు బెగ్గలంబునం బలుమఱు బిట్టఱచిన నయ్యింటివా రదిరి బెదిరి యత్తలుపు బలిమిం దెఱచిన నబ్బిడాలంబు పాఱె. వాఁడును తత్క్షతంబుల నయిన వేదనచేఁ గొన్ని దినంబులకు మరణించె. క్షుద్ర జంతువులే యిట్టి కడిమిం జూప మహాసత్వంబు లిట్టి తఱుల నెంత సేయవు? ఒక్కతఱి మానిసిని వెఱపునం గొట్టి యా రక్తమాంసంబుల చవి మరిగిన వ్యాఘ్రంబు పొంచి మానవులం గొట్టి భక్షించు. ఒక్క పులి మానిసిం గొట్టఁగాఁ గాంచిన లాఁతి పులియు మనుజులం గొట్ట దొరఁకొనుచున్నయది. తక్కనవి గొట్టనేరవు. పులులెల్ల మానవులం గొట్టునేనిం బులులుండు కాంతారంబుల మానిసి మెలఁకువయ చొప్పడదు.

ఆ గ్రామంబునందలి గ్రామంబులందుండు వణిజులు నుద్యోగస్థులునగు నానావర్ణ జనులు బెంగుళూరు, మంగుళూరు, కోయంబుత్తూరు, తంజావూరు, వేలూరు, తిరుచిరాపల్లి, బొంబాయి, చెన్నపట్టణంబు మొదలగు చోటులనుండి వచ్చియున్నవారు. అప్పర్వతంబునందు సర్వకాలంబు వసించు పార్వతీయులు బడగర్ తోరాళి(య) తోడువర్ కోత్తర్ ముళ్లు కురుంబర్ అనియయిదు జాతులవారలయి యున్నవారు. ఇప్పార్వతీయు లాంధ్ర ద్రవిడులు లోనగు వారుంబలె గ్రామంబులం జేరక యా యా యూరులకు దవ్వుగం గుటీరంబులు వన్నికొని నివాసంబుచేయుచున్నవారు. ఈ యయిదు జాతులవారి వర్తనంబులును వీరిలో విశేషంబులగు కార్యంబులును నా విన్నకన్న కొలంది వివరించెద.

బడుగరను వారి భాష కర్ణాటభాషాసంబంధ మున్నయది. అదియ ప్రాచీన కర్ణాట భాషయని యచటివారు నుడివెదరు. వీరు లలాటంబుల బూది దాల్చియున్నవారు. ముళ్లకురుంబరు దక్కఁదక్కఁగల మూఁడు జాతులవారు నదియ ధరించువారైయ్యు బడుగరుంబోలె నైడపక యిడుటుగానము. బడుగరెల్లం గృషీవలులు. తత్కర్షణంబు వలనఁ గొండొక సస్యంబులు దక్కనెల్ల సస్యంబులు బడుగర యిడియెదరు. ప్రకృతంబున మనవారు నెంగిలీషువారును బడుగరిడని పయిరులును మఱికొన్నియుం బెట్టుచున్నవారు. ఈ బడుగరు తమ పంటలచే నుపార్జితంబగు ద్రవ్యంబంతయుఁ దమ బిడ్డల కాస్తిగా నిడియెదరు. తామడవులకరిగి తరువుల నఱికి వంట చెఱకులం దెచ్చి యూరుల విక్రయించి గూడిన ధనంబువలన జీవించెదరు. ఎంత కష్టకాలంబుననేని బిడ్డలకిడ్డ ద్రవ్యంబునందఱ కాసయిన ముట్టరు. మఱియు వీరిలోఁ గొంద ఱెంగిలీషు భాష నభ్యసించి ఇంగిలీషు ప్రభువులకు బట్లర్ క్లోత్ కీపర్ అనంబడు సేవకులై వర్తించెదరు. వీరిలోఁ గలవారు గొందఱుగలరు. వారు వేషంబుచే నిర్ధనులట్లు గానంబడియెదరు. ఈ జాతిలో విప్రులు గలరు. వారు యజ్ఞోపవీతంబులు ధరించి మాంసాదులం బరిహరించియున్నవారుగాని కడమ బడుగరుతో వియ్యమందుచున్నవారు. ఎడుందేవర్ అను పేరుగల దైవంబీ బడుగర కందఱకుఁ గులదైవంబయి యున్నయది. ఎడుందేవర్ అనఁగా నుద్ధరించు దైవంబని తాత్పర్యము. ఈ వర్ణంబున వివాహక్రమంబు వాక్రుచ్చెద. పెండ్లియాడ

వేడుకపడిన యతండు తన యిచ్ఛకువచ్చిన యచ్చెలువ గృహంబున కేతెంచి తద్రతుకులకుఁ దన వచ్చినపని వ్రాసిచ్చినవారు అచ్చెలువకు నాతనిం జూపి యితఁడు నిన్నుఁ గోరి యేతెంచె నితనిం బతిగాఁ గైకొన నీకు సమ్మతమాయని యడిగిన నవ్వనిత తనకు మనసు రాకుండిన నప్పుడ యయ్యర్థంబు వచించెడు. అట్లు పరిహరింపఁబడినవాఁడు వాడు వాడిన మొగంబుతో వ్రీడంగూరిన మనంబుతోడం బోయెడు. అవ్వనితకు మనసు వచ్చినవాఁ డయ్యేనేని శయనంబు వెనుకం దెలిపెదనని యది పలికెడు. అంతట నప్పెద్దలయ్యిద్దఱకు నా ప్రొద్దు తమ కలిమి కొలందిగఁ దగిన భోజనంబు వెట్టించి యానిశ శయన సదనంబున కనిచెదరు. అయ్యిరువు రేకాంతక్రియాకలాపంబుల నారేయి పుచ్చి యినుఁ డుదయించు వేళ లేచివచ్చెదరు. అప్పుడప్పడఁతి యాతని కూటమి ప్రియంబయ్యెనేని నతనిం బతిగాఁ గొనఁ గోరియెడు. అంతట నవ్వధూవరులకుం బరమానందంబుగఁ బరిణయంబయ్యెడు. అమ్మగువ కమ్మగని కూటమి సమ్మతంబుగాదేని నతికుతుకంబున వచ్చిన యతఁడు గొంతుకు వడుచుఁ బ్రతుకు సెడిన వాని కతన వెత నొందుచుం బోయెడు. ఇప్పగిది నమ్మదవతులు మదనకదనమునందమకు ముదమొదవించు వాఁడు దొరకు దనుక రుచి చూచుచుండుటం జేసి ప్రథమపరిణయ కాలంబునన గర్భిణులయ్యు నపత్యవతులయ్యు నుండువారుంగలరు. ఈ వెలందులు తమ వలచిన పూరుషుల నేనిం దమ్ముఁ గోరి వచ్చు నప్పు డిప్పుడు చెప్పిన చొప్పున సంసర్గంబునం బరీక్షించి వరింపవలయుం గాని తాము కోరకాని పరీక్షింపక కాని వరింపఁజనదు. ఇట్టి నియమంబున సుసంయమంబయిన దంపతులలో సతులు తమ కిష్టంబు లేని పతులం ద్యజించి యిచ్ఛ వచ్చినవారిని మరలఁ బరిణయంబు చేసికొనియెదరు. అప్పుడా నూతన భర్తలవలనం బూర్వ భర్తలు తమ పరిణయవ్యయిత ద్రవ్యంబు గొనియెదరు. పతులును దమ కిష్టంబు లేని సతులం ద్యజించి యితర తరుణుల వరించెదరు. అయ్యిద్దఱలోఁ బరిహరింపఁ గోరువారికి నప్పటుంగల యపత్యంబులయందు స్వత్వంబు లేదు. దంపతులలో మగువయేని మగండేని మృతినొందిన నున్నవారు మరల వివాహంబయ్యెదరు. వీరిలోఁ జచ్చినవారిని వస్త్రాభరణమ్ములతో వారు వాడుకొన్న కొన్ని పాత్రంబులతోఁ జితిపయినిడి దహించెదరు. మృతులకు లోకాంతరంబున నక్కఱపడి యాభరణాదులు కావలసియుండుంగాన వారితోడ దహించిన నవియు లోకాంతరంబున కేగెడునను విశ్వాసంబుచేఁ గాల్చెదరు. ఈ కులంబునం బెద్దతనంబు వహించియుండు వారిలో నొకండు కుణ్ణూరు, నొకఁడు కోత్తగిరి, నొక్కండూత్తెలో మణియగాండ్రుగా నియమింపంబడి తమ జాతిజనులవలన దివాణము వారికి నీవలసిన వేడిగ రూకలు కూడఁబెట్టి కట్టుచుండుట తమ కృత్యంబుగ జరుపుచున్నవారు. వీరికి దివాణమువారు మిరాసినేలలు నొసంగియున్నవారు. వీరు కుఱ్ఱుకురుంబులను వారికిఁ దక్కఁదక్కఁగల పార్వతీయులలోఁ బెద్దతనము వహించి కులవివాదములం దీర్చుచున్నవారు. వీరి కాజాతులవారందఱు మిగుల భయంపడి మాటాడక నడచుకొనుచున్నవారు.

తొరాళి (త్రి) యనువారు బడుగరనువారికి భృత్యులయి నిత్యముఁ గృషి సేయుచు వారిచ్చు భృతిఁగొని జీవించుచున్నారు. వీరి భాషయు బడుగరి భాషయు సరిగాఁ దోఁచుచున్నయవి.

తోదువరను వారి భాష యిట్టిదని యెఱుంగంబడదుగాని యింగిలీషు భాషం బోలిన యుచ్చారణంబుగల యదిగానున్నయది. వీరు నీలక్ష్మాధరంబునందలి యధిత్యకలన్నింటికి నధికృతులు గావునఁ బొల్లి యాశైలంబున నేలగావలసినవారెల్ల నేలలు వారివలనఁ గొని నిలయంబులు నిర్మించుకొనిరి. కృషీవలులగు బడుగరు వీరికి మేలువారము గట్టుచుండిరి.

ఇత్తఱి యయ్యూరి దివాణపు వారికిఁ జేరుచుండినను దానం గొంత వీరిం జేరుచున్నయది. ఇవియు గాక యీ తోదువరికి బఱ్ఱెలవలన జీవనంబు గలదు. అవ్వి వనమహిషంబులట్లు చూడ భయానకంబులయి యున్నయవి. వీని దూడలు చచ్చెనేని వాని వండి తినుచున్నవారుగాని చంపి భుజింపరు. ఈ పర్ణంబున నెవ్వఁడేనిఁ గాలధర్మంబు నొందెనేని వాని కర్మాంత దినంబుల నెల్ల బంధువులరావించి వారికి నమితదధిఘృత సహితంబుగ నన్నంబు వెట్టెదరు. వచ్చిన బంధువులందరింటికి నొక బఱ్ఱెం తమతోం దెచ్చి చచ్చిన యింటివారికిచ్చెదరు. వానిం దామునుచుకొని శుకులగల బఱ్ఱెల నయ్యుత్తర క్రియలప్పుడొక్కరోజున వధించి వాని చుట్టు గూర్చుండి యేడ్చెదరు. వీర లక్కాసరంబులందఱు వానిం బంధంబు గట్టిపెట్టుటలేదు. మేఁత పొలంబున యనిచెదరు. అమ్మహిషంబులం గొనిపుటకుం దెచ్చునప్పు డొక్కొక్కతఱిఁ దెచ్చువారికిం బ్రాణాపాయంబు వానివలనం గలుగుచున్నయది. బలిష్ఠులు ధీరులు సాహసికులునయిన యన్నరులు నలుగురేగురు చేరి యొక్కొక్క గాసరంబును బంధన రహితంబుగం బట్టి వానిం బోలియుండఁ జుట్టు ముదురిసియున్నచోటికిం దెచ్చి తెచ్చి తలలు పగులగొట్టి కొట్టి మడిపెదరు. తెచ్చువారు వాని బంధించి తెచ్చుట తమ పౌరుషంబునకు హానిజనకంబని తలంచెదరు. ఇట్లు దెచ్చుచో నమ్మహిషంబులు తమ్ముఁ జంపం గొంపోయెదరని యెఱింగి రోషావేశంబున విజృంభించిన దాని-జేసి యొక్కొక్కతఱిఁ గొంపోవు వారొక్కరిద్దఱు పొలిసెదరు. ఇట్లు మూడినం బట్టినదాని వదలక మఱి కొందఱు బాసటం దెచ్చెదరు. ఇట్లు దెచ్చి వధించి తత్సాంప్రదాయకృత్యంబులెల్ల నెరవేర్చి మగువలు మగలు నప్పురాను గాసరంబుల గెడఁ గూర్చుండి పలుపగలం బ్రలపించి పిదప నా సైరభంబుల నాచ్ఛాదనాదివస్తువులును గృహంబును బ్రమీతునిని దహించి యాశౌచనివృత్తి యొనరించికొని మఱియొక్క తావున గుడిసవన్నికొని బంధువులొసంగిన మహిషంబుల నునిచికొని జీవించెదరు. ఇట్లనలాహుతంబు లొనర్చిన వస్తువులు లోకాంతరంబునకేగిన వారికిం జేరునను బడుగరి యభిప్రాయము ననుసరించియో యని యెఱుంగునది.

ఈ యౌర్ధ్వదైహికక్రియలు దినత్రయంబు దనుకఁ దత్సాంప్రదాయికంబులగు నాటపాటలలోనగు నుత్సవంబులతోడం బ్రవర్తిల్లెడు. ఈ యుత్సవంబు లక్కడనుండు నింగిలీషువారును దక్కువారునుం బోయి చూచెదరు. ఇక్కడంబు గరితలు రజోవతులుగాకమున్న మగలం గూడెదరు. ఏకకుటుంబమునందును సోదరులందఱు నగ్రజు భార్యంగూడు వాడుకగలదు. అగ్రజుండు మిగుల వార్ధకంబు నొందియుండు తఱి నేనిం దత్కళత్రంబు కాలధర్మంబు నొందిన నయ్యగ్రజునకు పరిణయంబొనరించి తత్కళత్రంబుతోడన మఱందులందఱు గూడెదరు గాని జ్యేష్ఠుండు జీవింపఁ గనిష్ఠులు పరిణయంబు చేసికొనరు. జీవద్భార్యుండు కళత్రాంతరంబు గ్రహింపంజనదు. అగ్రజుండు మృతుండయినం గాకున్న నాతని భార్య మిక్కిలి వృద్ధయయినను గాని వారిద్దఱు మృతులయినంగాని రెండవవాఁడు వివాహంబయ్యేడు. వాని యనుజులు మునుపు నుడివిన పడువునన యగ్రజుని భార్యయందు నడచుకొనియెదరు. వివాహాపేక్షగల వాఁడుగాని యొక్కకుటుంబంబున నుండ సమ్మతి లేనివాఁడుగాని విభాగించికొని పోయి వివాహము చేసుకొనియెడిని. ఇట్లు విభక్తులయి పోవు వారిలోఁ గొందరు సహోదరులు మఱియొక కుటుంబమునకుఁ జేరియుండిరేనిఁ బూర్వంబు చెప్పినట్లు జూపించెదరు. ఈ పడఁతులు గృహంబులయందు వసించు తఱి వివసనలయి యలజ్జంబుగఁ గ్రుమ్మరుచున్నవారు. ఇంటివారికంటెం బెఱవారికి గోచరించు తఱి వసనంబులు ధరించెదరు. వీరలు కటిప్రదేశంబు దొరఁకొని యూరుపర్వంబులు నురోజంబులును మూయం బోఁకముడి యిడకయె యొంటి చుట్టు చుట్టుకొని

యుందరు. ఒక మూఁపునుండి రెండవదాని దనుకఁ గుచోర్ధ్వభాగంబున ధనురాకృతి యగు రేఖ పచ్చంబొడిపించికొనియున్నవారు. మఱియుం గ్రొవ్విదలు రచించుట లేదు. . కచంబులు నిగుడనీక కత్తరించి నెఱులు రా దువ్వి కపోలప్రాంతంబున జాఱ విడిచి యున్నవారు. వీరిలలో రూపవతులు విలాసవతులు మిగులం గలరు. వీరి పురుషులు శిరోజంబులను జిబుకశ్మశ్రువులును బెత్తెఁడు కొలఁదికిం బెంచికొని చూపఱకు సేవంబు పుట్టించుచున్నవారు. మున్ను సెప్పిన బడుగరిజాతి యధికారు లొక్కొక్క హుదన నొంటి పాటుననుండు నిప్పుడంతులం బలిమిం బట్టి కూడెదరు. అయ్యధికృతుల నేమిం జేయ ననువుపడమింజేసి పురుషులు తమ గరితల నొంటి డించిపోవం బ్రసక్తించి నపుడు మూచికొనియపోయి తెచ్చెదరు. గృహకృత్యంబులకయి పురుషులె వెలిం గ్రుమ్మఱెదరు.

కోత్తరను వారిప్పుడు సెప్పిన జాతులవారికంటె దక్కువవారు. వీరు వడ్లంగి కంసాల, కమ్మర, కుమ్మర, యుప్పర, చలవాది, మంగలపనులు సేయువారు. చర్మ సుషిర వాద్య వృత్తియుం గలవారు. వీరి భాష కర్ణాట భాషం బోలియున్నయది.

ముళ్లకురుంబరనువారిం గురుంబరనియు వాడికొనెదరు. వీరికి స్వభాష యొక్కటియు లేదు. ఆ కొండ రెండుజిల్లాలతోడం జేరియున్నయదియని మున్ను వివరించితింగదా! కోయంబత్తూరి జిల్లాతోఁ జేరిన వారచ్చటివారి భాషయ తడఁబడుచుఁ గొద్దిగా వ్యవహరించెదరు. వీరు తక్కిన పార్వతీయులం జేరక యున్నత పర్వత నికటంబములయందును గ్రూర సత్త్వఘోరంబులగు గోత్రకాంతారంబులందును బర్ణశాలలు వన్నికొని నివసించియున్నవారు. అమ్మగలు మగువలును మంత్ర శక్తియు మూలికాశక్తియుఁ గలవారగుటం జేసి క్రూర సత్త్వ భయంబు లేక యున్నవారు. వీరు తక్కు జనపదంబులకు వచ్చుట యరిది. పురుష లిరవులలేని తఱిం దమకు సమీపంబునం గ్రుమ్మరు పుండరీక వేదండాదుల నమ్మగువలు పసుల వెలుచు చందంబున రాలు ఱువ్వుట నొండెం గఱ్ఱలనొండెం గూఁతల నొండెం భీతి లేక పాఱఁద్రోలెదరు. మఱియు నమ్ముళ్లకురుంబరు మంత్రౌషధశక్తిచే వివిధమృగరూపంబులం దాల్చెదరంట! తమకు మిగులంబగ రెవ్వరే నొనర్చిన నిచ్ఛానురూపంబుగ భీకర మృగాకృతులు ధరించి యయ్యరుల హరించి యా రూపంబులం బరిహరించి నిజరూపంబులం గైకొనియెదరంట! ఇట్టి క్రూరకృత్యంబు లొనర్చుటం జేసి తక్కుంగల పార్వతీయులు వీరియెడల భయంబువలన వినయంబుదోఁప వర్తించెదరు. ఇవియుంగాక తమ వృత్తులవలనఁ గలుగు విత్తంబులలో దద్ధర్షంబు కయి యర్ధంబునకింత మాత్రంబని కప్పంబువలె నిప్పించెదరు. మన వారుం దక్కువారును వీరికి భయంపడియుండెదరు. శైలంబులంగాని సాలంబులంగాని యసాధ్యస్థానంబులనున్న తేనెపెరలనుండి తేనెలు వీర డించెదరు. గిరిచరులితరులు సుగమ స్థానంబులనుండు పెరల డించెదరు.

నేనయ్యద్రి నెక్కిపోవుచో నాకు దావంక నొక కొండ కానంబడుచు వచ్చెనని తొలి వక్కాణించితి. ఆశిఖరిణి శిఖరంబున బకుండను రక్కసుని కోటయున్నది. బరళియారు దాఁటిపోవు తఱి కొందరు తెరువరులు తత్ప్రాకారంబు మాకుం గానుపించిరి. అదియొక్క గోడవలెం గానంబడియె. బ్రజ లెక్కిపోవు వలపలి మలపయి రంగనాయకుల దేవళం బొక్కుండున్నయది. కొండ యెక్కనుంకించు దాదిగఁ గుణ్ణూరి చేరువదనుకఁ బ్రత్యేకములుగ గానంబడుచు వచ్చిన యా రెంటు కొండలయందుఁగల కోటగుళ్లకు నుదకమండలంబుననుండి కొండమీఁదుగానే జనులు వోయెదరు. కాన నా

రెండు కొండలుం గుణ్ణాగికడ నొక్కయెడం జేరినవని నేను మున్ను సెప్పినందులకు హేతువిదియె. పదియాఱు వర్షంబులకు మున్ను చెన్నపురికి గవర్నరుగానున్న లషింగ్టన్ దొరగారు బకునికోటఁ జూడ వేడుకపడి యుదకమండలంబున నుండి. మిగుల శ్రమంబడి కొంత దవ్వు చని యవ్వలిమార్గంబు కరంబు దుర్గమంబగుటంజేసి చనలేక బకుని దుర్గంబు దుర్బిణీ యంత్రంబునం జూచిరి. నాఁటగోలె నెంగిలీషు దొరలు వేఁటకయి యాటవికులం గూడి యాగిరిపయి నిరతంబు క్రుమ్మరుటంజేసి యక్కోటకు నిప్పుడు పోవు కాలి త్రోవ యేర్పడియె. మత్తవారణ సంచార ఘోరంబయిన కాంతారంబున నా ప్రాకారంబు గలుగుటంజేసి యటకేగుట యెల్లరకు సుకరంబు గాదు. తత్ప్రాంతంబున నల్లరాల గోడలచే నేర్పఱిచిన కొన్నియఱలు దక్కఁ దక్కు నిర్మాణంబు శిథిలంబయి కనుపట్టెడునని చెప్పెదరు. ఏకచక్రపురి పరిష్కార్థంబు భీమునిచేఁ జొలిసిన బకునిదియె యందుండు దుర్గంబనియును, నాకొండ క్రింది యేకచక్రపురంబిప్పుడు పాడువడి యేనుఁగులకుం బానకంబయిన మహాకాననంబయి యున్నదనియును, నచ్చటం గతిపయ దేవాగారంబులు గలవనియుఁ దత్రత్యులు నుడివెదరు. మోటుపాళియంబునుండి కొండకుం బోవు త్రోవకు వలపంకం గొంత మేర మున్నూత్తిమంగలంబను గ్రామంబు గలదు. ద్రావిడ భారతంబున నేకచక్రపురంబు మున్నూత్తిమంగలంబని వ్యవహరింపంబడియున్నయది. ఈ గ్రామంబు పాండవులున్న యేకచక్రపురంబునకు మాఱుగఁ గొంతకాలంబునకుఁ గల్పితంబయినదనియు దక్షిణ పాంచాలదేశంబక్కొండకుం బూర్వదక్షిణంబునం గొన్నియామడల మేరఁ బాంచాలంగుర్చియను నామంబున. నిప్పుడు నెగడియున్నయది యనియు నయ్యెడ జనశ్రుతి గలిగి యున్నయది. భారతంబున నేకచక్రపురంబు గోదావరీ ప్రాంతంబుననున్న యదియని వక్కాణింపఁబడియెం గావున నిప్పుడు నే నొడిచిన యేకచక్రపురంబునకు భారత కథా ప్రకారంబు సంబంధంబెట్లు గలుగునని సందియంబ యవశిష్టంబయి యున్నయది.

పూర్వోక్తంబయిన శ్రీరంగనాయకాలయాధిష్ఠితంబగు శిలాధరంబ నీలగిరి యని యచ్చటి వారిచే వ్యవహరింపబడియున్నయది. అచ్చటి పెఱకొండలలోపలం గొప్పవాని నామాంతరంబుల వ్యవహరించెదరు. తత్కుధరచరులగు ముళ్లకురుంబరు మొదలగువారేఁటికొకనాఁటికి నచ్చోటి కరిగి యారంగేశ్వరునకుఁ బూజావిధులు సేయుచున్నవారు. అత్తఱి నద్ధరాధరంబునందును దత్సమీపధరాతలంబునందును గల మనవారలుం బోయి యా సేవక సేవధిని సేవించుచున్నవారు. అయ్యది మధ్యరంగంబనియు మహిశూరము చేరువనున్న శ్రీరంగపట్టణక్షేత్రం బాదిరంగంబనియుఁ జోళ దేశంబునంగల శ్రీరంగక్షేత్రం బంత్యరంగంబనియు నయ్యెడ వాడంబడియెడు.

ఆ కొండపయి నుదకమండలంబునకుం బశ్చిమంబున హెచ్చుకుఁదుగ రెండామడ నేల "మూక్కురసిమలె" యనంబడు నొక గిరి గలదు. అగమ్యంబగు దాని గుహాంతరాళంబున మూక్కురసియను నీశ్వరియున్నదని జనశ్రుతి మాత్రంబు గలిగియున్నది గాని తద్దర్శనం బెవారికిని లేదు. జనులు దద్గుహాముఖంబునంద యా దేవతం గుఱించి పూజలొనరించుచున్నవారు. ఆ పరమేశ్వరీ మాహాత్మ్యంబు నీల్గ్రావంబునందెల్లచో నెల్లరుం గొనియాడుచున్నవారు. మఱియు నుదకమండలంబునం గొన్ని దేవళంబులు తాటాకులం గట్టి వానియందు నయ్యీశ్వరిని నిష్టకాదుల నావహింపం జేసి పూజించుచున్నవారు.

నేనక్కొండపయి వసించినతఱి నక్కడి గణేశునకు సింహమాసంబునం బది దినంబులు వరోత్సవంబు ప్రవర్తిల్లె. అనవమ దివసంబు రేల మాత్రంబు పూఁటపూఁటకొక్కొక్క వాహనంబుమీఁదను బదియగునాఁడగు వినాయక చతుర్థినిం బూర్వాహ్ణం

బున నరదంబు మీఁదను నగ్గజవదనునకు నుత్సవంబు ప్రవర్తిల్లెడు. దారు నిర్మితంబు లయి వర్ణలిప్తంబులగు నవ్వాహనంబులు మిగుల జిన్నవి. చిత్రపటంబుల నలంకృతం బయిన యా రథంబు పెచ్చుకొనఁగ నాలుగేను పువుల తనర్పఁగలదు. ఆ దశ రాత్రంబద్దేవుని దేవళంబున నాటపాటలతోడం జదువు చేయంబడె. అచ్చటం జదువున నాశిన వారకామినులు కోయంబుత్తూరినుండి వచ్చి యక్కొండమీఁదం గాపురము చేయుచున్నారు. ఆటపాటలన బొబ్బటులు నేఁపులేరు గాని కొందరు సుందరాంగులు గలరు.

అచ్చటి నాశ్వయుజ శుద్ధనవమి నాయుధపూజ ప్రవర్తిల్లె. నానాదేశంబులనుండి వచ్చి యచ్చట వసించువారు తత్పూజార్థంబు వేఁటలం గావులిచ్చి వివిధ ఫలాపూప ప్రముఖంబులగు నైవేద్యంబులతో నస్మత్పుస్తకంబుల నాయుధంబుల సన్నిధినిడి పూజానంతరం బాశిరంబులనచ్చోటన గంపలం గ్రమ్మియుంచి మఱునాఁడు ప్రొద్దున నాతలలం జాకికి నిచ్చెదరు. పూజాదినంబు నంద యవ్వేఁటల వండి భక్షించెదరు.

కవుడాల్ జిల్లా జిల్లాజడ్జిగానుండు ఫ్రాన్సిస్ లాస్సెలస్ అను దొర కొమారుఁడు వేయినెనమన్నూట నలుబదియాఱవ సంవత్సర మక్టోబరు నెలలో నుదకమండలంబునం గ్రొత్తగా బాంక్ యనంబడు నొక కొఠీని బ్రతిష్ఠించెను. అందుఁ బ్రజలకు యథాయోగ్యముగా వస్తువుల నుంచికొని కాని, యప్పుపత్రములు వ్రాయించికొని కాని, వడ్డి కిచ్చునట్లును గోరికగలవారు నిక్షేపింపఁ గోరిన ద్రవ్యము పుచ్చుకొనునట్లును నిబంధనలు నిర్ణీతంబులయి యున్నయవి. ఈ దొర తత్పూర్వం బా పర్వతంబు మీఁదనే కొన్ని వత్సరంబులుగాఁ గాఫీ మొదలయిన పయిరులు వెట్టికొనియుండె.

చెన్నపురంబున నెంగిలీషు జ్యోతిష్కుఁడయిన జి. టి. టెయిలరను దొర నేనక్కడనుండఁగా నక్కొండకు వచ్చి యధస్థంబగు నితరభూతలంబుకంటె నచ్చర్యతంబు పయింగల వానగాలి వేండ్రంబుల కొలంది నెఱింగికొనుటకు సాధనంబయిన "యబ్జర్వేటోరీ" యనునొక పరీక్షాశాల నక్కడ నొక్క పొడుగు మలమీఁదఁ గంపెని వారిచే ననుజ్ఞాతుండయి ప్రతిష్ఠించె.

ఉదకమండలంబున సంతగూడుచోటం బదార్థము లమ్మువారికి విలుచువారికి వర్షశీతబాధ కరంబు గలుగుటంజేసి యెనిమిదివేల రూపాయలలో నొక్క పణ్య వీథిక గట్టింప దివాణమువారు యత్నించియుండిరి.

అమ్మల యందించు బించుకఁ ద్రిశతోత్తర పంచాశత్సహస్రరూప్యంబుల వరవు కంపెని వారికిం బ్రతి సంవత్సరంబు గలిగియున్నది. దాని వివరంబె నెఱింగికొన్న తెఱంగున నొకట వ్రాసెద.

| | రూ. |
|---|---|
| సస్యంబుల వలనం బన్నెండు వేలు ... | 12,000 |
| అంచెల చావడివలనం బదిరెండు వేలు ... | 12,000 |
| సారాయి గుత్త వలనం బదియారువేల మున్నూరు | 16,300 |
| ఇంటి పన్ను వలన నాలుగు వేలు ... | 4,000 |
| పేకు మాదుల గుత్తవలనను న్యాయ విచారణ కర్తలు ప్రజలవలనం దీయు దండుగవలన నాఱు వేలు. | 6,000 |
| అంతు రూపాయలు | 50,300 |

లేకు ప్రామాఁకు లా కుధరంబుపయి లేవు. కొండనుండి మహాహారమునకుఁ బోవు త్రోవలోఁ గొండక్రిందఁ గొంత దవ్వుననున్న సేగూరను కాంతారంబున నమ్మిహీరు హుఁబులు తోరంబుగఁ గలవు. తత్ప్రదేశంబా ప్రశైలంబునం జేరియుండుటఁ జేసి యాలెక్క యిందులోఁ గలసియున్నయది.

సారాయి గుత్తకాండ్లు బత్తాయి యనంబడు సారాయి యమ్మునట్లు కోయం బుత్తూరి కలెక్టరునకు నొడంబడిక యిచ్చెదరఁట. అట్లుండియు నయ్యేఁటు నగ్గుత్త కొత్తిన యతండు బత్తాయి యమ్మక పట్టి సారాయి విక్రయించుచుండెను. సారాయి గుత్త యొత్తు నతండ బ్రాండి, జిన్, రమ్ అనంబడు సారాయి దినుసులమ్ము వాడుక గలిగి యుండుటంజేసి షాపులలో సివిల్, మిలిటెరి యుద్యోగస్థులకుం దక్కఁ దక్కిన యెవ్వరికి నీ మూఁడు విధంబుల మద్యంబుల విక్రయింపరు. వయిన్ మొదలగు వివిధమద్యంబులెల్ల నెల్లరకు నమ్మెదరు.

ఎల్లరకుం జెల్లఁబగు నక్కొండచలి మున్న వినియున్న యే నుదకమండలంబు దఱియ తఱి నాకుం జలియింతయుం గలుగమి యెంతయు వింతయయియుండె. నావిడి దలయగు నిలువొచ్చిన యనంతరంబు యెచ్చటం గూర్చుండిన నెచ్చటిం గ్రుమ్మరిన నెద్ది యంటిన నాసర్వం బతి శీతలంబయి గోచరించె. అంతం గొంతదడవునకె చలిమొలకెంచె. మార్గశ్రమంబున స్వేదదల ప్రవేశించు సమకాలంబునన శీతలంబు గోచరింపదయ్యె నని తోఁచెను. మరునాఁడె నాకును నా బాసట యయివచ్చిన శ్రీనివాస మొదలారికిని స్వదేశంబుననుండి కొంపోయిన చలి తొడుగు లొడల్లందొడిగి కొనవలసివచ్చె. అచ్చటి నన్నెయొకండు దక్క నెల్లపదార్థంబులు నతి శీతలంబులయి యున్నయవి. కొన్ని పదార్థంబులు మంచు గడ్డల బోలి శీతంబుచే దుస్స్పర్శంబు యి యున్నయవి. టెంకాయ నూనియ నేతి తెఱంగునం బేరుచున్నది. వార్చినతోడన పులియ యందు పిడ్డించికొనిన యన్నంబు కొంత ఘృతవ్యంజనాదులతోడ మొదల భుజించి యెడగలుగ ద్రోచియుంచిన యవశిష్టాన్నంబు భుజింపఁబోయిన నొకానొకప్పుడు పర్యుషితకల్పంబయి కానంబడి యెడు ఘటియు నచ్చట చలి రేవగళ్ళ బహువు హుహూకారంబుల బుట్టించుచున్నది. జంటయిజారులును జంటయొచట్టలును జెవులుమూయఁగుళ్ళాయులునుం దొడిగికొని కుళ్ళాయుల మీఁదం జవుకపు గుడ్డలనుజుట్టికొని "స్టాకింగ్సు" అనంబడు కాలితొడుగులును గ్లోవ్సు అనంబడు చేతొడుగులు దొడిగికొని శీతబాధ కొంత యీఁగితిమి. వీనిలో లోపలఁ దొడిగికొనిన యొక్క యిజారును నొక్క యరచొక్కాయుం దక్కఁదక్కినవి యెల్ల వెచ్చందనంబుఁ బుట్టించు పశురోమ నిర్మితంబులు. రేల నిట్టితొడుగులపయి గొప్పకంబళ్ళు కప్పికొని కాళ్ళుం జేతులు ముడిఁచికొని యుదరంబున నురంబున నడఁచికొని పరుండినంగాని యొడలు వడవడ వడంకెడు. కప్పికొను కంబళ్ళు విడిచి కడమ యుడుపుల పయి నల్ల సెకలాతు నిడివి చొక్కాయులు తొడిగికొని పవల్ల నెండ కాయునప్పుడు బయలం బోవుచో వాయు విసుమంత విసరెనేని మిగులఁ జలిగలుగుచున్నయది. వాతంబు వీతెంచు నతి సీడనున్న పదార్థంబులు మాత్రంబుగాదు సూర్యరశ్మి నున్న మూది వస్త్రంబులును జల్లఁదనంబు నొందెడు. ఆతపంబున నున్న వారికయిన నుపరి ప్రదేశంబున మేఘంబు గానంబడు తఱి చలి మిక్కుటంబుగం గలిగెడు. కంబళొడకంబులును మేనం దాల్చియుండు దనుక వెచ్చందనంబుగలిగియుండెడు. కొండొకదరి యూడ్చియుంచి మరలం దొడిగికొనినం గొంత దడవయ్యేవి చల్లఁబడియుండెడు. ఆహారానంతరంబు హస్తోదకంబులఁ బ్రక్షాళించిన కరంబులం దడియొత్తు పొంతె మూది గుడ్డ నంటిన దాని శైత్యంబు బూర్ణాకృత వసనాచ్ఛాదనంబు గలిగియు మేనెల్లం గరువార్చెడు. అభ్యంగ

క్షౌర సమయమ్ముల నిప్పులు నిండిన యాగికంబు లిరువంకలనుండినం జలివలనం బడు పాటులు నుడువంగొలందిగాదు. కాలితొడుగులు చలికతంబున నెల్లకాలంబు మానమిం జేసి వర్ణించిన రెండుతెఱఁగులు దిక్కు నొందు తఱి పదంబు లుదకంబులం దొట్టి యుండుంగవు. మఱియు నీ శీతంబున కొన్ని నిత్యకృత్యంబులు సక్కఁగ సలుప నొక్కనాఁడేని శక్యంబుగాదయ్యె.

అక్కడ నింగిలీషు దొరల యిరవులలో నఱయఱయందు వంటచెఱుకుల మంట సేయ ననువుగ గోడలయం దినుపచట్రంబులతోఁ బ్రోయిలు నిర్మింపంబడి యున్నయవి. అప్పాగ పాకశాలలోగ గూఁడులు బ్రోయిలనుండియు గోడలలో నేర్పడి యున్నయవి. అయ్యధిశ్రయణులెల్లప్పుడు నిర్భరాంగార జ్వాలంబులవుట నయ్యపవరకంబు లుష్ణంబు లయి యుండినను వారు సారెకు నయ్యంతికాంతికంబునం జేరి చలి గ్రాచికొనియెదరు. అట్టి బ్రోయిలు లేమిం జేసి మనవారు వలసినప్పుడు చిచ్చు రగులుకొలిపి హసంతిక లంతికంబున నుంచికొనియెదరు.

ఆ మండలంబున సోమరితనంబును శారీర వాతప్రకోపజన్యంబగు రుజయును గలుగుటలేదు. జాఠరాగ్ని శక్తి హెచ్చుగం గలదు. గొఱియ యెఱచి బంగాళా దుంపలు ముద్గసూపంబు దధిఘృత క్షీరంబులు లోనగు సారవత్పదార్థంబులు ముప్పూటలం దోరంబుగ భుజింపకుండిన మేనికి నొప్పమి గలుగు. శైత్యంబు సౌష్ణ్యంబును బాదలించు బండ్రంబులు శరీర ప్రకృత్యనురూపంబుగ మితంబుగం బుచ్చుకొనవలయుఁ గాని విచ్చలవిడిం బుచ్చుకొనినం జలువబండము వలన శీతజ్వరంబును, గాఁక బండము వలన రక్తవిరేచనంబును దగ్గును నియతంబుగఁ గలిగెడు. దధిఘృతంబులు కొఱవడ కుండఁ జేర్చికొనుచు వారమునకు రెండుమారులు దప్పక యభ్యంగం బొనరించుచు జాము ప్రొద్దెక్కునంతలోనన కుడుచుచు నుండిన నారోగ్యంబునకు నెట్టి కొఱంతయుం గలుగదు. అభ్యంగంబును బ్రాతర్భోజనఁబును గాలంబు దప్పక యొనరింప నాకు నాతోడివారలకు శీతాధిక్యంబుచే ననుకూలింపవయ్యె. ఆ ప్రదేశము యూరోపుద్దేశస్థులకు మాత్రము మిక్కిలి సుఖావహంబై యున్నయది. వారలా ధరంబు పయినెట్టి సీతున నేనిఁ బ్రాతస్సాయంబులం జెన్నపురంబునం బోలె సవారివోయెదరు. మాదృశుల కట్టి తఱి బయలు వో శక్యంబుగాదు. అచ్చో నింగిలీషువారు చెన్నపురంబునం దాల్చువానికంటె ముదుగులగు పశురోమ నిర్మిత వస్త్రంబులు ధరించెదరు. యూరోపుద్దేశంబువలె నుదక మండలంబు కరంబు శీతలంబగుటం జేసి యింగిలీషువారికి మిగులం బ్రమోదావహంబై యుండు. కొన్ని సంవత్సరంబులనుండి వసించు మనవారికి నచ్చోటు కొంత యొమ్మిక పడి యున్నట్లు కానంబడియెడు. మఱియు నాచోటు కలవారికి మిగుల సౌఖ్యకారియు గాని లేనివారికింగాదు.

అచ్చట నుష్ణోదకంబేని శీతోదకంబేని యొక్కండ పిపాసకయి పుచ్చికొన నలవరింప వలయుఁగాని యవ్యవస్థితముగాఁ బుచ్చికొనినం గడుపున బల్ల పుట్టుచున్నదనియు నుష్ణోదకంబుకంటె శీతోదకంబు జీర్ణశక్తియు నారోగ్యంబును బుట్టించుచున్నదనియుం బూర్వంబ తెలియఁబడుటం జేసి శీతోదకంబె పుచ్చుకొనుచుండితి. దాన ప్రకృతార్థంబు దృష్టంబయియుండె. తొలుతం గొన్ని దినంబులవరకుఁ జల్లనీరు పుచ్చుకొనుచో దంతంబు లెల్ల జిలజిల మనుచుండె. అమ్మండలంబున నీరువట్టు పుట్టుటలేదు. భోజనానంత రంబు బలిమింగొంత పుచ్చికొనవలసియున్నయది. విసనకఱ్ఱ లెగ్గిందరి కొల్పన కాని యెప్పుడు మనుజులకు శ్రమాపనోదనార్థంబుపయోగింపవు. అందుఁగాఁమినులకుఁ గామం బెక్కువ యనియుఁ బురుషులకుఁ దక్కువయనియు వచించెదరు. ఉదక మండలంబునందలి వాయు వర్ష శీత లక్షణంబులు నే నచ్చట వసించిన యాఱు నెలల యిరువది

నాలుగు దినంబులదనుక నా యనుభవంబునకు గోచరించిన యంత వట్టు వివరించెద. నే నచ్చటఁ జేరిన మరునాఁడు జూను నాలవ తేది మొదలుకొని పదుమూఁడు దినంబులు దినమెడయక కొంచెముగ బశ్చిమ వర్షంబు వర్షించుచుండె. పిదప నాలుగునాళ్లెండ గాయుచుండె. ఆ నెల యిరువదిమూఁడవ తేది మొదలుకొని యెనిమిది దినంబులు నిరవకాశంబుగ నాకాశంబునం దెల్లెడ వలాహకంబులు గ్రమ్ముకొని పశ్చిమ మారుత ప్రేరితంబులయి వర్షించుచుండె. ఇవ్వాన నలి తుషారమై యుండెఁగాని గొప్ప చినుకులుగ నొకప్పుడేనిఁ గలుగదయ్యె. గాలిమాత్రంబధికంబుగ వర్షావసర సముద్ర ఘోషంబు ననుకరించు ఘోషంబుతో వీచుచుండె. మానవుల యనావృతాంగంబులం జెమ్మటంబోలెఁ జెమ్మ బొడమించుచుండె. సాయం సంధ్య మొదలుకొని ప్రాత స్సంధ్య దనుక నవ్వాతంబు పెచ్చు పెరిగి వీచుచుండె. ఆవ్వాతంబు శీతంబు మహిమంబు తరంబు నాకు వక్కాణింపంగాదు. మా విడిపట్టు మా యేలిక విడిపట్టునకు హెచ్చుకుండుగ మున్నూబుబారల దూరంబున నున్నయది. అయ్యెడనుండి సాయంకాలమున నిజగృహంబునకు వచ్చుతఱి నా శీతవాతహతి చేఁ గలుగు కంపంబు గృహంబుచేరిన యనంతరంబు కతిపయ క్షణంబుల దనుక నెలకొనియుండు. ఈ దినంబులలో నొకానొక తఱి వాన వెలసి యుండెఁగాని గాలి యెడతెగక వీచుచుండె. పదంపడి గొప్ప చినుకుల వాన పది దినంబులు గురిసె. అందునెడనెడ నుఱుములు మెఱుపులు గలిగి వాన బలిసి కురిసె. వర్షించు కాలంబు దక్కం దక్కఁగలతఱి యనుదినంబు నెండ మెండుగఁ గాయుచుండె. అప్పది దినంబులును వీతెంచిన తూరుపుగాలి చరమదిశావాతం బట్లు ప్రభూత శీతంబు గాక యుండె. పెండియు జూలై పది రెండవ తేదీ దొరఁకొని ముప్పదవ తేది వఱకుఁ బడమటి గాడ్పును బొడి చినుకులును మునుపటి తెఱంగున తలకొని యుండె. ఆ దినంబులకు మంచి యెండ యరుదయ్యె.

ముప్పదొకండవ తేది యెండయు గాలియు మెండుకొనియుండె. *నాఁడాడి నెల పది యెనిమిదవ తేది. ప్రతి వత్సరం బాదినంబు కావేరీ మహానది తప్పక పూర్ణంబుగఁ బ్రవహించెడినఁట. అది "పదనెట్టాం పెఱుక్కు" అని యఱవలు వాడెదరు. అనఁగాఁ బదునెనిమిదవ తేదీ వచ్చు వెల్లువ యని యభిప్రాయంబు. దానిఁ బదునెనిమిదవ పండుగ యని యచ్చటి తెనుఁగువారు వలికెదరు. నీలగిరి యందుఁ దత్పశ్చిమ దేశంబునందుఁ గటకమాసంబునం దోరంబుగఁ గురియు వారిపూరంబు కావేరిం జేరుటం జేసి యా మాసంబునఁ గొన్ని వాసరంబుల దనుక నెడయక యయ్యేటం బెల్లు వెల్లువలు వచ్చుచున్నయవి. అందుఁ బదునెనిమిదవ తేది వచ్చు వెల్లువ గడుబలియదిగాఁగొనియాడఁ బడుచున్నయద్దిగాని యవ్వలి దినంబులను వఱదలు వచ్చుచున్నవి. ఆ యేటి మేర నుండి యే మేర వరకు నేయే యూరులం జుట్టుకొని పాఱుచున్నదో యాయా యూరులనుండు వారలు నాఁడయ్యేటికి నేతెంచి అందు మజ్జనంబులొనరించి యద్దరం బసుపు ముద్దను గావేరిగాభావించి యుంచి దానికిఁ జందన పుష్ప ధూపదీపాదులతో భక్తియుక్తంబుగఁ బూజనంబులాచరించి చెవియాకులు క్రొత్తకోకలు క్రొత్తరవికలు క్రొత్త చేటలు నల్లపూసలు బంగరు తాళిబొట్టులు టెంకాయలు కుంకుమము మఱియుం గొన్నితదుచిత పదార్థంబులును దమ తమ శక్తి కొలఁది నన్నదిలో విడిచి యింట్లకరిగి యిలువేల్పులను మృతచిరంటులను నట్టింట్లం బూజించి మ్రొక్కు సంప్రదాయంబు. అట్లు గావున వివిధ విషయంబులనుండి యయ్యుదకమండలంబున వచ్చియున్న మనవారలా వారంబున నచ్చటి తటాకంబును గావేరిగా భావించి యిప్పుడు చెప్పిన చొప్పున మెప్పగు పూజలు జరిపిరి.

---

* ఆడి యనఁగాఁ గటకమాసము.

అమ్మండలంబునం బ్రభూతశీతంబునకు హేతుభూతంబగు ప్రతీచీన వాతంబును, దిరోహిత రవిబింబంబగు నంబుద కదంబంబును నిరంతరతనుతర ధారాన్వితంబగు వర్ష పాతంబును బూర్వాఖ్యాతంబైన కటకమాసంబునందలి యష్టాదశవాసరంబున కనంతరంబు శాంతంబులగు నని యచ్చటివారు వాడుకొను పద్ధతిని నమ్మకముగను నానాటికిం దక్కువగుచువచ్చె. కొంచెము వానయుం గొంచెము గాలియు గలిగి కొన్ని దినంబులును, గాలివాని యొకానొకవేళం దూరయుం గడుమబ్బుల నీడయుం గలిగి కొన్ని దివసంబులును, రేపకడ మొదలుకొని పట్టపగలు దనుక మెండగు నెండయుం బిసాళ జలదంబులు గప్పిన యంబరవీథియుం గలిగి కొన్ని వాసరంబులును గడచె. సెప్టెంబరు నెల యంతయుం బ్రత్యహంబు ప్రకాశంబును బ్రతిదివసంబు శర్వరీశ ప్రముఖ గ్రహ తారకా ప్రకాశంబును గలిగియుండె. చలి నట్టుగ కడమటి బిట్టు చలిపట్టు మట్టమయ్యె. వానయు నొకానొక దినంబునంగాని మునుపటి తెరంగున గలుగదయ్యె. కావునం దత్పూర్వంబు గాళ్లు చేతులు ముడిచికొని యుదరంబు నురంబునంజేర్చి యడంచికొని పరుండియుండిన పాటుపాటియు లేక యత్తఱి యుచ్చవచ్చిన పదువునం గాలుసేతు లాచ్చికొని పరుండంగలిగెం గాని ముందు నుడివిన కడుపునం గల తొడుగులలో నొకండేని నుడుగ నొకప్పుడు ననుకూలింపదయ్యె. అక్టోబరు నెలలో రెండియు నిరువది రెండు దినంబులు తూర్పు వర్షంబు ప్రబలంబుగం గురియుచుండె; వృష్టిలేని దివసంబున నెండ వేంద్రంబుగ నుండె. తరువాతం గొన్ని వాసరంబు లాసారంబు నిలిచియుండెంగాని యంబరంబంబుదాకీర్ణంబయి యుండె. అన్నెలతో నగ్గిరిని వాన తఱి సరిపోయె.

అవ్వల నాలుగేను దివసంబు లాసిశాంతంబులు నిశాకాలంబులం గొంచెముగ మంచు గురిసె; నచ్చట వది నీరుమంచని వ్యవహరించెదరు. నవంబరు నెల వఱకు నామంచు గురియుచుండి డిసంబరు మొదలు మిక్కుటంబుగం గురిసెడి దీని గండు మంచని వాడికొని యెదరు. నవంబరు మాసంబంబరంబున నీరదంబులు తోరంబుగం దిరుగుటంజేసి యా నీరు మంచు గురియదయ్యె. అమ్మాసాంతంబున గండుమంచు మూడు రాత్రులు గురిసె. మఱియును డిసంబరు మాసంబున నభోమండలం బంభోవాహంబులచేం బొరింబొరిం దిరోహితంబయి యుండుటంజేసి యా గండు మంచును నిలచియుండి యన్నెల తుదను రెండు దినంబులు మరలం గలిగియుండె.

ఆపర్వతంబున మేషసంక్రమణం బాదిగ నేడుమాసంబులు వానకాలంబు. తదుత్తర మాస చతుష్టయంబు హిమసమయంబు. తక్కిన యొక్కండు వర్షంబుగాని మంచుగాని కలిగియుండు. కాని యాతపంబునకుం గాల నియమంబు లేదు. అమ్మం డలంబున వానతఱిం దూరుపు కరువలి వీతెంచుచో మెఱుములుఱుములు గొప్పధారలుం గల వానలు ప్రబలంబుగ గురియుచున్నవి. వాన లేని యత్తఱి యెండ తీవ్రంబయి యున్నయది. చలి మిగులం గలదు. పశ్చిమవాతంబు వీతెంచుచో సన్నంపుం జినుకులె చినికెడు. మెఱుముఱుములు మంచియెండయుం గలుగవు. చలి మిగులం గలదు. ఈ సమయంబున నమ్మండలంబు నందలి స్వాభావికంబగు శైత్యగుణంబు వర్ధిల్లెడు. దక్షిణోత్తర వాతంబు లచ్చటం దఱుచుగ వీతెంచుటు గానము. నే నచ్చటం జేరినదినము మొదలుకొని యాగష్టు తుదవఱకు జలధరరహితంబయిన దివసం బొక్క దివసంబేని లేదయ్యె.

నవంబరు డిసంబరు నెలల కడపటులం గొన్నిరేలం గండుమంచు గురిసెనని తెలుపం బలికితిని. ఆకాలంబులలో ఘస్రంబుల నిరువదియాఱు

గడియల ప్రొద్దు దొరఁకొని ప్రొద్దువాడిచిన గడియ దనుకం గలిగిన శీతంబు పశ్చిమ వాతంబు వీతెంచుతఱి గలిగినదానికంటె వెగ్గలంబయియుండె. అమ్మంచుచేఁ బుష్పలచెట్లు సొరుగాకులగుచుండె. అత్తఱి వెచ్చం దనంబు పెచ్చుగం గలిగించు కంబళ్లు నతిశీతంబులయియుండె. ఒకప్పుడు వఱువాత శీతోదకంబు లక్కఱపాటునం జేసి చేతులం దగిలినప్పుడు గలిగిన చలిమిరితనంబిప్పుడు తలంపునం బాఱిన మేను గరుపాఱెడు. ఆ శీతంబుకతనం దేలు మీటిన యట్లు సందిలి యంత పట్టు నరంబులెల్లం గొన్ని క్షణంబుల వఱకు విరవిరంబాఱుచుండె. వివిధ జనపదంబులనుండి వచ్చియచ్చోఁ బెద్దకాలంబుగఁ గాఁపురంబుండు పడఁతులమ్మంచు దినంబుల నించుకేనిం గొంకువోక తటాకంబునకేగి కాల్యకరణీయంబులు దీర్చికొని భాండంబులం గాండంబులు నించికొని యేతెంచుచున్నవారు. అచ్చటికిం గ్రొత్త కాఁపులగు నాబోఁటి వారలకు మాత్రంబు శీతల పానీయంబు దుస్పర్శంబయి యున్నయది. శీతాతపాదికం బభ్యాస పాటవంబునంజేసి సుసహంబయి యుండునను నర్థంబిందువలన విశదంబయ్యె. అట్టి తుహినంబు ఘనంబయి నానాటం గురియు నప్పటి పాటులు నాబోఁటి వింతవారికి నేపాటియు సహ్యంబులు గావు. అట్టి గండు మంచు తఱి నగ్గిరి నే ననేక దినంబులుండక స్వదేశాభిముఖుండనగుటంజేసి నాకననుభూతాంశంబగు తత్ప్రాలేయ గుణంబు తత్రత్యుల వలన నెఱింగికొనిన కొలంది వక్కాణించెద.

ఆ గండుమంచు ప్రతిదినంబు పంచవింశ ఘటికం దొరఁకొని యపరదివసంబు పంచమ ఘటికంబు గురియుచుండు. అట్లు గురియుతఱిగల చలి పలుకం దలంబుగాదు. తక్కఁగల తఱి మిక్కుటపు వేంద్రంబున నెండగాయుచుండు. మంచుగురియు గడియలలో నున్నితొడుగులెన్ని యేనిం దొడిగికొని బాహిరంబుగానక గర్భాగారంబులనున్న వారలకేని వదనంబులును రదనచ్ఛదనంబులుం జిటులుచుండు. దాని మానుపవేడి యింగిలీషువారు కోల్డుక్రీమ్ అని పేర్కొనంబడిన నవనీత కృతౌషధంబు ప్రాతస్సాయంబుల నాననాధరంబునకుఁ బూసికొనియెదరు. ఆయ్యౌషధంబచ్చట వైద్యశాల యందుఁగలదు. అయ్యది దొరకని పక్షంబున వెన్నమాత్రంబయిన జరిమికొనవలయు. కరచరణంబులకుఁ దొడిగికొను తొడుగు లెడతెగక యినుమడిగఁ దొడిగికొనవలయుం; దొడుగకున్నం గరచరణంబులు సయితము చిటులుచుండు. అంతియకాదు. అనావృతాంగంబులెల్ల నమ్మంచుగడియలం జిటులుచుండు. గావున ననావృతాంగులయి యెవ్వరు నుండరు. చిటిలిన చోటుల నయ్యౌషధంబుఁ బూయ నది నివర్తించెడు. ఆకాలంబున మంచు గడ్డకట్టుటయె కాక రాత్రుల వెలినుంచిన పాత్రంబుల నీరంబును గడ్డగట్టుచుండు. అగ్ని యంటినం గొంత యోరువవచ్చుఁగాని యమ్మంచుగడ్డలంటిన నోరువందరంబుగాదు. అత్తఱి బచ్చికయుం బర్ణంబులుం బ్రసూనంబులును మఱియు నయ్యెడం బయిరగు సకల పదార్థంబులును శోషిలి సొరుగులయ్యెడు. వేఁకియు నెత్తురుబంకయుం బ్రజలకు దఱచుగాఁ గలిగెడు. పూఁటు పూఁటకుం బాలు పెరుగు నేతులు నేమఱక కరముపయోగింపవలయుం గాని పసులత్తఱిం బాఁడిం గొఱవడుటంజేసి వలయునంత దుగ్ధాధికంబు దుర్లభంబు. మంచు పడుటవలనం జిబికియున్న పూఁదియిండులు పవళ్లనొక్కొక్క సమయంబున నిప్పు దగిలి రగులుకొనుచుండు. ఇట్టి యుపప్లవంబులకు మూలంబగునది యగ్గండు మంచు తఱియ కాఁ గానంబడియెడు. ఎల్లప్పుడు నమ్మండలంబున వసింపగోరు నెంగిలీషువారిలోపల. బెక్కండ్రక్కాలంబున నక్కడనుండ నోపక యక్కొండమీఁదికే త్తి కోత్తగిరి కుణ్ణూరులకేగి వసింతురు. నలు మాసంబుల దనుక నా హిమాని మానదు. పిదప

వాన దొరఁకొనుటంజేసి యుద్భిదంబులెల్లం బల్లవితంబులయ్యెడు. ప్రభూత శీతకారణంబగు వారుణ దిశా సమీరణంబును దనుతర ధారాస్వీతంబగు వర్షపాతంబును నతిప్రచారంబగు తుషారంబును నుదకమండలంబునకుఁ బశ్చిమంబునందక్కఁ దక్కఁగల దిక్కుల మూఁడు కోసుల కావల నింత బహుళంబుగాఁ గలుగవు. పశ్చిమంబున మఱియుఁ దోరంబుగ నుండు. ఇటు మును చెప్పిన శీతవాతవర్షతుషారంబు లిరువదియేఁడులకు మునుపు గలిగిన వానియందు దశమాంశంబును గావఁటు. తత్కారణంబు నాకు గోచరింపదయ్యె. తోరంబుగాఁ గురియు నీహారంబు తేమచే మిగుల సమృద్ధంబులుగాక ఫల దళ పుష్పాదులు శుష్కంబులయి పోరుగులగుటకుఁ గారణంబు నాకుం దోచినయది కొండొకవక్కాణించెద. సామాన్యంబుగ నెల్లపదార్థంబులు వానందడియక యెండిన యెండినఁ గొండొక కాలంబుదాఁక నిస్సారంబులు గాక యుండుటయు, నెండ నెండక వానందడియక యుండిన వేడియుఁ గొండొక కాలంబు దనుక నునికియు నుదకాతపసమపేతంబులగు వాతంబుల సంస్పర్శనంబున నుండిన మఱికొంత కాలంబువఱకు నుండుటయుఁ దోయదోద్భూతానీతంబులు గాని మారుతంబులనుండిఁ బెద్దకాలంబుంటయు నొక్కింత యేసఁబడన ప్రవేశంబు లేని ప్రదేశంబునఁ బదిలపఱిచిన నిరంతరంబు సారవంతంబులై యుండుటయు, మఱియు నెట్టిపాత్రయందేని నుంచిన విమలంబులగు సలిలంబులు వాయు సంయోగంబునఁ గొన్నిదినంబులకే మురిగి పురుగులగుటయు, నట్టి జలంబులు బుడ్లలో నినిచి మారుతంబు దూఱనీక మూతలు బిరడలచేతఁ బంధించినఁ బెక్కుదినంబుల దనుకఁజెడక యుంటయుఁ గతిపయ దివసంబులకే మురుగుడు వోయెడు జంతు కళేబరంబులు తైలపూరితంబులైనఁ గొంతకాలంబు దనుక ధృతులఁబడిన బహుకాలంబు దనుక మురుగుడు వోకయుంటయు ననుభూతంబులయి యున్నయవి. వస్తుసంతానంబు వానందోఁగుచు నెండ నెండుచునుండినఁ దొల్లింటి యునికికంటె సత్వరంబుగఁ జెవచెడి పోవుచుండెడు. ఎట్లనిన సర్వంబు నణుసమ్మిళిత రూపంబగుటంజేసి రంధ్రసహితంబయి యుండెడు. మఱియు దత్తత్పదార్థంబునకు ననురూపంబుగ దత్తత్పదార్థ సంభూతంబగు త్వక్కు బహు పదార్థంబులం గప్పికొనియుండునట్లు గానంబడియెడు. ఆ త్వక్కునంగల రంధ్రంబు లంతర్గత పదార్థంబునంగల వానికంటెఁ దనుతరంబులయి యుండెడు. ఎండ నుండునప్పుడు పదార్థాంతర్గతరసంబు లెగసిపోవుటకుఁ గారణం బాష్పంబు గావునఁ జర్మంబునంగల రంధ్రంబులకుందగిన కొలఁది నెగసిపోవుచుండెడు. అల్పముఖంబగు నొక్క కడవయందును విస్తృత వక్త్రంబగు నొక్క పళ్లరంబునందును నీళ్లు * సమాన పరిమాణంబుగా నించి సమకాలంబన యొక్కెడనుంచి యెండవలన నెగయు జలప్రమాణంబు పరీక్షించు నెడ ముఖవైశాల్యంబునకుఁదగిన కొలఁదిని యెగసి పోవుటయ తెలియంబడియెఁ గాని యారెంటింగల జలంబు డిఁదుట సమంబుగఁ గానంబడదయ్యె. అట్లుగాన వానఁ దోఁగునప్పుడప్పు లణురూపంబులగ దూఱుచు బహిర్గతంబగు త్వక్కునకంతర్గత పదార్థంబుంబోలె మృదువుగావించుటంజేసి యా చర్మసుషిరంబులు నానాఁట విస్తృతంబు లగుచుండునని యూహింపఁబడియె. ఇట్లు దోఁగి పై రంధ్రంబులు విస్తృతంబులయిన వస్తువు లెండ నెండుచో నా స్థూల రంధ్రంబులవలనఁ దత్సారంబులు దొల్లింటికంటె

* నెలయు నెఱిఁగికొను కొఱకు సమాన పరిణామంబుగానని నుడువంబడియెఁ గాని యొద్దాన నేని యెంతయేని నీరంబు నించి యుంచిన నెగయునీరు నోరువిరివి కొలఁది నెగసిపోవుచున్నది. బెత్తెఁడు వ్యాసంబగు నోరుగల కలశంబెంత గొప్పదియైనను దాన నించిన తోయంబును మూఁడు బెత్తల వ్యాసంబగు నోరుగల తట్టయెంత చిన్నదియైనను దాననినిచిన సలిలంబును నెగసిపోవుకొలఁది యెట్టులనిన బెత్తెఁడు వ్యాసముగల దానికిఁ

తక్కువగ గ్రక్కున నెగసిపోవుటం జేసి మిగుల సొరుగులగుచున్నయవి. ఇట్టందం బునన యచ్చట గురియు మించు మంచునం దోఁగి యతిమాత్ర రంధ్రంబులగు పత్రంబులను బ్రసవంబులను బండులను బచ్చికయుం బంటపయిరులును నెండవేఁడిమిఁ దద్రసంబులు బహుళంబుగ వేగంబ యెగసి పోవుటం జేసి నీరసంబులగుచుండెనని యూహింపఁబడియె.

ఉదకమండలంబునకు నలువలంకుల నెంతదనుక శీతవాత వర్షంబులు మిగులం గలిగి యుండు నంత దవ్వులోపల వానలందోఁగిన మానవులు నిక్కువంబుగ మరణంబు నొందెదరు. అద్ధరణీధరంబుమీఁది సంవసథంబులకేఁగు మార్గంబుల లేవడికతనం బలితంపుఁ దొడుగులు లేని జనంబులు నడచుతఱిం దొరఁకొనిన జడిం గడుఁదడిసి చోటులేక వడవడ వడంకుచుఁ గొన్ని క్షణంబులక యొక్కుడు చలువచే నొడలి నాడులెల్లం బిగిసికొనం గొందఱును, వేగవంతంబయి వీచుగాలిచే నూర్పుమరలు కొలుపనేరక కొందల మందుచు మఱి కొందఱును గ్రిందంబడి గ్రమందెదరు. ఇట్లు ప్రతి సంవత్సరం బచ్చట నొక్కరిద్దఱు మరణింతురు. నేనచ్చట వసించిన సంవత్సరంబునకుం దొలియేఁడొక సంతనాఁడు మధ్యాహ్న సమయంబునం దలకొనిన జడికి సంతవారెల్లం జెల్లాచెదరయి తమతమ సరకుల నున్నట్లుడించి వెఱచి పఱచి చెంతనున్న గృహంబులం జొచ్చి ప్రాణంబులు రక్షించుకొనిరి. కొండొక జనులు లోభంబునం దమ సరకుల విడనాడనేరక తోడం గొంపోవఁగడంగి వెనువడవు వానందోఁగినవారగుట సీతునం గొంకుబోయిరి. అంతట నచ్చటి తహసీలుదారుఁడు వారిని మనుష్యులచేఁ దన యధికార స్థలంబునకు మోపించి తెప్పించి తోరంబుగ నంగారంబు ప్రజ్వరిల్లంజేసి వారికి వెచ్చఁబుట్టింపం గొందఱు కాలు సేతులార్చి ప్రకృతిం బొందిరి. కొందఱు కాలధర్మంబు నొందిరి.

కున్నూరి చేరువం బోవుచో వానందోఁగితి మని మును పలికితిని. ఉదకమండలంబుం బోలె నా ప్రదేశంబు శీతలంబు గామింజేసియుం బెనుచలిగాలి లేమింజేసియు మాకు నే యపాయంబుం గలుగదయ్యె.

ఉదకమండలంబు నందలి కొండలయందును నుదకమండలాధిష్ఠితంబగు నధిత్యకకుం గ్రింది సానువులయందును మేఘఖండంబులుచ్చావచంబులుగం బర్వియుండు. మనుష్యులు నడయాడు నెత్తంబునను మేఘంబులు సోరకుం డిగి యాచ్ఛాదించెడు. ఇట్లావరించియున్నచోఁ గొన్నికాలంబుల నందు దూఱినాకుంబోవలసె. అయ్యది యావిరియుంబోలె గోచరించెడు. మఱియు నది తాఁకినచో నొడలం గొంచియపు తేమయగుచున్నయది. పర్వతంబుల మీఁద వ్యాపించియుండునప్పుడెల్ల నమ్మొగుళ్లు సాంద్రధూమంబు చందంబునన కరంబు గానంబడుచుండె. ఇట్లు బాష్పమయంబులయి ధూమాకారంబులగు ధారాధరంబులు చేతనంబు లనుటయుం బారావార జలంబులు ద్రావి కురియుననుటయుం దద్గర్భగాఢంబులగు క్షారనీరంబులు మధురంబులగుననుటయుం బ్రత్యక్షవిరుద్ధంబులుగా నుండుటంజేసి పామరప్రవాదంబని యొఱుంగం బడియెడు.

---

బెత్తెఁడు విస్తృతంబును, మూఁడు బెత్తెల వ్యాసంబుగలదానికిఁ దొమ్మిది బెత్తెల విస్తృతంబును ముఖపరిమితి గలిగియుండుఁగాన గుండలోని నీరు తవ్వెఁడు తఱుగు కాలంబునన తట్టలోని వారి తొమ్మిది తవ్వలు తరుగుచుండు. విరివి వ్యాసంబునకు వర్గుళ్ళగావునఁ బాత్రముఖంబు విరివి కొలఁదియ జలం బెగసి పోవుచుండు.

నీలగిరియందున్నతంబగు ప్రదేశంబున సముద్రసమతలంబునకు నెనిమిదివేల యాఱునూట నలువది (8640) యడుగుల పొడవుగలదు. ఆకాశంబు నిరావరణంబుగనుండు తఱి నక్కొండపయింగాయు వేండ్రంబగు నెండ చెన్నపురంబు నందుం బోలె నంత వేండ్రంబుగాకుండునట్లు కానంబడియె. అనంతరము స్వదేశమునకు వచ్చిన వెనుక విచారించి శాస్త్రజ్ఞులవలన దత్కారణంబు కొంత యెఱింగికొనినాఁడ.

నీరు పేర దొరఁకొనుతఱి యౌష్ణ్యంబు (32) ద్వాత్రింశదంశకంబనియు నీరు ప్రాఁగ దొడఁగొనునప్పుడు (212) ద్వాదశోత్తర ద్విశతాంశకంబనియు ననుమితం బయ్యెడుఁగాన గడ్డగట్ట దొరఁకొనుట యాదిగా, నుడుకెత్తుటతుదగా, నౌష్ణ్యంబునకు వర్ధిల్లిన యంశంబులు (180) నూట యెనుబదియయ్యె. ఈక్రమంబున లోహశైల రసాది పదార్థంబులు యథాయోగ్యంబుగ నుష్ణాతిశయంబునం దమ యాదికారణంబులగు పరమాణు రూపంబులగుచు నుష్ణతాసామ్యంబున నీరగుచు నుష్ణతాన్యూనత్వంబున ఘనీభవించుచున్నయవి. పరమాణురూపంబులగునప్పుడు చూపఱకుం దోపక యెగసిపోయెడునని యెఱుంగునది. చెన్నపురంబున నాతపంబునం గలిగిన వేఁడిమి కొలంది కొంత హెచ్చుకుండుగ (120) నూటయిరువది దొరఁకొని (145) నూటనలువదేనవ యంశంబు పరమావధిగా గలిగియుండు. నీలగిరియందున్నతస్థలంబునం గొంత హెచ్చుకుండుగ (100) నూరు మొదలుకొని (125) నూటయిరువదేనవ పాలు పరమావధిగాఁ గలిగియుండు. ఈయర్థంబు "థర్మామీటర్" అనంబడు నుష్ణమాత్రక యంత్రంబు వలనం దెలియంబడుచున్నయది యని పరీక్షకులచేఁ బ్రచురము చేయంబడియున్నయది. కావున నీలగిరియందు సరాసరి నవ్వేఁడిమి (112½) నూటపండ్రెండునరయును జెన్నపురంబున సరాసరి (32½) నూటముప్పదిరెండునర భాగంబునుం గలిగియున్నవి. వీనియందు మొదల జెప్పఁగొనిన (32) ముప్పదిరెండంశంబులు పుచ్చిన నిలువ భాగంబులు నీలగిరియందు (80½) యెనుబదియు నరయుఁ జెన్నపురంబున (100½) నూఱునర భాగంబును గలిగియుండు. ఈకొలంది జూడఁ గొంచెమించుమించుగ నీలగిరికంటెం జెన్నపురియందు నెండవేఁడిమి (1) పాదాధికంబయియున్నయది మఱియు మేఘకక్ష్యకంటెం బొడవుగలిగి వర్షతుషార విరహితంబులగు గిరులెక్కి పరీక్షించిన శాస్త్రజ్ఞులు పోవంబోవ నుప్పరంబున నెండ వేండ్రంబు తరతరంబు కొఱవాటు నొందియున్నది యని గ్రంథంబుల వక్కాణించి యున్నవారు. భూమియందుం బోలెయు నాతపంబునకుంగల వేఁడిమికంటెం బోవంబోవ నూర్ధ్వంబున వేండ్రంబు కొఱవడుటకు నిమిత్తంబు కొండొక వచించెద. భూగోళంబుం బరివేష్టించికొని భూతలంబు దొరఁకొని యెంత పొడవుదనుక నుండు మారుతంబు తాఁకుటం జేసి రవికిరణంబు లుష్ణంబులయ్యెడు. ఆ కిరణంబు లెంతదవ్వు వాతస్పర్శంబు గలుగు నంత కొలంది క్రిందిక్రిందుగ వేండ్రంబు తరతరంబుగం గరంబు గలిగియుండునని శాస్త్రజ్ఞులు వక్కాణించెదరు. జలంబును సున్నంబును స్పృశింపఁదగిన చల్లదనంబునుండియు నారెండునుం గలయు తఱి నస్పృశ్యోష్ణంబుగలిగియుండుట యెల్లరకుం దెల్లంబయియున్నయది. మఱియు గొన్ని పదార్థంబులు సంయోగంబున మిక్కుటంబగు వేఁడిమినొందుచున్నయవిగావునఁ దిగ్మంబులుగాని తరణి కిరణంబులు పవనస్పర్శనంబునం జేసి యుష్ణంబులయ్యెడునఁట. గ్రంథవిస్తరభయంబున నీయర్థంబింతట నుజ్జగింపంబడియె.

చెన్నపురంబునకు నైరృతి దిశనుండు నా నీలశైలంబు విరివియు నిడివియు నింతకు మున్ను నుడివిన తలంబు పొడవుగాక యితర స్థలంబులంగల యౌన్నత్య పరిమాణంబులు నందుఁగల గట్టుగుట్టల సంఖ్యా ప్రమాణంబులు నెఱయ నెఱింగికొను కొఱకు దివాణము

వారు ఎంజనీర్సు అనంబడు యంత్రవేదులచే గొన్నియేండ్లుగా గొలిపించుచుండియు నే నక్కడనుండు కాలంబు దనుక నిండదయ్యె. ఇట్టి ఘనతగను మున్ను తెలియంజేసిన వివిధకార్యాతిశయంబులకు నాకరంబునగు నా నీల మహీధరంబునందు వాయుమండలోన్నతి కొలమితికి జూచ్చుకుందుకు ముప్పదియవ యంశంబునందు నుండు మండలంబున వేయునెనమన్నూట నలువదియారవ సంవత్సరంబున జూను నెల 3 వ తేది దొడంగొని డిసంబరు నెల యిరువదియారవ తేది దనుక బంధుమిత్ర సహవాసుల నెడబాసిన గాసితో వాసంబు నేసినాడ.

### అకారవినోష్ఠ్య కందము.

క. సనకసనందన సంక్రం
దనశంకర శరణచరణ ! నతజనచయరం
జన ! కంజనయన ! ఘనకాయ
తనయహర ! దశరథ తనయ ! దశరథ తనయా. !

### పాదగోపనము.

చ|| అరికరహరి ! భూమి తనయాతిశయావనచర్య ! సత్కృపా
కర ! లసమానభాషిత ! దివాకరకల్ప ! విభాయుతానమే
శ్వరశరభాసురా ! శమిత శాత్రవనాయక ! దివ్యతాశయా !
కరితతి వర్యపాల ! నతకల్పయుమేశ ! సుమిత్ర ! యవ్యయా ||.!

### పాదగోపనాకృతి.

| | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అ | ర | భూ | న | శ | న | స | ప | స | భా | ది | ర | వి | తా | శ్వ | ర | రా | త | ఎ | క | తా |
| ఁ | హ | మి | యా | యా | చ | త్కృ | ర | మా | షి | వా | క | భా | స | ర | భా | శ | శా | నా | ది | శ |
| క | రి | త | తి | వ | ర్య | పా | ల | న | త | క | ల్ప | యు | మే | శ | సు | మి | త్ర | య | వ్య | యా |

క|| ఇలలోఁ గోలాశేషా
లంకృత నీలగిరియాత్ర శ్రవణంబులకిం
పలరించు వచనకృతి యిది
యలరు ద్వితీయ ప్రకరణమై యెల్లెడలన్ ||

నీలగిరియందున్నతంబగు ప్రదేశంబున సముద్రసమతలంబునకు నెనిమిదివేల యాఱునూట నలుబది (8640) యడుగుల పొడవుగలదు. ఆకాశంబు నిరావరణంబుగనుండు తఱి నక్కాడపయింగాయు వేండ్రంబగు నెండ చెన్నపురంబు నందుంబోలె నంత వేండ్రంబుగాకుండునట్లు కానంబడియె. అనంతరము స్వదేశమునకు వచ్చిన వెనుక విచారించి శాస్త్రజ్ఞులవలన దత్కారణంబు కొంత యెఱింగికొనినాఁడ.

నీరు వేర దొరఁకొనుతఱి నౌష్ణ్యంబు (32) ద్వాత్రింశదంశకంబనియు నీరు క్రాఁగ దొడఁగొను నప్పుడు (212) ద్వాదశోత్తర ద్విశతాంశకంబనియు ననుమితంబయ్యెడుఁగాన గడ్డగట్టు దొరఁకొనుట యాదిగా, నుడుకెత్తుటతుదగా, నౌష్ణ్యంబునకు వర్ధిల్లిన యంశంబులు (180) నూట యెనుబదియయ్యె. ఈక్రమంబున లోహతైల రసాది పదార్థంబులు యథాయోగ్యంబుగ నుష్ణతాతిశయంబునఁ దమ యాదికారణంబులగు పరమాణు రూపంబులగుచు నుష్ణతా సామ్యంబున నీరగుచు నుష్ణతాన్యూనత్వంబున ఘనీభవించుచున్నయవి. పరమాణురూపంబులగునప్పుడు చూపులకుఁదోపక యెగసిపోయెడునని యెఱుంగునది. చెన్నపురంబున నాతపంబునంగలిగిన వేఁడిమి కొలంది కొంత హెచ్చుకుండుగ (120) నూటయిరువది దొరఁకొని (145) నూటనలువదేనవ యంశంబు పరమావధిగా గలిగియుండు. నీలగిరియం దున్నతస్థలంబునం గొంత హెచ్చుకుఁడుగ (100) నూరు మొదలుకొని (125) నూటయిరువదేనవ పాలు పరమావధిగాఁ గలిగియుండు. ఈయర్థంబు "థర్మామీటర్" అనంబడు నుష్ణమాత్రక యంత్రంబు వలనం దెలియంబడుచున్నయది యని పరీక్షకులచేఁ బ్రచురము చేయంబడియున్నయది. కావున నీలగిరియందు సరాసరి నవ్వేఁడిమి (112½) నూటపండ్రెండు నరయును జెన్నపురంబున సరాసరి ( 32½) నూటముప్పది రెండునర భాగంబునుం గలిగియున్నవి. వీనియందు మొదల జెప్పుకొనిన (32) ముప్పదిరెండంశంబులు వుచ్చిన నిలువ భాగంబులు నీలగిరియందు (80½) యెనుబదియు నరయుఁ జెన్నపురంబున (100½) నూఱునర భాగంబును గలిగియుండు. ఈకొలంది జూడఁ గొంచెమించుమించుగ నీలగిరికంటెం జెన్నపురియందు నెండవేఁడిమి (1) పాదాధికంబయియున్నయది మఱియు మేఘ [illegible] కంటెం బొడవుగలిగి వర్షతుషార విరహితంబులగు గిరులెక్కి పరీక్షించిన శాస్త్రజ్ఞులు పోవంబోవ నున్నతంబున నెండ వేండ్రంబు తరతరంబు కొఱవాఱు నొందియున్నది యని గ్రంథంబుల వక్కాణించి యున్నవారు. భూమి యందుంబోలెయె నాతపంబునకుంగల వేఁడిమికంటెం బోవంబోవ నూర్ధ్వంబున వేండ్రంబు కొఱవడుటకు నిమిత్తంబు కొండొక వచించెద. భూగోళంబుం బరివేష్టించికొని భూతలంబు దొరఁకొని యంత పొడవుదనుకనుండు మారుతంబు తాఁకుటం జేసి రవికిరణంబు లుష్ణంబులయ్యెడు. ఆకిరణంబు లెంతదవ్వు వాతస్పర్శంబు గలుగు నంత కొలంది క్రిందుక్రిందుగ వేండ్రంబు తరతరంబుగం గరంబు గలిగియుండునని శాస్త్రజ్ఞులు వక్కాణించెదరు. జలంబును నున్నంబును స్పృశింపఁదగిన చల్లదనంబుననుండియు నారెండునుంగలయు తఱి నస్పృశ్యోష్ణ బుగలిగియుండుట యెల్లరకుం దెల్లంబయియున్నయది. మఱియు గొన్ని పదార్థ బులు సంయోగంబున మిక్కుటంబగు వేఁడిమినొందుచున్నయవిగావునఁ దిగ్మంబులుగాని తరణి కిరణంబులు పవనస్పర్శనంబునంజేసి యుష్ణంబులయ్యెడునఁట. గ్రంథవిస్తరభయంబున నీయర్థంబింతట నుజ్జగింపంబడియె.

చెన్నపురంబునకు నైరృతి దిశనుండు నా నీలశైలంబు విరివియు నిడివియు నింతకు మున్ను నుడివిన తలంబు పొడవుగాక యితర స్థలంబులంగల యౌన్నత్య పరిమాణంబులు నందుఁగల గట్టుగుట్టల సంఖ్యా ప్రమాణంబులు నెఱయ నెఱింగికొను కొఱకు దివాణము

వారు ఎంజనీర్సు అనంబడు యంత్రవేదులచే గొన్నియేండ్లుగా గొలిపించుచుండియు నే నక్కడనుండు కాలంబు దనుక నిండదయ్యె. ఇట్టి ఘనతకును మున్ను దెలియంజేసిన వివిధకార్యాతిశయంబులకు నాకరంబునగు నా నీల మహీధరంబునందు వాయుమండల లోన్నతి పరిమితికి హెచ్చుకుండు మున్నుదియవ యంశంబుననుండు సుదూరమండలంబున వేయు నైనూటనలువదియారవ సంవత్సరంబున జూను నెల 3 వ తేది దొడంగొని డిసంబరు నెల యిరువదియారవ తేది దనుక బంధుమిత్ర సహవాసుల నెడ వాసిన గాసితో వాసంబు నేసినాడ.

## అకారనిరోష్ఠ్య కందము.

క. సనకసనందన సంక్రం
దనశంకర శరణచరణ ! నతజనచయరం
జన ! కంజనయన ! ఘనకుయ
తనయహర ! దశరథ సనయ ! దశరథ తనయా. !

## పాదగోపనము.

చ॥ అరికరహరి ! భూమి తనయాతిశయావనచర్య ! సత్కృపా
పర ! లసమానభాషిత ! దివాకరకల్ప ! విభాయుతాసమే
శ్వరశరభాసురా ! శమిత శాత్రవనాయక ! దివ్యతాశయా !
కరితతి పర్యపాల ! నతకల్పయుమేశ ! సుమిత్ర ! యవ్యయా ॥ !

## పాదగోపనాకృతి.

| | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అ | ర | భూ | న | శ | న | స | ప | స | భా | ది | ర | వి | తా | శ్వ | ర | రా | త | ప | క | తా | |
| ఽ | హా | మి | యా | యా | చ | త్కృ | ర | మా | షి | వా | క | భా | స | ర | భా | శ | శా | నా | ద | శ | |
| క | రి | త | తి | వ | ర్య | పా | ల | న | త | క | ల్ప | యు | మే | శ | సు | మి | త్ర | య | వ్య | యా | |

క॥ ఇలలోఁగోలా శేషా
చలకృత నీలగిరియాత్ర శ్రవణంబులకిం
పలరించు వచనకృతి యిది
యలరు ద్వితీయ ప్రకరణమై యొల్లెడలన్ ॥

## తృతీయ ప్రకరణము.

ద్వ్యర్థి—

క॥ శ్రీయుక్త వేంకట జగ
న్నాయక! ఘనధామసూర్యనారాయణభూ
నాయకకుమార! గురుహిత!
యాయత గుణరామరూప! యాశ్రిత భరణా!

ఆలింపుము. నీలశైలంపు విశేషంబులెల్ల నుల్లంబునకుఁ దెల్లంబుగఁ దొల్లింటి ప్రకరణంబునఁ దెల్పినాఁడ. ఇంక మదాగమన వృత్తాంతం బెట్టిదన్నఁ జెన్నపట్టణంబున నుండి యన్నీలగిరికి నేనరిగిన సరణిన యరుగుదెంచితిఁ గాన మున్ను గన్నవి విన్నవి గాని యన్యోన్యస్థానంబులం గల తెఱంగు లెఱింగించెద. వేయునెనమన్నూట నలుబది యాఱవ వత్సరంబున డిసంబరు మాసంబున నిరువది యేడవ తేది నాదివారంబు నరుణోదయంబున కర్ధాధిక ఘటికకు మున్ను ధనుర్లగ్నంబున నుదకమండలంబుననుండి నా సహవాసులగు శ్రీనివాస మొదలారింగూడి వెడలి యందలి యగ్రహారంబున నిరతుకొన్న యేకదంత హనూమంతుల నిజస్వాంతంబునఁ జింతించుచు నడచి దారినున్న కుణ్ణూరు గడచి యపరాహ్ణంబున మిక్కుటంబగు నాఁకటితోడ బడలిన యొడలితోడ, బరళియారు సేరితి. అయ్యుదకమండలంబునకు నీ బరళియారునకు నేడునరకోసు దవ్వు గలిగె. ఇట్టి దీర్ఘప్రయాణంబునకు గారణంబు నాతోడివారు విడియ నొడంబడమియ. ఇంత దూర మెక్కుమ్మడి నమ్మల డిగ్గివచ్చుట జేసి కరమ్ము శ్రమభరమ్ము గలిగె. డిగ్గివచ్చుచోట నేటవాలు గావుటం జేసి యుడకమున్న యడుగులు గడు బలిమిం ద్రోపుడు వడుటవలన శీఘ్రయానంబు సమకూరెంగాని స్టాకింగ్సు అనంబడు కాలితొడుగు లుపానత్తులొత్తుటవలనం దుత్తుమురయ్యెఁ; బదతలంబు లఱిగి మంటలు పెరిగె. తొడలం జీలు తొడలం జెప్పనలవిగాని నొప్పి చొప్పడియె. ప్రేఁకాళ్ళ చిప్పలు వీడి వడునట్లు ఉండె. ఉదకమండలంబున నుండుదనుక మిగుల సహ్యంబుగ నుండిన యెండ యసహ్యంబగుటం జేసి యెడనెడ నీడ లరయుచు మున్నచ్చట దుస్సహంబుగ నున్న వలికరువలి కెదురు చూచుచుఁ గ్రమ్మఱ నిమ్మెయిం దోఁగిన నెమ్మేను దూఁగ నిట్టూర్పులు వుచ్చుచు వచ్చి బరళియారున నీలగిరిం బాసిన వేషంబు మాని యొప్పటి బూమి వహియించితి.

ఇరువదెనిమిదవ తేది ద్వితీయవారంబున బరళియారు విగనాడి కొంత మేర నడతెంచి యచ్చట డిగుడు మూఁయుడు నగ్గిరి కెరంగి తదీయశృంగంబునం గల గంగనాయకు నుద్దేశించి నమస్కారణంబొనరించి మఱలి కల్లారు త్తరించి దంతావళ కాంతారం బతిక్రాంతంబగుడు నించుకమించుగ ఘంటా నవకంబునకు నధికంబగు తొలినాఁటి కాళ్ల నొప్పితో నగ్గలంబగు డప్పితో నిబ్బరంబు లయిన యతి కాళ్ల బొబ్బలతో మేటుపాళయంబు సొత్తెంచితి. తొల్లిఁ గట్టెక్కిపోవునెడ నెక్కుడు మిక్కుటమగుట నెక్కుదుఃఖం బసహమాసంబు గావునఁ జేవచెడి యెక్కడ దిగువగలుగు నెక్కడ సమతలం బబ్బు నను తర్షం బుత్కర్షంబుగ నెక్కిన నెక్కుచుఁ దాదృశంబులగు ప్రదేశంబులు చేరునప్పుడు హర్షప్రకర్షంబునం దేలుచుం బోయిన నేను నా తోడివారును నగ్గిరి దిగ్గి

వచ్చుతఱి దిగుట పెద్దయగుటం జేసి వెనుచఁబడుచు నెక్కడ నెక్కుడు గలుగు నెక్కడఁ జిక్కని యిక్క చిక్కనను కోరికం గూరిన మనంబుతోడ నవతరణంబు సేయుచు నట్టి పట్టు గనుపట్టినప్పుడు ముదంబునం బొదలుచు నరుదెంచితిమి. ఎట్టి మనోజ్ఞం బగు కర్జంబేని నెట్టి సుఖప్రదంబగు పదార్థంబేని నొక్కమ్మడి నమితమ్ముగ ననుభావ్యం బయ్యెనేని బాధోత్పాదకం బగునని యత్తఱి నాకుం దోఁచె.

నీలశైలావతరణానంతరంబునం గల కాననంబు దంతిసంతానంబునకుఁ దానకంబై పథికవితానంబునకు నొక్కొక్కసమయాన భయానకంబై యుండు. అరణ్యానులఁ గల తెఱంగు నారయ నెఱింగినంతవట్టు నెఱింగింతు. అవ్విపినవాటిం గల ద్విపకోటి మాటిమాటికిం బోటరులు వేఁటలం బోటులఁ దుపాకియేటులఁ గీటడంగించుచుండను నవ్వి యవ్విపినంబునం దఱుగకయుండు. నిరతిశయంబగు తద్భయంబు నిశాసమయంబులం గాని దివసావసరంబులం గాదు. తుపాకి నిస్వనంబులకును జ్వాలజ్వాలకు నగౌకులు చేరువం జేరమి నరులు విభావరుల నేఁటికి వెలిఁగించిన కొఱకంచు కఱ్ఱల డివియలఁ దుపాకులఁ బట్టించి కొని నట్టుడక యయ్యడవి నడచుచుండెదరు. అగ్గజంబుల నివాసంబును యూథంబు లయియుండు. అయ్యూథంబులకు వేఱువేఱ యూథనాథంబులు నిర్నిరోధంబులయి యుండు. యూథంబులిభులు యూథనాథంబులిభంబులు. ఒక్కొక్క యూథం బిరువది ముప్పది కరిణులు గలయది. దానం గతిపయకలభంబులుం గలవు. ఆ వృలు గొఱ్ఱెల మేకపిల్లలఁ బట నినువగు పట్టుల వెలికిం గనుపట్టకుండఁ దృణాదికంబుచే నాచ్ఛాదనం బొనర్చి తమ నేర్చిన పడువున నమర్చిన యీ పంబులు వానికి వాణికిఁ గారణంబులు గావున నవ్వారణంబుల వారణ స్వైరవిహరణంబునకుఁ గడంగు నెడ యూథనాథంబగు వేదండంబు నిజశుండాదండంబున శాఖాశాఖాకాండం బొందపూని పుడమి నెడ నెడ నూని యూని యరచూచి శంకాకులంబు గావున నవ్విపంకలు గనుంగొనుచు మున్గలిదై నడువ, దానికిం బింగలిదై కరిణీనికరంబును దాని వెన్నడి గలభకటకంబును జనుదెంచుచుండు. ఈ గతి నేగుదెంచు నెడఁ బురోగామియగు నాగంబు దన కనుమానాస్పదంబగు తానంబుగాని, మానవవితానంబు మెలఁగుపట్లుగా తోఁచెనేని నిలిచి యొక్క బృంహితంబు నొనరించు. అన్నినదంబు వినినంతన వెన్నడి నడతెంచెడి ధేనుకాప్రకరంబంతంత నిలుచు. అంతట నయ్యగ్రసరంబగు సింధురవరంబు డెందంబునం బొడమిన సందియంబు డిందిన ముందటి చందంబున ముందఱ గమనించినఁ బిఱిందికడవియు ననుగమించు. ఆ సందేహం బెడపడకుండెనేని వెండియు నా శుండాలంబు మహాడంబరంబుగా ఘీంకారంబు గావించిన, నవ్వశావిసరమ్ము సత్వరమ్ముగాఁ గ్రమ్మఱి మున్ను వచ్చిన తెన్నువట్టి పఱచు. తదనంతరం బయ్యూథనాథం బయ్యూథంబు ననురోధించి నిర్నిరోధ బోధంబునఁ దద్రక్షణం బపేక్షించుచుండు. జనంబులఁ బొడగన్నప్పు డొక్కొక్కపరి వెఱపఱి పఱవక యన్యేనుంగుల ఱోఁజు వారిం గొంతదూరంబు దఱిమి దొఱకినవారిఁ గుమ్మికొని యఱిమి మట్టలచుండుంగాని, యెక్కుడు దడవు మసలదు. పరితోఁ జేసిన యవి దక్కఁ దక్కుఁ గల కరివరంబు లొంటరులై యెక్కడకెక్కడ నెక్కొనుమదంబునం బొదలి మెదలుచుండు. యూథంబులలోని మగగున్నలు మదోన్మాదంబు పుట్టినతఱి నన్యయూథనాథంబులచే యూథంబులలో ననురోధంబు లేకుండఁ దఱుమంబడి యొంటరులై క్రుమ్మరుచుండుఁ గావున వాని నొంటరులని వాడుచుండెదరు. ఈ యొంటరులు తెరువరుల కొఱకుఁ దెరువుల్ గాచి దిగులుదగులక మిగులఁ దెగువ గలిగి యులిగి యర్థ్యగులఁ దెగఁగొని యరుగుటయు నొకానొక యవసరమ్మున బిరుదు తెరువరు

లచే గతాసువులయి యొఱుగుటయుం గలదు. మఱియు నీ యొంటరులు దమ కపాయంబులు సమకొలుప నుపాయంబులగు కైదువులఁ బూంచిన జనంబులం గాంచిన మనంబులం గొండొక భయంబడరఁ బయింబడవుగాని నిరాయుధులగు మనుష్యుల సమూహంబున మహాహుంకారంబున ఘీంకారంబొనరించి సాహసంబునం జేసి డాసి దూఱి మీఱి వారివారి సమరి దైవాఱుచుండు. అక్కరు లొక్కొక్కతఱి మదంబు పెల్లునఁ దుపాకి రొలుంగునకు సింగలంబు వెలుంగునకు వెఱచ ఱవక వఱలుచుండు. సాధారణంబుగ మనుజగణంబుల మారణం బాచరించుట వారణంబుల యందె కాని కరేణువులయందుఁ గలుగదు. కరేణువు లెక్కటి దోతెంచుట యక్కజంబు. పరిగానేనియు నొకానొకతఱి నేకాకినిగానేనియు నరుదెంచుచు నరులా సరించు పెల్లుబుపులకె వెఱచఱిచి పఱచి కన్నొఱంగుచుండు. ఒంటి సంటిఁ జను జనులా సరణిఁ గరిణీసంచయంబు గాంచిన మించిన భయంబున రయంబున నఱుచుచుఁ గలగుండు వడి రొందరుగాని, యాధేనుకలా పథికుల కపాయంబు నేయవు.

ఈతుండాలంబులు వర్షాకాలంబులయందె సారె సారెకు బయలుదేఱుచుండు. గ్రీష్మకాలంబుల రేలం దక్కఁబవలెల్ల పొండగు తరుషండంబుల నీడ లండగొనియుండు. వాసరకర కరనికరంబు గాసరంబులకుం బోలె వీనికి నుల్లాసజనకంబుగాదు. మున్నొక్కతఱి నత్తెరువునఁ జెరువరులగు తెలుప లిరువురు నలువురుపురుషుల తోడంగూడి యరుగుచు దరదంబగు నొక్కద్విరదంబుఁబొడగని వెఱచఱచి యఱుచుచు బిరబిరఁ బఱచిన నక్కరి కడువడి వెన్నడి తఱిమి యఱిమి యప్పురుషులలో నొక్కరు నుక్కునవాడిసి పట్టికొని నెట్టనఁబడమింబడవైచి యొక్కకాల వానికాలు ద్రొక్కి తుండాదండంబున రెండవకాలు పట్టి కరంబు భయంకరంబుగ రెండు ఖండంబులుజేసి వేరొక్కని నక్కరణిన కఱుకుతనంబునఁ బిలుకు మార్చె. అత్తఱిఁ గొండొక తెలివిగనిదాని బారింబడక కనుకనిం బాఱియారంబులోనదూఱి మఱుంగువడినవారి నలువురం గనుంగొననేరమి నమ్మతంగజం బెసకంబెసంగ నలుదెసలుఁ బరికించుచుఁ దిరిగి యరుగు నెడ నొక్కెడఁ బొదలోనం గదలక మెదలక డాఁగిన ముద్దియలిద్దఱు విధివశంబున బుద్ధిహీనలయి యుద్దియేని నొండొరులు వదరుకొను చప్పుడప్పారువునం బోవు కుంజరంబు విని యక్కుంజంబునకు మరలి యచ్చెలువల నొక్కొక్కతెఁ గరంబున నీడ్చి మున్నటి చందంబునఁ బొరివుచ్చి విచ్చలవిడింజనియె. తక్కిన పురుషులిరువురు నక్కరికిం జిక్కక జీవంబులు దక్కించుకొని తోడివారి నిధనంబునకుఁ బొక్కుచుఁదమ యిక్కలకుంబోయిరి. ఆకార్యంబునకు ముందు వెనుక నద్దారి నడచువారి నివ్వడువున బహువారంబులు వారణ వారంబులు దమచారింబడినవారి దారుణంబుగ మారణం బొనరించె.

మున్నొక్క యాంగిలేషు దొర జక్కినెక్కి యశ్వానం బోవువాఁడొక్క వశాదశకంబుఁబొడగని దానింగెడపు నాశయంబున శయంబుననున్న కశపుడమింబడవిడచి రయంబున హయంబుడిగ్గనుఱికి యగ్గలపువారి కేలంగీలు కొన్న తుపాకిం గొని సరభసంబుగఁ బరిసరంబుననున్న భూరుహంబు నారోహించి ధైర్య స్థైర్యంబు లవలంబించి మున్న బారుచేసి యున్న యత్తుపాకిని నిజభుజంబున నుంచి యొక్క హస్తిని గుఱివెట్టి మొట్టమొదల నొక్క యేటు గాల్చిన భీకరంబగు ఢంకారంబుతో భగభగమండు నగ్గుండువచ్చి యక్కుంభిని కుంభంబు దవ్విన నది భయంకరంబగు ఘీంకారంబు నొనరించుచు ముందటి ద్రొంకాలు ముడిచి నేలంబడి కాలధర్మంబు నొంద నద్దానిసీనవకంబు పడినదాని విడిచి యొండెనిఁ బ్రతిఘటింప నుత్సహింపక వెఱయు నివ్వెఱయుఁ బఱిగొన గిఱికొని కనుఁగొనుచుండ నబ్బలుమగండు వెండియు నొకదెబ్బ గొబ్బున మఱియొక్క యేనుంగును భీమంగుఁ గాళించె

ఇక్కరణిఁ గరిణీ పంచకంబు నన్నుక్రమంబునఁ బంచతాపతితంబుఁ గావించినఁ గాంచి శేషించిన యేనుంగు లేనును మిగుల దిగులు దగుల వగలఁ బొగులుచుఁ బరువిడె. మఱియొక పరి మఱియొకకరి నా కల్లారున నీరు ద్రావవచ్చిన తఱి . నొక యఱవమన్నీడు మన్నిగొనియె. ఇవ్విధంబున నష్టంబు నధిక శౌర్యధురంధరులు వెక్కుసింధురంబుల నిధనంబు నొందించిరి.

అయ్యడవి యక్కొండఁ జుట్టి రాఁదిరిగి యింత కంటె విరివిగ నెడతెగకుండెడు. ఆకొండ నెక్కుటకు మఱికొన్ని దిక్కులఁ గొన్ని తెన్నులున్నయవి. ఆ తెన్నులన్నింటి నన్నాగంబు లధ్వగులకు బన్నంబు నాపాదించుచుండు. వెండియుఁ గోయంబుత్తూరి జిల్లాతోఁ జేరిన కొన్నియెడవుల నీ యెక్కుడు మెకంబు లెక్కుడుగఁ గలయవి. అయ్యడవి పట్టు వడు వడువులు కొన్ని గలవు. వాని యందొకండు నావిన్న విధంబున విశదీకరించెద. నీలశైలంబునకుఁ గాలుని దిశ మూఁడామడ మేరనుండు కోయంబుత్తూరిలోఁ గతిపయజన శతంబులు గజంబులఁ బట్టుటకుఁ గొలువుగొని యుండెడు. తహసీలుదారుఁడు మొదలగు గొప్ప యుద్యోగస్థులు గొందఱు తదధికృతులై యుండెదరు. ఆజనంబు విపినంబులకుం బోయి నలువంకలు నెమకి నెమకి యనేకపంబులుండు చోటులరసి వచ్చి చెప్పినఁ గలెక్టరు ననుమతిఁ గొని తహశీలుదారుఁడు లోనగు వారందఱు సపరివారంబుగా గానకుం జని యేనిక గుంపులుండు నెలవున కీవలఁ గొన్ని గడియల మేర నొక్క సమస్థలంబు గావించి దానిచుట్టు వలయాకారంబుగఁ గాలువ యొండు ద్రవ్వి యక్కరి ఘటలుండు చక్కి కభిముఖంబుగ గొంత త్రోవవిడిచి యక్కడ నుండి తరతరంబ మధ్యప్రదేశంబు విశాలంబగు నట్లు లాచుట్టు కాలువ రెండు పాయలుగా గోరుల చేరువకుఁ ద్రవ్వెదరు. ఆకుల్యాయుగము మట్టు సంకటంబుగఁ బయిమట్టు విరివిగఁ జొప్పడు చొప్పున ద్రొవ్వెదరు. ఆకాలువలోతు హెచ్చుకుండుగ రెండున్నర నిలువుగలదు. పయివిరివి యయి దాఱడుగుల కొలఁదిగ నుండెడు. వలయాకార ప్రదేశం బేనుంగుల గుంపునకుం దగిన పగిదినర మయిలు విశాలంబుగఁ గాని దానికిఁ గొంచెమించుమించుగఁగాని యేర్పఱిచెదరు. వలయాకారంబగు నక్కాలువకు లోఁద్రొక్కనోరగఁ జుట్టిరాఁ జెట్టులు నాటెదరు. ఆవల నా వలయాకార ప్రదేశంబునం గొండొక ముండ్లక్రంపలు పఱపి యుంచెదరు. ఆకాలువ యాకారంబీ క్రింద లిఖించిన ప్రకారంబు గానుపించుచుండు.



ఈలాగునఁ గాలువ పాయలు గొన్ని గడియల దవ్వుదనుకఁ ద్రవ్వి యవ్వల నా జనులు కాలువ త్రోవ దక్కఁ దక్కు దిక్కుల నేనుంగుల గుంపుఁజుట్టుకొని రెండ నైడ వెలుఁగించు మంటలవలనను నుడుగక మ్రోయించు తప్పెటలు తుడుములు లోనగు వాద్యంబుల రవంబులవలనను గుండులిడక మెండుగఁగాల్చు తుపాకుల యులివులవలనను బడిబడి ప్రయోగించు రాచూర బాణంబుల వలనను నైడనైడ నడరించు పెల్లుఱుపులవలనను నక్కుంజరంబులకు గరింబు దరంబు గలుగంజేసి వాని నక్కాలువ కభిముఖంబుగాఁ బోవునట్లు దోలెదరు. ఈ శుండాలంబులు రెండు కాలువలకు నడుమదూఱి నంతటఁ దిరుగ వెనుకకుఁ దిరిగి యరుగకుండుటకు గొప్ప మంటఁ యడ్డముగఁ బ్రజ్వలింపఁజేసి యమ్మంట నను క్రమంబుగ నించుకించుకఁ దమకు ముంబడిగఁ ద్రోయుచుఁ దాము వెంబడిగ మున్న చెప్పిన చొప్పున యన్ని చప్పుళ్లతోఁ దోలుచుఁ గొండొక మేర దెచ్చి యుంచి యచ్చెంత నొక్క స్థలంబున నాహార నిద్రాది వ్యవహారంబులు నిజోచితంబులుగ దీర్చుకొనియెదరు అప్పుడు పంతువలతున నాయుధవంతులు గొందఱమ్మంటను మిగుల రగులు కొనంజేయుచు కాపుండెదరు. ఇయ్యనువున నయ్యేనుంగు లాసమ ప్రదేశ మార్గ ముఖంబుఁ జేరుదనుక నధిక ప్రయాసంబున ననుదినంబును దోలికొని వచ్చెదరు. ఆ కాలువ పాయల ముఖంబు దొరఁకొని యా సమ ప్రదేశమార్గ ముఖంబుఁ జేరవచ్చుట కయిదాఱు దివసంబులు పట్టుచుండెడు. ఇచ్చందంబునం దెచ్చిన యచ్చేగల మొకంబులు నమ్మార్గముఖంబు కడ నిలిచి తత్ప్రదేశంబులోపలఁ జొర వెఱచి యొకండొకండుగ నట్టికలకుం బోయి పోయి చూచిచూచి వెనుకకు వచ్చుచుండుటగాని లోఁజొచ్చిచనవు. అనారతంబు నొనరించు జనారవంబులకు, వారక మొరయించు పటహాద్యనేక వాద్యములకు, మానక కాలుచు తుపాకుల రవంబులకు, చిఱచిఱఁ బరగించు చిరుసు బాణంబులకు, నంతక తఱఁ గొంతకొంత యొత్తించి యొత్తించి విస్తరింపఁజేయు జ్వలన జ్వాలలకుఁ జాల భీతిల్లియుఁ దల్లడిల్లియుఁ గొన్ని గడియలదాఁక లోపలఁ జొరలేకయుండు. మఱియు నమ్మనుజులు మఱిమఱి నెఱయించు రొదలకు మంటల యదరులకు నదరిబెదరి మది చెదరి యొక్క ద్విరదంబుదూఱెడు. పదంపడి దాని తోడివన్నియు ముందు వెనుక గానక గతానుగతికంబులై చొచ్చు; చొచ్చిన వెంట నమ్మంటను సత్వరంబుగ నమ్మార్గముఖంబున కవరోధంబుగ నిలిపి యయ్యారువలనల నుండు కాలువలొండుగ ద్రవ్వెదరు. లోపలికిఁ జన్న యన్నాగంబులు నలుదెసలుం దిరిగితిరిగి చుట్టు కాలువచే నేతట్టునెట్టులుం బోవ ద్రోవలేమిఁ బ్రకోపంబగు కోపంబున నాద్విపంబులెల్ల గూడంబడి ఘీంకారంబు లొనరించుచు మునుమున్న ప్రవేశించిన దానిఁ గరంబులనడచి దంతంబులఁ బొడిచి పెక్కుడుమలిడి ప్రాణంబులు గైకొనియెడు. తదనంతరం బద్దంతులబ్బయల నలు వంకలఁ బఱచుచుఁ బఱచిపఱచి చుట్టునుంగల చెట్టులఁ గట్టలుక కఱచుచు విఱిచివిఱిచి తెరువుగానక తిరుగుచుఁ దిరిగితిరిగి వెఱపడియుపు లఱచుచు నఱచియఱచి నివ్వెఱగందుచు వెఱనొందుచు దిక్కుచిక్కక యుక్కుదక్కుచు నత్తలంబునంగల కంటకంబులు పదతలంబులఁ గ్రుచ్చుకొనుటఁ బెచ్చుపెరుగు వేదనావశంబున మిక్కిలి పొక్కుచునుండు. ఇవ్వేడుకఁజూడ వేడుకపడి వాడుకగ నాడాడనుండు నెంగిలీషు దొరలును దక్కు నరులును బెక్కండ్రువచ్చి దూరంబున నివసించెదరు. అయ్యేనుంగులీభంగిఁ గొన్ని దినంబులున్న వెనుక ననుదినంబుఁ గొంత మేఁతదెచ్చి లోపల వైచెదరు. కతిపయ దివసంబులలో నా సమతలంబునంగల మొండులవలన మెండుగ, వానియడుగులఁ బుండులుపుట్టి చీముపట్టిన కతంబున నడుగిడఁజాలక తగిన యాహారలేమిఁ గడు బడలి చిక్కి స్రుక్కిసోలి వ్రాలుచుండెడు. అప్పుడలపములపఁబడిన నాలుగు గొప్పదంతావళంబుల పయిఁ గుంతాయుధవంతులగు భూపంతులు గొందఱెక్కికొని వాని కడుపుల క్రింద వ్రేళ్లు

తొట్లలోపలఁ గొందఱు గుర్చుండియుండ నక్కడి కేతెంచి త్రోవనుండు కాలువకుఁ బదిలంబుగఁ బలకలు లోనగునవి పఱచి లోపలికిం జొచ్చి ముందఱనుండు దంతి చెంతకుఁ దోతెంచెదరు. అంతఁ జిరంతనదంతి చతుష్టయంబున నొకండు దన తుండంబున నాతుండి తుండంబుఁ బెనచిపట్టి గట్టిగ లాగికొని వచ్చుచుండు. రెండు దాని రెండు ప్రక్కల నేతెంచుచుండు. ఒకఁడు వెనుకనరుగుదెంచుచుండు. అభినవంబగు నయ్యిభంబు చరణవ్రణబాధచే నడువలేక కాని మొఱకుతనంబున వడలి రాక కాని యుండెనేని వెనుకఁ బ్రక్కలవచ్చుదంతులు దంతంబులచేఁ బొడుచుచుఁ దుండంబులచే నడుచుచు నల్లనల్ల నడపించుచుండు. మఱియు వానిపయినుండు నాయుధహస్తులు దాని మస్తంబున గ్రుచ్చుచుండెదరు. ఇట్లు వెలువరించి తెచ్చునప్పుడు లోనుండు తుండులలో నొకండు రెండు గొండొక యెదుర్కొని పెనఁగినను వెలపల రాఁదొడంగినను సావటీండ్రు ప్రాంత యేనుంగులచేత వాని నడిపించుచుఁ బొడిపించుచుఁ దమ యాయుధంబుల బాధించుచు నిలుపరించి, మొదటఁదెచ్చు దాని వెలుపలఁ గొంత దవ్వుదెచ్చి యుంచెదరు. అతఱిఁ బురాతన గజంబుచే నిదానీంతన గజంబు తొండంబు గదలమెదలకుండు నట్లుచేసి పార్శ్వచరంబులగు కుంజరంబుల జాగరూకంబులగా నొనర్చి వెనుకవచ్చు దాని దీనిం జేర్చి నిలిపెదరు. అప్పుడు పిఱింది కడదాని తొట్టిలోనుండు వారొయ్యన యినుప గొలుసులు హెచ్చిన హెచ్చరికతోఁ గ్రొత్తదాని వెనుకటి కాళ్లకుఁ దవిలించెదరు. ఇక్కరణిని ప్రక్కలనుండు నక్కరుల తొట్లలోని వారును ముందటి కాళ్లకు గొలుసులు దవిలించెదరు. అంతఁ బ్రాక్తన దంతులపయి నుండెడు మావంతులలో నొకండంకుశహస్తుండయి పయినెక్కి నూతన మాతంగంబు నడిపించుకొనిపోయెడు. ఆ సమయంబున నా పురాతన శుండాలంబు దన శుండాదండంబునం బెనచి పట్టికొని యుండు నూతన వేదండంబు తుండంబును విడువక నడచుచు నది చిడిముడిపడు నెడ లాగుచుం బోవుచుండు. తక్కిన మూఁడును మున్ను నుడివినవడువున నడిపించుచుండు. ఇక్కైవడిఁ దెచ్చి యక్కానసంబు నందు యొక్కయొక్క దృఢతరమాలంబగు నొక్క సాలంబున బంధించి కొన్ని దినంబు లన్నెలవునంద యునిచెదరు. ఇత్తెఱంగున నమ్మతంగజంబుల నెల్ల నొక్కఁడొక్కండుగఁ గొనివచ్చి యుచితౌషధ ప్రయోగంబునఁ జరణగతంబులగు వ్రణంబులఁ బోకార్చి కొన్ని దినంబులకుఁ బిదప వీని యునికికి నియతంబయియుండు ప్రదేశంబుఁ జేర్చి వాని స్వాధీనంబులుగఁ జేసి కొనియెదరు. ఇక్కరణిఁ జిక్కిన యక్కరుల నక్కలెక్టరు వేలంబున విలుచుచుండెడు. ఒక్కొక్కతఱి యక్కరుల కాలువలోఁ జొరక మున్న తప్పి పాఱిపోవుచుండు. ఇట్లుపోవు గజఘటలు మునుపటి చోట నివసింపక దూరంబరిగి మఱుఁగుపడుచుండు. నేను గొండనుండు తఱి గవర్నరుగారి వేడుకచూడ వేడుకపడి మితపరిజనంబుతోడఁ గోయంబుత్తూరికిఁ బోయియుండు నెడఁ గరిఘటలప్పగిదిఁ దప్పి పలాయితంబులయ్యె. ఒక్కొక్క సమయంబున నక్కరులా వలయాకార ప్రదేశాంతర్గతంబు లయిన పిదపఁ దొలుతొలుత మాఱిన గొరుఁ దీఱం జేయునప్పుడు దప్పియొకండు రెండో చుట్టు కాలువలో నిపతితంబులయ్యెడు. అట్లు పడినదాని వీపున నడుగు లిడి కాలువగడచి కొన్ని విడివడి పరువిడియెడు. నంతలోఁ జెంతనుండు సాధనవంతులగు మనుజులు మిగిలిన వానిఁ బోనీక పదిలంబు నేసెదరు.

ఈ యెక్కుడు మొకంబులు దక్క దక్కు మొకంబులు దమ భోజనంబులకు భాజనంబులగు భూజనంబుల నేని నన్యప్రాణి సమాజంబుల నేని సామాన్యంబుగ నక్కఱగల తఱిఁ భోర్కొని మొక్కుచుండుఁగాని, తక్కు సమయంబుల నంటవు. తమకు భక్ష్యంబులు

గాని వాని నేకాలంబునను జంపవు. తము నెరకుఁగాని మఱి యేకొఱకుఁగాని కోఱగాని నరుల నిక్కారు లెక్కుచు మదంబున నిరర్థకంబుగ లోచన గోచరులగు నపుడెల్లఁ గాల గోచరులఁ జేయుచుండుఁ గాఁబట్టి, యిట్టి దుష్టసత్త్వంబు లన్యంబులు గావని యచ్చటి వారు వాక్రుచ్చుచుందురు. కాని యది నామది యాథార్థ్యంబని తోఁచకుండెడు. ఇట్లు సేయు నవి యేమంగు లె కావు. మఱి కొన్ని ఘాతుకంబులగు చేతనంబులుంగలవు. అవియు దుష్టజంతువుల యని పలుకుదురు. ఏ జంతువులు నృశంసంబులని ప్రశంసింపఁబడు నయ్యవి విమర్శించిచూడ దుష్టంబులు గాకుండునట్లు గానంబడియెడు. ఇయ్యర్థంబు నందు దృష్టాంతంబులుగ ననుభూతంబులగు వృత్తాంతంబు లొకండు రెండు దాహరించెద వినుండు. కాటువలనను మీటుటవలనను మనుజకోటుల కత్యుద్రంబగు నుపద్రవంబు నాపాదించుటంజేసి సర్ప వృశ్చికంబులు హింస్రంబులని వాడుదురు. వాని నైజంబులగు గుణంబుల రయరు. మనుజావాస స్థలంబుల యందు చాటుగు చోటులందుండు నల్ప జంతువులగు పాములకుఁ దేళ్లకుఁ జాటులేక మానవులు మాటిమాటికి గోచరించుచుండెదరు. అట్టి మనుష్యులఁ జూచునప్పుడెల్ల వానికిఁ గఱవఁ గుట్టఁదలంపు పుట్టునేని మనుజులెట్టు లిమ్మేదిని మెదలెదరు? మన యీ దేశంబుల మనుజావాస ప్రదేశంబుల సాధారణంబుగ ద్రోణంబులు లేకుండుట లరుదు. అట్టి నివేశంబుల నివసించు జనంబులకవి యెల్లవేళలఁ గానంబడుఁగాని వానికి మానవులు గానంబడకుండఁ జాలరు. కావున వృశ్చికంబులు మానిసిఁ బొడగన్న యప్పుడు మీటఁ గోరుచుండునేని వానికిఁ గాలం బను కాలంబు గాకపోదు. తేళ్లవలె బహుళంబుగ లేకున్నను పాములున్న గీములు గొన్ని గలవు. అన్నెలవుల నున్న మనుజుల నప్పన్నగంబులు గనుఁగొన్న తఱి గొఱుక వలయునని యభిలషించునేనిఁ దన్నివారణంబున మానవు లశక్తులని నాకుఁ దోఁచెడు. మానవుల వలనఁ దమ కపాయంబు లుత్పత్తిల్లునని తోఁచునట్టి జంతువు లెయ్యవియేనిఁ దత్ప్రతీకారంబు కొఱకుఁ దమ శక్తికొలఁదిఁ బారుష్యంబుఁ జూపెడు. ఈ వాక్యంబు నుద్దేశించి రెండవ ప్రకరణంబునఁ బులుల విషయము గొండొక చెప్పియున్నవాఁడఁగావున నిచ్చో సంగ్రహించితి. తేలు దన మేని నేమేని స్పృశియించు తఱి శంకించి దానిం దన పుచ్ఛంబున మీటుఁగాని లేనితఱి నెద్దానినేని నంటదని యూహించెద. సర్పంబు నప్పగిదియ. తన కన్యంబు లగు వ్యక్తులవలన బాధలుగాని బాధా సూచనంబులుగాని గలుగునప్పుడు భయంపడి నిజావనంబుకొఱకుఁ గఱచెడు. మీటుటయుఁ గొఱుకుటయు ఘాతకత్వకంబునకును దందశూకంబునకును సహజగుణంబులుగనుండెను. అట్లు మీటుటయుం గొఱుకుటయు నిజ్జగజ్జనంబుల కాపజ్జనకంబు లగుటంజేసి దుష్టంబులని స్పష్టంబుగ నయ్యవి వాడంబడియెడు.

ఇయ్యర్థస్థిరీకరణంబున కనుభూత పూర్వంబగు చరితంబుఁ గొండొక వివరించెద. మున్నొక్క సమయంబున నేనొక్క కడపకడ నిలువంబడియుండి యొక్కరితోడ సల్లాపించుచుండఁ జూరునుండి జారి నాశిరంబుపై నొక్క జంతువుపడి పడినయెడన కదలక మెదలకయుండె. తదీయంబగు పతనంబుచే నది వృశ్చిక గృహగోధికలలో నన్యతమంబకాని వేరొండుగాదని యూహించి కొండొకపడికిఁ జేతనుండు గుడ్డచేతఁ దటాలున దానిం బుడమిం బడఁద్రోచి చూచి తేలుగ నెఱింగితి. అవ్వృశ్చికంబు మన్మస్తకంబునఁ గొన్ని నిమేషంబుల దనుక నివసించెంగాని మీటదయ్యె. మఱియు నేనొక్క నిశాసమయంబున శయ్యాతలంబున నొత్తిగిలి శయనించియుండ నొక్క వృశ్చికంబు వివస్త్రంబుగనుండు నా వెన్నెక్కి బాహూపరిభాగంబున జాగి పొత్తికడుపుఁ గప్పఁబడియుండు పుట్టంబు మీఁదికిం బోయె. అందాఁక నించుకేనియుఁ జాంచల్యంబు లేక యుండి యవ్వల నవ్వలిక

ద్రోఁచి లేచి చూచితి. కదలకుండిన శాకకీటంబు మీఁటదని వినియున్నవాఁడఁగావున నట్టులుంచియు నయ్యది పుట్టంబు మీఁదికిఁ జేరునందాక వెఱపుచే మేను గరుపాఱుచుండె. ఇట్టివి లోకుల కనేకంబులు భూత పూర్వంబులయి యుండునని తలంచెద.

మున్ను కొన్ని యేండ్ల క్రిందట మన్మందిరంబునఁ బిఱింది తొట్టికట్టున నొక్కతట్టు గదిలోఁ గొంతుక కూర్చుండి యొకరితోడ మాటలాడ నొక్కనాఁడు బాము నామీఁదఁ గాళ్ళమీఁదఁ జనియెంగాని కఱవదయ్యె. మఱియొక తఱి మా పేటకు నుత్తరంబున రెండామడ దూరంబున నుండు కాటూరను నూరికిఁ గార్యార్థినయి కొందఱంగూడి చని కొన్ని పూటలచ్చోట నివసించియుండఁ దొలునాఁటి మాపటివేళ మావిడిదియగు గృహంబున నిద్రితుండనయి నాలుగు ఘంటలకు మేలుకని వెల్లవెలఁగ నుండి తోడి వారితోడ నిష్టగోష్ఠి నుండ నా తలయంపికడ గోడలోఁ జెంత నున్ముఖంబైయున్న యొక్క పన్నగంబుఁ గని క్రన్నన నచ్చోనున్న వారందొఱు లేవ మాప్రక్క నొక్కటియుఁ జెంచియుఁ గొండొక దవ్వున మఱియొక్కటియు నుండఁగఁ బోడగని బెదరి యుద్వేగంబు గదురఁ దోలఁగంబారి యక్కడి వారిం బేర్కొని వానిం జూపితిమి. ఆచప్పుడుచే నాసర్పంబులు మూఁడు నప్పుడు గోడమీఁదుగఁ బోయి పయికప్పులోన దూఱి కనఁబడవయ్యె. ఆయూర నయ్యూరివారు వీనికిట్లు భయంపడువారు గలరే యని వెఱగుపడిరి. అపాము లంత దవ్వు పుడమినుండెనో యిల్లెట్లు గ్రుమ్మరుచుండెనో మే మెఱుంగము. మాకు లోచనగోచరంబులుగాక మున్న పన్నగంబులకు మమ్ముం గఱచు తలంపుప్పతిల్లెనేనిఁ దప్పిపోవు చొప్పు మాకప్పు డెప్పగిదిం గలుగు? మావలన నయ్యెడి జెయ్యది? మఱియు మాయూరికిఁ బడమటఁ గొండొక చేయునుండు కలెక్టరు కచ్చేరి కావలఁ బోవు నుత్తరదక్షిణముఖంబగు త్రోవ నొక్క వేకువ నొకానొక కాకోదరంబు తూరుపు కడనుంచి యడ్డంబుగ వచ్చి పశ్చిమంపుదిశ గోడకడనుండ దాని దండఁ బిండుగొని తెరువరులు గొందఱా దందశూకంబు నాలోకించుచుండిరి. కొన్ని నిమేషంబుల కావల నాత్రోవం బోవువాఁ డొక్కరుండు డక్కుమీఱి యక్కుండలిం జేరి తన భుజాదండంబునం బూని దండంబున దాని నడుమ దొరఁకొన్న నంతకుమున్ను మిన్నకయున్న యన్నాగంబు సముత్పన్నంబగు రోషవేగంబున బహువారంబులు ఘోరంబులగు ఫూత్కారంబులు నిగుడం బడగ యెత్తి కఱవ నుంకించుచు బెట్టిదంబులగు తదీయ దండ తాడనంబులకుఁ దప్పిపోనేరక విధివశంబున నాబిలేశయంబు చచ్చెనని, కన్నారం జూచివచ్చిన నానెచ్చెలి యొకండచ్చెరువుతోడ వాక్రుచ్చె.

మా పేటకు దక్షిణంపు దిక్కునఁ గోసెఁడు మేర మైలాపూరను పేరఁ బెంపారు నొక యూరు గలదు. దాన నానెయ్యుండొక్కండు గలండు. అతండొక్కనాఁటి మాపటివేళఁ దనయింట నొక్క గదియందు నిద్రగైకొని యపరాత్రంబునందు మేలుకని తన సెజ్జయందు పజ్జ నొక్కప్రక్కనున్న పుట్టంబెత్తికొన్న నందుండి యొక్క పవనభుక్కు గ్రక్కున భూతల పతితంబయ్యె. అయ్యురగం బతని శయ్యాతలంబున నెంత కాలంబిరవుకొన్న దయ్యెనో యెఱుంగరాదయ్యెఁ గాని దానిచే నానెయ్యుండు దష్టుండు గాఁడయ్యె. మఱియు నిట్లు పెక్కుచోట్ల సంఘటించినట్లు సూనృతపరులగు నరులవలన వినఁబడెఁ గావున నెట్టి జంతువేనియు ననిమిత్తంబుగఁ దనుభృత్తులం బీడింపదని యూహించెద. మానవులు ఘాతుకంబులని చేతనంబుల నెట్టి తలంపునఁ జంప నుద్యమింపుదు రట్లు కరుణను విహింసాపరులగు నరులఁ జూచినప్పుడ దిష్టాంతంబు నొందింప నుద్యుక్తంబులయ్యెడుఁగాని సాహజికంబగు దౌష్ట్యంబునం గామి నిజంబనితోఁచెడు.

కీడుత్పాదిల్లెడు నెడ మర్త్యులు నిరోద్ధపంబగు ప్రజ్ఞావిశేషంబున దానిం దప్పింప నిరపాయంబగు నుపాయంబున నెట్లు ప్రవర్తింతురట్లె గోరులు స్వైరవిహారంబు గోరి బయలుదేరు తఱి నరణ్యభూమి బురోగామియగు యూథపం బొక్క పాదపంబు కొమ్మ దన కరమ్మున బట్టికొని యాపదాపాదకంబులగు గోదంబుల నప్రమాదమ్మున నరయుచు వెరవారం గ్రుమ్మరుచుండుటయు, వెండియు మానవులు దమ కపకారమ్ము సేయు వారికిం దారెట్లు ప్రతీకారంబు సేయుదు రట్లె వలయాకార ప్రదేశంబున దైవ వశంబునం దొలుదొల్తం బ్రవేశించు నేనుంగు ననుగతంబులగు మాతంగంబు లన్నియుంగూడి తమ కుత్పన్నంబయిన విపన్నంబునకుం గారణంబవ్వారణంబ యని దారుణ పాతంబులగు కర దంత ఘాతంబుల దానిం బీనుంగుం జేయుటయును జర్చింప, నయ్యనేకపంబులకుం దగు పాటి వివేకపరిపాకంబు గలదని యూహించెద. ఇట్టి వివేకంబులు స్తంబేరమంబులకె కాదు జంతు సామాన్యంబునకును వివిధంబులయి యథోచితంబులుగ దైవరచితంబులై యుండు నట్లు నా మదికి గోచరించెడు. మనుజేతరంబులగు చేతనంబులకుం దాదృశంబగు వివేకంబు లేదని కొందఱందురు గావున నీయర్థంబునందును యాథార్థ్యంబు దోపం నాకుం దోంచిన నిదర్శనంబులు గొన్ని ప్రదర్శితంబులు గావించెద.

మనుజపోషితంబులగు గిజిగాడులను పక్షులు దమరక్షకు నతి క్షిప్రకాలంబునంప గుఱుతుగొనుచుండెడు. మిగుల మరిగిన యప్పులుగులు దమ పోషకుండెంతనేనిం గూడి యెందేనిం బోవుచుండ నతనితోన యాకసంబున నడతెంచుచు నతండు నిలిచిన యెడ నెందఱుగూడియుండిన నయ్యెంపట నతిక్రమించి యతని మేనియందు వ్రాలుచుండు. తన నేత చేతం బ్రేరితంబయి తన శక్తికనుగుణంబుగం బ్రదర్శితంబగు వస్తు వెద్దియేని ముక్కునం గఱచికొని తెచ్చి యతని చేతికిచ్చుచుండు. ఇ య్యుర్యాల పులుంగెయ్యెడనైన సాధ్యంబయ్యేనేనిం గన్న పదార్థంబు చయ్యనం దాన తెచ్చియిచ్చుచుండు. మఱియు గొన్ని కర్మవిశేషంబులు జరుపుచుండెడు. ఈ ఖగంబులు నగంబులు లోనగువాని యందుం దమకు మందిరంబులుగ శీతవాతాతపవర్షంబుల కెడయీక యచ్ఛిద్రంబులు నిరుపద్రవంబులు దృఢమూలంబులు ననుకూలంబులుగ నిజనైపుణ్యం బనల్పంబుగం గల్పించుచుండెడు నీడంబులు పెక్కండ్రకు నక్కడక్కడ గానంబడకుండవు. కర్మవిశేషంబుల కెల్ల ముఖ్యంబగు గృహనిర్మాణంబు మనుష్యేతరంబులగు ప్రాణులు వీనిపోలిక నిర్మించుట మృగ్యంబు.

మానవులచేతం బోషితంబులగు కపోతంబులు నికేతన జాతంబుల లో నియ్యది యాత్మీయం బనియు నియ్యది యన్యదీయంబనియుం గతిపయదినంబులలోన యెఱింగి కొనియెడు. జనలోచనంబులకు గోచరింపనిపాటి యుప్పరవీథికిం బోవు పాత్రరంబులును రెండు మూండు మాఱులుగ మూండామడలదవ్వు దాంకం గొంపోయి విడువంబడు కలరవంబులును దమ భవనంబు చేరుచుండెడు. కడుపొడవున కుద్గమించి మునుముమ్మ మొయిళ్లలోనం గలసి కొన్నయవి కొన్ని యెన్నండేని భ్రమసి తీరంబగు దూరంబు పాఱుటం జేసి తమ యుక్క దిక్కు నెఱుంగు చొప్పు దప్పి యెందేనిం బోవుచుండెడు. ఇప్పగిదిం దప్పిపోవు నప్పావురంబులలోనం బ్రగల్భతయు జాగరూకతయుం గలవాని రాకగోరి తత్పోషకుండు కొన్నాళ్లు దాంక నెదురుచూచుచుండం గొన్ని మరల వచ్చుచుండు. కొన్ని రాకయుండు. అట్లు వచ్చునవి దమగమియుండు నాలయంబులపై వ్రాలక లాంతి మనుజాలయంబులమీంద దేవాలయాదుల మీందం ద్రియామల యందు వ్రాలి దివంబుల నెక్కుడుపొడవు దివికరిగి పెద్దయుం బ్రొద్దు నలుదిక్కులందిరిగితిరిగి తమయిక్క దిక్కెఱిగివచ్చి చేరుచుండు. కొన్ని దివసంబుల దాంక రాకయుండునవి కరంబు బ్రగల్భంబులయ్యేనేని రేల వ్రాలియుండు నెడల నెవ్వారిచేత నైనం బట్టువడియెనో! బిడాలంబుల పాలంబడియెనో! యెగయు నెడ శ్యేనంబుల కెరయయ్యెనో!

యనితలోఁ బకుండు తలంచుచుండుఁగాని పారావతంబులుండు నికేతనంబుల వ్రాలి తన్నే తలచేత గృహీతంబులయి యుండునని యెంత కాలంబునకేనిఁ దనమనమ్మునఁ దలఁ పోయకుండు. ఇప్పుడు చెప్పిన యప్పావురములకంటె నొక్కింతకొంత ప్రతిభయు జాగరూకతయుఁ గల కలవరంబు ఇయ్యత్తలంబున భ్రమసి దెసచెడి యలసి సొలసి కపోతనివహంబొండు పెఱగృహంబుపై వ్రాలియుఁ జాలఁజాలివఱచి మొట్టికేలకు నయ్యేలిక చేతఁ బట్టువడియెడు. ఇట్టికష్టసాధ్యంబైనదాని నయ్యేలిక దీని విశ్వసింపఁదగ దనుతలంపునఁ నెగయనీక యీఁకలు ఖండించి దానికి జతగూర్చియుంచెడు. రెండు మూఁడు మాసంబుల దనుక నబ్బకదారి యజ్జతతోఁ జేరకుండు. అవ్వల నెవ్విధంబుననేనిఁ జేర యారెండునుం గూడియాడి రెండు మూఁడు విడుతలు గుడ్లిడి పిల్లలంజేసిన పిమ్మట నమ్మితన్నేత యన్నూతన కపోతంబునకు ఖండించిన యీఁకెలు పెఱికి క్రొత్త యీఁకలు పెరుగు నట్లు నేసి యొక్క యేఁటికవ్వల దాని జతతోడం గూడ నలవడిన కొన్ని బాలవత్సంబులఁ గూర్చి నానాఁటికిఁ గొండొక యెగర విడుచుచుండెడు. అదియును గొంత పొడవున కెగయునప్పుడెల్లఁ దొల్లింటి తనయింటికొఱకు నలుదిక్కులుం బరికించుచు నెప్పుడది దనకుఁ జూపడియె నప్పుడ తప్పక వచ్చి యయ్యిల్లు సొచ్చుచుండు. తాను వచ్చుతఱి నిచ్చటఁ బావురంబు లెగయకుండినను నయ్యింటి మీఁద నెవ్వరు లేక యుండినను నయ్యింటిపై నెరఁగి క్రిందికరిగి తన గూడెఱిగి గ్రక్కునం జేరి తనజత యగు మునుపటి బకబారి నెమకి కనుంగొని దానిచేఁత కెంతయు సంతసంబునఁ బోవుచుండు. అదియును దీనిం బొడగని మిగుల గారవించుచుండు. ఇట్లు నేరుతఱి నప్పటిదాని యద్ది నూతనంబుగఁ దోతెంచిన యక్కపోతంబును బొడవ నడఁగన, నా రెండునుం గూడి దీనిం దఱిమి తఱిమి పొడిచెడు. తనఁజోటింబాసి పారావతంబును నిచ్చటఁ బెక్కుదినంబులకుఁగాని పెఱదాని మరుగదు. లాఁతిచేతఁ బట్టువడు మఱికొన్నియొన్ని దినంబులకేని నచ్చటి జతతో గలయదు. గృహీతంబగు నొకానొక కపోతంబు తననింటఁ జేరుచు జతతో నతి త్వరితంబుగఁ జేరి నేరిమి ప్రేమి మిగులఁ గలసిమెలసి యుండి తన్ను నమ్మి యుప్పరమ్మున కెగయవైవఁ దన మందిరంబు దిరంబుగ నెఱింగికొను నందాక నేతకు సందియంబు గదురకుండఁజూపించుచుండు. ఇతరులకుఁ గరగతంబులగు మఱికొన్ని కపోతంబులు గతిపయ దినంబులదాఁక మేఁత సైతము గొనకుండెడు. తప్పిపోవు నిప్పావురంబులలో మగ దానికంటెఁ బెంటియ జంటతో మరగియుంట దుర్లభంబు. తప్పిచను నిప్పులుఁగు మరలఁ దన నెలవు నెమకికొని వచ్చి వ్రాలినప్పు డచ్చో బాలవత్సంబుల సాకతంబు లేక యున్నను నన్నెలవుమీఁదఁ గాలూది మేదినికి డిగ్గి తనతోయంబు గానంబడమి నింటి కెగసి యింటిపైకెంబోయి కొంతదడవు కూర్చుండి పెండియు గగనమ్మున కుద్గమించి యాసదనమ్ముచుట్టుఁ గొంతసేపు గ్రుమ్మరుచుండి క్రమ్మఱ నయ్యిమ్మపైఁ గొండొక తడవు వ్రాలి యాసమాలి వదంపడి తన నూతననికేతనంబున కేతెంచుచుండు. పితెంచిన నయ్యింటు దానిం బెనుచువాఁడది చిరకాలంబుదాఁక రాక మసలుటం జేసి పెండియుఁ గొండొక కాలంబు దాఁక దాని నింగి కెగయనీక యీఁకలు గట్టి వదిలంబుగాఁ బెట్టి యవ్వల విప్పి యుప్పరంబున కప్పుడప్పు డెగురవైచుచుండు. అప్పుడు నప్పావురంబు గతిపయ వారంబులు వచ్చి తన పురాతన నికేతనముఁ దేఱిచూచి పోవుచుండు.

శ్వానమ్ములు దమ్ము నేలు జనమ్ముల విధివశమ్మునఁ బెద్దకాలమ్ము దొఱంగియుండియుఁ దదాకార విలోకన మాత్రమ్మున నభిజ్ఞానమ్ము చేకొనియెడు. ఆకార వికారంబు కతంబుగ సందియంబు నొందెనేని నెలుంగువలన నెఱింగికొనియెడు. ఎలుంగును సంశయాస్పదంబయ్యెనేని, నెలుంగకుండెనేని, నయ్యేలికె చెంతఁ జేరి తదీయంబులగు నవయవం

బుల మార్గముని నిశ్చయించి కొనియెడు. ఈ ఘ్రాణశక్తిచేతన కొన్ని మృగంబులు దాహ్యదచిహ్నంబు తెలిసికొనుచుండు. ఇట్టి గుణవిశేషంబు మనుష్యులయందును నంతయుఁ గనుపట్టదు. మఱియు నీ శునకంబుల వివేకంబు లోకులకెల్లఁ దెల్లంబగుట వలన మిగులఁ బ్రస్తావింపనైతి. ఇట్లు ప్రాణికోట్లలో నొక్కొక్కటికి నొక్కొక్క గుణ విశేషంబెక్కుడుగఁ గానంబడియెడి. భాషాపరిజ్ఞానంబునంజేసి మానవులు సర్వోత్కృష్టులగుట విస్పష్టంబు. కాననవాసులగు మనుజులు భాషాపరిజ్ఞాన హీనులగుటం జేసి పసులం బోలె వావివరుసలు నాచారంబు నాగరికంబును నాలయనిర్మాణంబును లోనగునవి లేక మెలంగెదరు. మానవులకంటె నన్యంబులగు కొన్ని జన్తువులు వివేకశూన్యంబులని తన్నిదర్శనమ్ముగ బాతువులు మున్నగువానిఁ గొందఱు దహరింపుదురు. అది యెట్లనిన జనంబులచేత మనుపంబడు బాతువులు దమ మేఁతకియ్యది దగునది దగనిదియది యని లాఁతిశరీరి రీతి రసనేంద్రియ గ్రాహ్యంబు గాక మున్న యెఱుంగనేరవు. చాపలంబునఁ జూపులకు లోఁబడువాని నోరికబ్బినవాని గొబ్బునఁ జప్పరించి చవిచొప్పడిన, నెక్కుడగువాని మెక్కుచుఁ దక్కినవాని మానుచుండు. మఱియు నల్పయంబులగు క్రిమికీటకాదుల చర్య లరయుట గడు కష్టంబు గావున నవి దక్కఁ దక్కు జంతువులు సాధారణంబుగ నిజగర్భజంబులగు వాని మనుచునెడ నెక్కుడక్కఱ గలిగియుండునట్లు గానంబడియెడు. ఈ బాతు లే తావుననేని నేతఱినేని గ్రుడ్డులిడుటయే కాక కొన్ని వేళల నడుచునప్పుడ గ్రుడ్డులిడుచు నిర్విచారంబులై చనుచుండుఁగాని తిరిగియుం జూడకుండెడు. కావున నా వరటులకు వివేకంబులేమి నిజంబనియెదరు. మదభిప్రాయం బవధరింపుఁడు. మానవులె యున్న విన్నవి గన్నవి గాని నవీనంబులగు పదార్థంబులు నేత్రపాత్రంబులైన మాత్రంబున భోగ్యాభోగ్యవిచారంబు దూరంబుగ నీ బాతుల రీతి సల్పెదరు. మఱియు నిలయంబు విడిచి నడుచుసమయంబ ప్రసవంబునకు సమయంబయ్యేనేని నుచితప్రదేశంబునకుఁ బోవునంత యవకాశంబు లేమింజేసి యనివారణంబుగాఁ బ్రసవంబు మార్గాంతరంబునంద సంఘటిల్లెడు. ఇట్లు సంఘటిల్లుటవలనన కలవారు సూతిమాసంబునకు మున్న కొన్ని దినంబుల నుండి నిజ నివాసంబుఁ బెడవాసి యుండరు. కావునఁ దమ్ముఁ బోషించువారు వెంబడించి తఱుముచుండ గమనించు తఱి నిడిన గ్రుడ్డులఁ జూచుటకుఁ బ్రోచుటకు బాతుల కేచొప్పున వెరవు చొప్పడు? అదియునుంగాక యీ బాతుల జాతియు దైవకల్పితంబ కాని మానవకల్పితంబుగాదు. మానవకల్పితంబ యేని మానిసి వాని వలయునప్పుడెల్లఁ గల్పించికొననేరక తద్బీజంబులనేల సంగ్రహించి కొనుచుండు ! నరులచేతఁ దరతమంబులుగ నుత్తరోత్తరోత్కృష్టంబులగు పాంచాలికాదులు సృష్టంబులయినట్లు లోకానొక మర్త్యునిచేతనే బాతువు లుద్భూతంబులయి యుండునని కొందఱు భ్రమింతురేనిఁ బ్రాణదానంబు దైవాధీనంబ కాని, శరీర నిర్మాణంబు పగిది సాధారణంబు కాదని వక్ష్యమాణంబులగు నిదర్శనంబులచే లోకులకెల్లఁ దెల్లంబగునని యూహించెద; వినుండు. సంగమంబు లేక గర్భోదయంబు గలుగదు. సంగమమాత్రంబున గర్భంబు వొడమదు. సంగమమాత్రంబునఁ జాలగుట నిశ్చయంబేని సకలప్రాణులలో ననేకంబులు వంధ్యంబులయి యెట్టులుండెడు ! నేర్పరులగు నరులీ ప్రపంచంబునందు నానారూప జంతురూపంబుల రచియించెదరు. కాని వానిఁ బ్రాణ యుక్తంబులుగఁ జేయఁజాలరు. గావున నవి ప్రతిమలనియుఁ జిత్తరువులనియుఁ బేర్కొనఁబడియెడు. ప్రాణసహితంబులగు రూపంబులు ప్రాణులని వాడంబడియెడు. కావునఁ బ్రాణదానంబు దైవాధీనంబ యగుటంజేసి మానుషపోషణంబునకు రాకమున్న యీ బాతుల వంశంబు గలిగియుండుట సిద్ధంబు. కాఁబట్టి యట్టితఱి గ్రుడ్డులు పెట్టి వానియందుఁ బిల్లలు

పుట్టి యవి పెరుగు నట్టివిగాఁ జేయునట్టి చాతురి బాతులకు లేకుండెనేని, వాని మానిసి యే వశువునఁ బడయువాఁడు! ఈ హేతువులంబట్టి బాతువులుగాని తక్కుజంతుసంతానంబుగాని వివేకహీనంబనువారి మతంబు భ్రమాత్మకంబని నిర్ణయించెద.

మఱియుఁ జిలుకలు శారికలు మనవలెఁ బలుకుటంజేసి యవి మిగులఁ దెలివి గలవి యను నభిప్రాయంబు గలవారయి కొందఱిందులకు శుకసప్తతి ప్రభృతి కతిపయాస్మదీయభాషాగ్రంథంబులయందె కాక యన్యభాషారచితంబులగు గ్రంథంబుల యందును దత్కథాకథనంబు తార్కాణంబుగఁ జేర్కొందురు. మదభిప్రాయంబట్లుగా దవధరింపుఁడు. వివేక లక్షణంబు బరీక్షించునెడ వీనికంటె నన్యంబులగు జన్తువులయందు వివేకవైశద్యంబు విశేషంబుగఁ గానంబడియెడు. ఈ శుకశారికలు నరులెట్లు వచించెదరట్లు యనువదించెడుఁగాని నైసర్గికంబగు వాచ్యజ్ఞానం బినుమంతయును లేదు. పిల్లివచ్చెఁ గొట్టు మక్కక్క! బువ్వఁబెట్టు! మను నుడువులు, గఱపిన వడువున యెడనెడ నుడువుచుఁ దద్దయు ముద్దులొలుకుచుండెడు. కాని యక్కఱగలయెడ నుడువవు. పిల్లి చేరువం జేరుతఱి సాహజికంబు లగు లపితంబులఁ గేకేయని యఱచెడు. బుభుక్షార్థంబగు వచనంబు దద్బుభుక్షతీఱి యుల్లాసంబు మీఱియుండుతఱిఁ బలికెడు. మఱియుఁ జిరకాలోపలాలితంబయ్యును గీరంబు పంజరోపలాలకుల నేకాలంబున సామాన్యంబుగ గుఱుతెఱుంగలేక యనికియ కాక విశ్వాసంబు గలదియుంగాక యుండెడు. దీర్ఘకాలంబుగఁ బెంపఁబడు కీరంబేనియు విడువంబడునెడఁ గానంబడు తనజాతి పులుఁగుల వెంబడింబఱచి పోవుచుండెడు. మానుషభాషాభ్యాసనంబున కుచితంబగు నవయవసౌష్ఠవమాత్రం బీకీరశారికలు లోనగు కొన్ని పులుఁగులకుఁ గలిగియుండునని యూహించెద.

తదనంతర కథావిధానంబు వినుండు. కొండడిగ్గి వచ్చి నానామండలంబులకుంజను మనుజమండలికి వలయుతఱి పోటుపాళియంబునఁ గంచరంబులు సన్నద్ధంబులయి యుండుటు లరుదు. మానవులను సామానులను దెచ్చి పోటుపాళియంబున డించి మరలియరుగు శకటంబుల సమయంబు కొలఁది వలయునన్నిఁటి నచ్చటి కొత్తవాలు నిలిపియుంచుటయె కాక మిక్కిలి యక్కఱగల యెడలఁ గోయంబుత్తూరినుండి బండుల రప్పించి తెరువరులకు వైతసికములుగ నిప్పించుచుండుఁగావునఁ జెన్నపట్టణంబునకంటె నచ్చట నద్దె యెక్కుడు. అక్కడనుండి చెన్నపురంబునకు వచ్చుటకుఁ గంచరం బొక్కటికి నిరువది నాలుగు రూపాయలు వేతనంబు నిర్ణీతంబయి యుండెడు. నన్నుంబోలె నీలశైలంబునకు వచ్చిన యుద్యోగస్థు లనేకులకె కాక యింగిలీషు దొరల సామగ్రులు గొంపోవ నేకకాలంబునను, యనేక శకటంబులు వారివారికిఁ గొత్తవాలు సమకూర్పవలయుటఁజేసి రెండు దినంబు లచ్చోటు నుండితి.

ఇరువది తొమ్మిదవ తేది మేదినీకుమారవారంబున రాత్రి మూఁడు ఘంటలకు పోటుపాళియంబు నుండి బయలుదేఱి యన్నూరికి మఱునాఁడు పవలు పదిఘంటలకు నరుగుదెంచితి. నేను పోవునెడ నచ్చోట నిర్మింపుచున్న ధర్మశాల యప్పుడు ముగిసె.

ముప్పదవ తేది మధ్యవార నిశామధ్యంబున నన్నూరు నిర్గమించి ప్రొద్దుదయించిన గడియకు నవినాశి డాసి తద్దేశంబున భాసిల్లు ప్రాసాదంబునకు నా సాయంసమయంబునం జని తదావాసియగు నవినాశీశ్వరుండును దత్ప్రాణేశ్వరి యగు బృహత్కరుణాంబికయుఁ బునర్దర్శనం బొసంగుటకు హర్షం బెసంగ సర్వాంగసంగతోర్వీతలంబగు ప్రణామం బాచరించి భయభక్తులు నివ్వటిల్ల నర్చనలొనర్చి వారి సేవించితి.

ముప్పదొకండగు తేది గురువారంబు త్రియామ సంతిమయామంబున నాక్షేత్రం బుననుండి కృతప్రయాణుండనయి చెంగపల్లి దాటి మఱునాటి మధ్యాహ్నంబునకు విజయమంగళంబను గ్రామంబునకు వచ్చి యచ్చో నొక్క దేవేరి దేవళమ్మున నోగిరమ్ము వేగిరమ్ముగఁజేసి కొని యయ్యపరాహ్ణంబునం దరలి, తరణికిరణంబు లంతర్ధానంబు వహింప నరుణప్రభాపరంపర వరుణదిశాలంకరణం బొనరింపఁ బెరుందొరెం బొడగాంచితి. చెంగపల్లియకుం బెరుందొరెకు మధ్యగతంబగు విజయమంగళంబు మున్ను నే విడియనితలంబు. మఱియు నదియు విజయపురియనియుఁ బేర్కొనఁబడియెడు. అయ్యూర నొక్క యగ్రహారంబునం గంపెని వారి సత్రశాలయుం గొన్ని యంగడులును హరిహరుల నిలయంబులుం గలవు. హరి పేరు కరివరదరాజు. హరుని పేరు నాగేశ్వరుండు; గౌరి పేరు విజయపురీశ్వరి. అక్కడఁ గల యాహారపదార్థంబు లెల్లప్పుడు నప్పురిం జొప్పడవు. ఆ దినంబున నార్ద్రాదర్శనోత్సవంబగుటం జేసి యా విభావరిం బెరుందొరెయందు వెలువడిన వేదనాయకీచోళేశ్వరుల దర్శించితి. వేయు నెనమన్నూట నలువది యేడవ వత్సరంబు జనవరి నెల మొదలి తేది భృగువార తమిస్ర నొంటి ఘంటకుఁ బెరుందొరెఁ దొలఁగి తెరువునం గల యాగోడను గావేరియు దాటి యా తటిని యావలి తటంబునం గల పళ్లిపాళియంబు మఱునాఁటి పవటి ఘంటాదశకంబునకుఁ జేరితి. నేను బోవునప్పటికంటెఁ గావేరి నీరంబు తోరంబుగఁ బాఱుచుండుటం జేసి నేను నాతోడివారు నయ్యేఱు పడవ లెక్కి కడచితిమి. మున్ను నే విడియని పళ్లిపాళియం బనునది గొప్పది. దానికొక్క గొప్పపేటయుంగలదు. గొఱియ మెఱచి దక్కఁ దక్కు వస్తువులు సాధారణమ్ముగ నమ్ముచుండెదరు. ఆయెడ నేయి వర్తకమ్ము సేయు లబ్బెవారు మిగులం గలరు. అందుఁడియ యాజ్యంబు ప్రాజ్యంబుగ వాణియంబాడికి నిచ్చలు వచ్చుచుండు. వాణియంబాడిం గల సార్థవాహులు దాని ననవరతంబుఁ జెన్నపురికిం దెచ్చి విక్రయించెదరు. ఎంగిలీషువార విడిదియె కాని సత్రంబు గానంబడదు. కావేరీ తటంబునం దనరు విశంకటపటువిటపి క్రింద విడిసి భోజనకృత్యంబులు దీర్చికొని యా రేయి యెంగిలీషువారి విడిదిం బరుండితి. పెక్కు నెలలుగ మాకెక్కడఁ జిక్కని చొక్కపుఁ దమ్ములపాకు లచ్చటఁ జిక్కె.

రెండవ తేది శనివారంబు రేయి రెండు ఘంటలకు నప్పళ్లిపాళియంబునుండి పయినంబై యపర దినంబున ఘంటా నవకంబునకు శంకర దుర్గంబునకు విచ్చేసితి. అచ్చట సత్రంబు లేకుండుటఁ జేసి కంపెని వారొకండు నిర్మింపఁ దలంపు గలవారై సాలంబులు దూలంబులు లోనగు పరికరంబులు నేకరించియున్నవారు. మా కంచరంబు వహించిన బలీవర్దంబులలో నొకండు దుర్బలంబు గావునఁ దొలి దినంబు దక్కఁ దక్కు దినంబుల నక్కడక్కడ నొక్కతడవ రెండు తడవలు తెరువున నడచుచుఁ బడుచుఁ బడంబడి కొంత వడికి లేచుచు వచ్చుచుండె. నాఁడు నద్దుర్గంబునకు గడియమేర గల మార్గంబున వచ్చుచుఁ గ్రచ్చఱఁ బుడమిం బడి యొండె యెన్ని చందంబులఁ దోఁక నులిమిన బలిమి నెత్తిన మొత్తిన బొత్తిగ నాశొకటంబు రెండుఘటికలదాఁక నుత్థితంబు గాకయుండె. ఆవల నెట్టకేలకు లేచి మెల్ల మెల్లఁగ నడచి యా శంకర దుర్గంబుఁ జేరె. ఇట్టులయ్యెద్దువలనం దద్దయు గమనంబున కంతరాయంబు సంఘటిల్లుటం జేసి యా శకటంబు నచ్చటు విడనాడి నేలంబునకు రానంతు నొక్కబండి నేలంబుదనుక నమర్చికొంటి.

మూఁడవ తేది సాదివారమ్ము నక్తమ్మునఁ దొమ్మిది ఘంటలకు నాయనుచరవర్గంబు తోడ నా దుర్గంబు నిర్గమించి మార్గంబునఁ గాకాపాళియంబుదాఁటి మఱునాటి పూర్వాహ్ణంబున ఘంటాష్టకంబునకు నేలంబుడగ్గఱితి. ఆరోడున నేలంబునఁ దోఁటంబుగ వరిపైరు సమృద్ధమై కానంబడియె.

శంకర దుర్గంబునుండి రొక్కి వచ్చిన బండికి నా స్వదేశప్రవేశం బవధిగ నామడకర రూపాయ చొప్పున నేనొప్పుకొని నేఁడునుండి నాలవ తేది సోమవారంబు రేయి నాలుగు ఘంటలకు బయలుదేరి చారి నోమలూరి దాఁటి మరునాఁటి మధ్యాహ్నంబున నొక్కయుప వనంబున విడిసి కతిపయభక్ష్యంబుల బుభుక్షోపనోదనంబు గావించి యోదనంబు నేఁత యుజ్జగించి తోడన పయనంబయి యాయనంబునఁ బూజారిపట్టియను కొట్టికఁ గడచి ఘంటా పంచకంబునకుఁ దోప్పూరిఁ జేగినాఁడ. తోప్పూరి చేరువఁ జాలిలమోకంబుల యాసప్లవంబ కాక చోరుల యుపద్రవంబును దద్ద యగుటంజేసి ప్రొద్దుపోవకమున్న తోప్పూరు చేరు తలంపున నాఁటి పవలు వంట యొనరింపకుంటి సంభవిల్లె. నేలమున కీవల నాలుగుమ్మాప్పాతిక పరక (౮౪౭) తోను మీరగల రోమలూరను నూరు మున్న నే నిరవుకొన్నదిగానిది. అయ్యది చిన్నది. దాన నెంగిలీషువారి విడిదియు సత్రంబును గానంబడియెడు. వలయు సామాన్య వస్తువులు వ్యాగ్యంబులు.

అయిదవ తేది; అంగారకవారము పూర్వరాత్రచతుష్కంబున కవ్వాలఁ దోప్పూరు విడిచి కనుమరొక్కి కడచి యదమాన్కోటకు నేదిష్టంబగు చోట బాట నొక్క తెరువు సీడం బదునొకండగు ఘంటకు విడిసి వంటకంబు చేసికొని రెండు ఘంటలకు వెడలి నాలుగు ఘంటలకు ధర్మపురిం జేరితి. కనుమదిగ్గునెడఁ గలుగు వలజడి యెక్కునెడఁ బండ్లకు లేదు. భారంబులేని కంచరంబులు సుకరంబుగ నారోహించెడు. ఆరోహించునెడ మనుజులు శకటంబుల పయినుంచుటవలనం గీడు గానంబడదు. నేను బోవునప్పుడు విడిసిన బాటకుఁ గొండొక దవ్వుననుండు చెరువుకట్టు దక్క నదమాన్కోటయందుఁ బచనోచితంబగు స్థలంబు దొరకొనమింజేసి తెరువున నిలువనయ్యె. నీలగ్రావంబునకు మేముపోవుతటి నిట్టి దినంబున కుదకమండలంబుఁ జేరునట్టులు మే మందఱము ననుజ్ఞాతుల మగుటం జేసి, యోచెరి చేరిక నాలుగే నాఫీసుల వారము చేర యా యా యాఫీసుల సామగ్రులం బూనివచ్చిన కంపెని బండ్ల సాహాయ్య బలంబునఁ ద్రోవ నావంతయయిన భీతి లేక నిర్దిష్టదివసంబునకు ముందె పోయి చేరితిమి. వచ్చుచో నట్టి యనుజ్ఞ గల్గమి నేను నా సహవాసుండును మఱి యిద్దఱు సహాయులు నుదకమండలంబున నుండి కొందఱకు ముందుగఁ బయనంబగుటయె కాక సత్వరంబుగ స్వదేశప్రవేశం బభిలషించి నిరంతరప్రయాణంబుల నరుగుదెంచుటం జేసి మమ్ము ననుగమించిన మా యాఫీసులయు మఱియు రెండాఫీసులయు బండ్ల సహాయంబు వలన నేలంబుదాఁక వెఱపు లేక నిశాకాలంబుల బయలుదేఱుచుంటిమి. ఆ బండ్లు లొండొంటికి నాలుగేసి వృషభంబులు కాక యనుచరంబులగు వృషభంబులు గొన్నియుఁ జోదకజనంబులుం గలిగియుండె. ఆ కంచరంబుల నడిపించువారు వేగంబ చెన్నపురంబుఁ జేరినఁ జేరినవాసరంబుదాఁకనె బత్తెంబు గొనువారు గావున సత్వరయానంబు నిష్ప్రయోజనంబని గోమలూరఁ దడసిరి. మా సవారి బండులు రెండు దక్క వేఱొక్కటిక్కు మాకుఁ జేకూరకుండె. విభావరుల నరుగు తఱిఁ బెఱతెరువరులు తోడుగోరి మాయిఱుత నరుదెరఁ గారణంబులుగ నుండిన కంపెని బండ్ల బాసట మాకు లేకపోవుటంజేసి పెఱబాటసారుల బాసట మా కాసపడ వలసివచ్చెఁ గావున నా ధర్మపురి చెంగట నొక్కబయల నుత్కటంబుగ విడిసియున్న శకటంబుల కుఱంగట మా శకటంబుల విడియ నియమించి యక్కడన యొక్క చెట్టు క్రింద నొనరించిన యోగిరంబొక్కమఠంబున హితసహితంబుగ భుజియించి యంద శయనించితి.

ఆఱవ తేది రాతిరి నీరాటు ఘంటలకు నా ధర్మపురంబునుండి యా కంచరంబుల తోడ నిర్గమించి మఱునాఁడు వేఁడివెలుంగులు గలవాఁడు పొడిచిన యయిదు గడియ

లకు నిరుమత్తూరికిఁ జేరికఁబాఱు కల్లారుకడ నఱుతఁ దోతెంచిన సకటంబులు మిక్కుటంపు బరువుగలవి గావునఁ దచ్ఛేదకులు గొందఱుచేరివాని నొక్కొక్కటిగ నా యేటిని దాటించుటం జేసి కొండొక కాలయాపనంబు గలిగె. ఇరుమత్తూరి సత్రంబునకుఁ బార్శ్వగతమ్మగు నొక్కయమ్మవారి గుడిగెడఁ గుడుపు గొని యందుండి పదిరెండు ఘంటలకు పయనంబయి యయనంబునఁ బెన్న దాఁటి యిరుమూఁడుగంటలకు మత్తూరు సేరితి. అప్పుడప్పెన్నలోఁ జీలుబోడల బంటి నీరు పాఱుచుండె. మత్తూరి యభ్యర్ణంబున విస్తీర్ణంబగు తాళవనంబు ఘనంబుగఁ దనరుచుండు అవ్వనంబున నిశీథినులఁ బథికుల కదిక భయజనకంబయియుండు. అయ్యూరు మున్ను నేనెలవుకొన్నది గానిది. కొండొక చిన్నది. ఇంచుక పెచ్చు లొచ్చుగ ముప్పదియిండ్లు మూఁడంగడులుంగలయది. దానఁ గొన్ని విప్రనిలయంబులు గానంబడియెడు. ఉప్పును బప్పును బియ్యంబు లోనగునవియు మఱియు నారికేళ కదళీ ఫలంబులు శుష్కమీనంబులు నొకానొక తఱిఁ బచ్చిమీనంబులు దొరకెడు. సత్రంబు లేదు. ఎంగిలీషువారికి విడిదియు ముసాఫరుఖానా యను నొక మండపంబు నుండెడు. అయ్యూరఁ బ్రతి శనివారంబు సంత.

ఏడవ తేది సురగురువారంబు రేయి పహరా చతుష్టయంబున మత్తూరినుండి వెడలి రెండు జక్కరలుత్తరించి యపర దివసంబున ఘంటికాదశకంబునకుఁ దిరుప్పత్తియూరిం జేరితి. అచ్చో ముసాఫరుఖానా యనంబడు నొకజనాశ్రయం బాశ్రయంబుగా నుండితి. బ్రాహ్మణాదుల కుచితంబులుగ రచితంబులగు భవంతులు గలిగి యయ్యూరఁ గాఁపుగంబుండు నొక్క సెట్టిచేఁ గట్టింపఁబడిన ధర్మసత్రంబొక్కటి యక్కడఁగలయది. దాని నెన్నఁడేని నధ్వనీనులకుపయోగింపనీక న్యాయంబు లేక యిచ్చటి తాలుకు కచ్చేరి యుద్యోగస్థులగు విప్రు లాక్రమించికొని యున్నవారు. కాన నేను నానెచ్చెలికాఁడు నన్ననుగమించిన మఱియొక యాఫీసు లేఖకుండును జేరి యయ్యనుచితకార్యం బెంగిలీషు భాష లిఖియించి ఈ జిల్లా కలెక్టరగు మేష్టర్ లాక్ హార్టు గారికి నంచెలలోఁ బంపితిమి.

ఎనిమిదవ తేది దైతేయగురువారంబు నడికి రేయి కొండొకబండులంగూడి తిరుప్పత్తియూరినుండి ప్రయాణంబయి పాలేఁటిని దాఁటి వాణియంబాడి నతిక్రమించి వెండియు రెండుచోట్లం బాలేఱుత్తరించి యామూరుపేటకు మఱునాఁటి పట్టుపవలు వచ్చితి.

తొమ్మిదవ తేదిఁ గాళవారమ్ము రాత్రి వేళ నొక్కఘంట కక్కడనుండి వెడలి పచ్చకుప్పం బను గ్రామంబును, దోటాళంబును, నగరమేటిని న్దాఁటి మరునాఁటి పవలు తొమ్మిది ఘంటలకుఁ బల్లికొండకుఁ జేరితి. తోటాళంబు మున్న గన్నది గానిది. అయ్యది నలువది యేఁబది సదనంబులును బణ్యవీథికయు సత్రంబును నెంగిలీషు తెరువరుల నివాసస్థానంబును గలయది. అధ్వన్యుల కావశ్యకంబులగు సామాన్యవస్తువులెల్ల సాధ్యంబులగుట యరుదు. ఆ తోటాళంబునకవ్వల (అఱు) రెండు ముక్కాలు కోసు దవ్వునఁ బచ్చైకుప్పంబున్నయది. ఈ గ్రామద్వయ మధ్యంబున విభావరులఁ బాటచ్చరుల యుపద్రవంబు గలిగియుండు.

అస్పృష్ట దురిత లేశంబగు పల్లికొండయను పావనప్రదేశంబు మరలఁ బ్రవేశించుటయు రంగనాయకీ మనోనాయకుండగు రంగనాయకుండు పునర్దర్శన ప్రదాయకుండగుటయుఁ బురాకృత సుకృత పరిపాకవశంబునంగదా! యని చిత్తమ్ము సమ్మదాయత్తమ్మగుచుండ నద్దేవళోత్తమంబునకు సుహృత్తము తోడం జని యత్తఱి నుత్సవార్థంబు తిరువీథుల వేంచేసి వచ్చి యొక్కమండపంబున డోలాఖట్వంబున నివసించియుండు శార్ఙ్గధామునకు దండప్రణామంబు లాచరించి, యంతర్గృహంబున కరిగి యుత్తర రంగ

నాథున కెరఁగి యావల రంగనాయకికిం జేమోడ్చి యథోచితార్చనంబులు నేయించి మఱియు నద్దేవమందిరంబునందె యభినందనీయ గుణగణాభిరాముండగు రఘురాము నకుం బ్రణమిల్లి సముల్లసత్స్వభావరోచిష్ణుండగు శ్రీకృష్ణున కంజలియొనర్చి యయ్యెడల నర్చకదత్తంబులగు తీర్థప్రసాద శఠగోపంబుల సవినయంబుగఁ గైకొంటి.

పదియవ తేదిఁ దపనవారంబున నపరాహ్ణంబునఁ బల్లికొండనుండి కృతప్రయాణుండ నయి కొండొక యెక్కువ తక్కువ మూఁడు కోసుల మార్గంబునం దనరు విరించి పురం బరుణుండు వరుణుంతుండు దెస మఱుఁగువడు నెడఁ జేరినాఁడ. మార్గంబున కుత్తరంబుగ నర పరుగు మేర నవ్విరించిపురంబు దనరారుచుండు; నవ్వూరంబున నొప్పారు పురిహరుం జూడ వేడుకపడి యయ్యెడకు రానయ్యె.

కాంచీపురిఁ గాంచనాంబరుఁగూర్చి కాంచన గర్భుండు మున్ను జన్నంబొనరించిన విధంబు ప్రథమ ప్రకరణంబున వివరించినాఁడ. నాఁ డయ్యజ్ఞశాలకు విరచించిన చతుర్ద్వారంబుల నొకండు విరించిపురం బను పేరం బెంపారె. ఇరంజిపురం బని ద్రావిడంబున నది వ్యవహరింపఁబడియె. అది విశాలంబగు వీథులచే, నిశంకటంబులగు మంటపంబులచే, విశ్రమ పాత్రంబులగు సత్రంబులచే, విపులంబులగు యవన దేవభవనంబులచే, విమలతర కృపీటంబగు తటాకంబుచే, విప్రప్రభృతివర్ణ నిలయంబులచే, వివిధంబులగు విపణి ప్రకరంబులచే, వినాయక సేనానాయక ప్రముఖ ప్రాసాదంబులచే, మనోజ్ఞకంబు నాపాదించుచుండు. అందు సమున్నత ప్రాకారంబగు నొక్క దేవాగారంబు దైవాఱు. దాన మరకతవల్లియను దేవీమతల్లికి మనోవల్లభుండగు మార్గసహాయ సమాహ్వాయ భర్గుం డపవర్గమార్గానుషక్త నిజభక్తుండును నిరర్గళ మహిమాభియుక్తుండును స్వయంవ్యక్తుండు నగుచు దేజరిల్లుచుండు. ఆ దేవీ మహాదేవులకు నిత్యోత్సవ వారోత్సవ పక్షోత్సవ మాసోత్సవ ప్రముఖ నిఖిల మహోత్సవంబులును, మత్స్య మాసంబున బ్రహ్మోత్సవంబును బ్రవర్తిల్లెడు. మఱియు మరకతవల్లీ దేవికిం బ్రతిప్రాలేయకర దైతేయగురువారంబుల నిజాలయ పార్శ్వవీథీ ప్రదక్షిణీకరణంబునుం గలిగియుండెడు. ఆ దివ్యస్థల మాహాత్మ్యంబు దచ్ఛ్రోతవ్యులచేతఁ జేతోవగతంబగుట కనుకూలంబగు కాలంబు సమకూడదయ్యె. అయ్యాలయంబున కరిగి మార్గసహాయేశ్వర లింగంబునకును మరకతవల్లీశ్వరికిని బిల్వకుంకుమార్చనలొనర్చి నైవేద్యారాధనలు సమకూర్చి భయభక్తులతో భజియించి యుప్పరికించు రుద్రాక్షంపు చప్పరంబున నప్పార్వతితో నొప్పారు నుత్సవబేరంబు దర్శించి, యంతఃప్రాకారంబునఁ బరిఢవిల్లు నాదికేశవు సేవించి యాదేవునకావల విలసిల్లు తమ్మిచూలికిం గేలుమోడ్చి మఱియు నచ్చటచ్చటం గల విఘ్నేశ్వర నేసేశ్వర నందీశ్వర చండీశ్వర ప్రముఖులగు పరివార దేవతలకెల్ల బహువారంబులు జైవారంబులు నేసినాఁడ.

ఆ రవివారవిభావరి పూర్వరాత్రయంబున విరించిపురంబు విసర్జించి యించుకమించుగ నాలుగు కోసులమేరనుండు వేలూరు రపరదినంబున పదునొకండవతేది నిందువారంబు నుదయ సమయంబునందుఁ జేరినాఁడ. వేయి నెనమన్నూట నలువదియాఱవ వత్సరంబు నక్టోబరు నెల నిరువదవ తేదిఁ జెన్నపట్టణంబునం గొట్టిన బిట్టుగాలివాన విరించి పట్టణంబుదాక వ్యాపించె. నేను వేలూరు సేరునాఁటికి మూఁడవనాఁడు వచ్చు పసుల పండుగకు నిజావాసస్థలంబు నధిగమింపవలయునను తలంపు పొంపిరివోవ వేలూరం గుదిర్చికొన్న బలవద్బలీవర్దంబగు శకటం బొకటి సన్నద్ధంబగుటకు మున్న నాకుం గలిగి యున్న సామగ్రుల తోడ నా మునుపటి శకటంబును బరిచ్ఛదంబును నభిచరులకు వశం వదంబులుగ ముంబడిఁ బుత్తెంచి నేను నా నెచ్చెలికానిం గూడి నాఁటి పవలొక్క

ఘంటకు నూతనశకటంబు నెక్కి తరలి పాలేరు దాటించి యీవలి కూలస్థలిం గల తెంగాళను కొట్టికయు రాణిపేటయుం గడచి సాయంసమయంబున వాలాజాపేటయను పేరుగల గొప్ప యూరు సేరి యారేయి హెచ్చారాత్రియోగంబునకు నందుండి పయనంబయి రూ చేరయు వాలిసెట్టిసత్రంబును నతిక్రమించుచు మఱునాఁడు పదిరెండవ తేది మేదినీతనయవారంబు పట్టపవలు రాయాజి సత్రంబు చేరితి.

మున్ను జటాయువను పులుఁగు నెలవుకొన్న నెలవగుట ద్రవిడంబునఁ దిరుప్పుళ్ళుకుడి యను నొక్క కొటిక వాలిసెట్టి సత్రంబు నికటంబునం గలదు. ఆ గ్రామంబు గించి న్యూనాధికత్రింశద్ధామంబులును బంచదశాపణకంబులును సతటాకంబును నై యొప్పుచుండు. అయ్యూర విజయరాఘవదేవుని దేవళంబొండు గలిగియుండెడు. దాని పూర్వ దక్షిణంబున సరసికి సరస జటాయువను పక్షినాయకు నికాయ్యంబున్నయది. వందారు జనమందారుండగు దశస్యందనుండు దశస్యందననందనుఁడయి రామనామాభిరాముండును సమస్త సుగుణధాముండును సమాచరితతాటకాహననుండును విరచిత కుశికసుతసవనావనుండును మునియోషాదోషాపనోదనచణచరణుఁడును ప్రకటితశివశరాసనశకలీకరణుండును జనకతనయానయనకువలయహిమభానుండును దూరీకృతదుస్సహప్రతాపాగ్నిజమదగ్నిసూనుదురభిమానుండును నై జనకాదేశంబున విపినప్రదేశంబున జనకజానిజానుజసహితుండయి సకలతాపససహితుండయి విహరించుచు నక్కడక్కడ రక్కసులఁ బెక్కండ్ర సంహరించుచు నుద్దండవేదండ పుండరీక భేరుండ చండ శరభ గండకాదిక మృగమండల శరణ్యంబగు దండకారణ్యంబున నివసించియుండ, శూర్పణఖా కర్ణనాసాచారణంబు కారణంబుగా దారుణంబగు రణంబున ఖరదూషణాదిమారణంబు విని విధిప్రేరణంబున లోకవిద్రావణుఁడగు రావణుండు రాఘవప్రతారణపరాయణుండై తాపసభూమికాధారణంబున సీతాపహరణంబొనరించి గగనంబున నరుగ నెఱింగి జటాయువను పక్కి యోఁడా రెక్కలను నుక్కున నెదిర్చి పేర్చి ఖరనఖర చంచూవిదళనంబునఁ దదీయగాత్రంబు రక్తసిక్తంబు గావింప సైరింపక యన్నిలింపవైరి కసిమసంగి కరాళంబగు కరవాలంబున నెఱకలు నఱికి యఱికినఁ బుడమిం బడి కంఠగతప్రాణుండయి యుండ సానుజుండగు దశరథాత్మజుండు నిజయోషాన్వేషణవశంబున నచ్చటికి వచ్చి నిజజనకసఖుండగు నా పక్షిప్రముఖుఁ గాంచి మిగుల దుఃఖించి సీతోదంత కథనానంతరంబ యసువులు దొఱంగిన యవ్విహంగపుంగవు సంస్కరించి గాడ్పుచూలి నాదరించి మైత్రి మైంతిఁ గాంచి వాలి నొక్క కోలఁ గూలనేసి వనచరసేనాసాహాయ్యంబునం జేసి వారాశిఁ గట్టి పౌలస్త్యుం దొట్టి యాతుధానావలిం గొట్టి విభీషణునకుఁ బట్టంబు గట్టి కళంకాపేతయగు సీతం జేపట్టి సాకేతంబున కేతెంచి పూజ్యంబగు సామ్రాజ్యం బనుభవించి మించిన జానకీజాని పరమాద్భుతంబగు చరితంబు లోకవిదితంబుగదా! ఆ రాఘవుం డనుకంపాతిశయంబున సంపాతి సోదరుండగు నజ్జటాయువునకు నక్షయ మోక్షపదం బొసంగిన పుణ్యస్థలంబ యీ తిరుప్పుళ్ళుకుడి యని విన్నాఁడ.

రాయాజి సత్రంబునఁ గొండొక వెచ్చలొచ్చఁగఁ బంచాశత్పదనపంచదశాపణంబయిన యొక్క కుప్పం బొప్పారు. దాన యూరోబ్దేశవాస నివాససత్రశాలలు గలవు. నీలశిలాఘటిత సోపానజాలంబును విశాలంబు నగు నొక్క చక్కని కొలం కక్కడఁ గలిగియుండెను. ఆ యూరోబ్దేశవాస నివాస సత్రశాలాకాసారంబులు రాయాజి నామక విప్ర నిర్మితంబులు. ఆ గ్రామంబున నొక్క యామంబునఁ బాటకూలి యిచ్చి భుజియించి యా పవలు రెండు ఘంటలకు వెడలి యుష్ణధాముండు ప్రశాంతధాముండయి పశ్చిమాభిరాముండగు నెడ రామక్కసత్రంబు సేరినాఁడ. రాయాజి సత్రంబు

నకు రామక్క సత్రంబునకు నొక్కింత కొలంతగ నాల్గు కోసుల కొలఁది గలదు. రామక్క సత్రంబుకడ జలాశయం బొండును రెండంగడులును రెంపు మూఁడింపులును నుండె. రాయాజి యనుజ యగు రామక్కయను నొక్క పుణ్యవతిచేత నా సత్రశాలాకాసారంబులు విరచితంబులయ్యె. నిరంతర ప్రయాణంబుల నరుదెంచుటం జేసి వేలూరి కీవలం గల సంవసథంబుల తెలంగెలింగికొనుటకుఁ దగిన యవకాశంబు గలుగ దయ్యె. ఆ రేయి యచ్చోట నొక్కపూటకూడుల భాగ్యశాలిని కూలికి నిడిన కూడు గుడువంజాలక పులియతోడు బాలన్నైచి లేచి, నా కడనుండిన పిండివంటకంబుల నాఁకలి కొండొక యుపశమించికొని కొన్నిగడియ లక్కడ శయనించి యర్ధరాత్రంబున నా సత్రంబు విసర్జించి భూతపురాపర నామధేయంబగు శ్రీపెరుంబూదూ రతిక్రమించి పలు వాతం గొంతదవ్వు గమనించి త్రోవ నొక్కతావునఁ గంచరంబు డించి కొంతప్రొద్దు విశ్రమించి కొండొక భక్ష్యంబులచే బుభుక్షఁ నడంచి యందుండి నిర్గమించి పూవిరుంద మల్లి నుత్తరించి యా దివసంబగు పదుమూఁడవ తేది బుధవారంబున నిరువదినాలుగు గడియలకు ముదితహృదయంబుతో నిజావాసదేశంబగు చింతాద్రిపేట సొత్తెంచి గ్రామాధిదేవత యగు నాది పొన్నమ్మదేవళమ్మున కరుదెంచి సముచిత వినయ భయ భక్తి సంయుక్తి నాదేవి సేవించి యేను నా సహవాసుండగు శ్రీనివాసమొదలారియు నిజనివాసంబులు ప్రవేశించి బంధుమిత్రాదులం గాంచి సంతసించితిమి.

సీసమాలిక—

సీ. సకలచరాచర సమితికాధారమై
యమరు నీ భూమండలమున నెల్ల
కాలంబునఁబవళ్లు రేలు సమానంబు
లై యొప్పనెయ్యెడ నయ్యదియె ని
రక్షప్రదేశంబననియు విష్కంభరే
ఖయ యని విఖ్యాతిగనియె నా ని
రక్షప్రదేశంబ యాదిగ సరియుత్త
రాశఁ ద్రయోదశాక్షాంశములును
నలు కళలష్టవికళల దూరమునఁగ
ల్గెడు పూర్వపశ్చిమ లేఖయందు
వినుఁడు గంగా మహాద్వీపవతీ తట
ప్రాంచిత కాశికాపట్టణమున
నంబుజ బంధుఁడుచ్చంబునయందుఁగా
నంబడు వేళకనంతరమున
నిరువదియును నేడు వరయును బరకవి
ఘటికకుచ్చమున నెచ్చటను గాన
బడదు నచ్చటఁగడు పొడవగు రాజధ్వ
జముగలదై యుత్తరమునయందు
బంగాళ దేశం బవాచిని గన్యాకు
మారియు ప్రాక్పశ్చిమముల వాధి

నిధులు మేరలుగాఁగ నెలకొన్న ధారుణీ
రాజ్యములకు నెల్ల రాజధాని
యై సకలాంతరీపాంతర దేశాంత
రాగత వివిధజనాలి సంకు
లంబును రమాస్పదంబును లసితహర్మ్య
రమ్యమును నగు చెన్నపురంబునకును
ప్రాంతమందున దక్షిణపశ్చిమమునఁ
దనరు మద్రాసభూమి చింతాద్రిపేట.

టీక. సకలచరాచర సమితికాధారమై యమరు నీభూమండలంబున. సకలచరాచర సమితికిన్ = సకల జంగమ స్థావరసమూహమునకు | ఆధారమై = అధికరణమై. అమరు = ఒప్పునట్టి | ఈ భూమండలమునన్ = ఈ భూస్థలమందు | ఎల్లకాలంబును | బవళ్లు రేలు సమానంబులై యొప్పు నెయ్యెడ నయ్యది యా నిరక్షప్రదేశంబనియు విష్కంభరేఖయనని విఖ్యాతిఁగనియె. ఎయ్యెడన్ = ఏ ప్రదేశమందు | పవళ్లు రేలు = అహోరాత్రములు | ఎల్లకాలంబును = సర్వకాలంబునందును | సమానంబులై యొప్పును. = ఇంచుమించు లేక సమంబులై యుండునో | అయ్యదియా = ఆ ప్రదేశమే నిరక్షప్రదేశంబనియున్ = నిరక్షస్థలమనియు | విష్కంభరేఖయనని = విష్కంభరేఖయనియును | విఖ్యాతిగనియెను = ప్రసిద్ధిబొందెను. | ఆ నిరక్షప్రదేశంబ యాదిగ సరియుత్తరాశ త్రయోదశాంశములును నలుకళలష్టవికళల దూరమునఁ గల్గెడు పూర్వపశ్చిమరేఖయందు | ఆనిరక్షప్రదేశంబ యాదిగన్ = అట్టి నిరక్షస్థలంబ మొదలుచేసి | సరియుత్తరాశన్ = చక్కని యుత్తరదిక్కున | త్రయోదశాంశములును నలుకళలష్టవికళల దూరమునన్ = పదుమూఁడుడిగ్రీభాగంబులును నాలుగు కళలును ఎనిమిదివికళలవఱ్ఱకు | కల్గెడు = కలుగునట్టి | పూర్వపశ్చిమరేఖయందున్ = తూర్పు పడమర రేఖయందు ॥ వినుము గంగా మహాద్వీపవతీతట ప్రాంచిత కాశికా పట్టణమునన్ | వినుము = ఆలకింపుము | గంగామహాద్వీపవతీ = గంగయను మహానదియొక్క | తట = తీరమందు | ప్రాంచిత = ఒప్పుచున్నట్టి | కాశికాపట్టణమునన్ = కాశీపురమందు | అంబుజ బంధుఁడుచ్చంబునయందు గానంబడు వేళకనంతరమునన్ ॥ అంబుజబంధుఁడు = సూర్యుఁడు | ఉచ్చంబునయందున్ = ఉన్నత భాగంబున | కానంబడు వేళ కనంతరమునన్ = కనఁబడు వేళకుఁదరువాత ॥ ఇరువదియును నేడునరయును బరకవిఘటిక కుచ్చమున నెచ్చటనుగానఁబడునచ్చటన్ ॥ ఇరువదియును నేడునరయును బరకవిఘటికకు | ఇరువదేడు నరపరక విఘడియ కాలమునకు | ఉచ్చమునన్ = ఉన్నతభాగమునందు | ఎచ్చటను = ఏచోటను (అనగానా తూరుపు పడమర రేఖలోననుట) కానఁబడున్ = సూర్యుఁడు కనంబడునో | అచ్చటన్ = అచోటను ॥ కడు పొడవగు రాజధ్వజముగలదై కడుపొడువగు = మిక్కిలియున్నతమైన | రాజధ్వజము = (చెన్నపురిని బరిపాలించెడి) యింగిలీషధికారులయొక్క కొడి | కలదై = కలిగినదై | (అనఁగా చెన్నపట్టణము కోట కొడికంబము కలిగియున్నదనుట.) ॥ ఉత్తరమునయందు బంగాళదేశంబ వాచినిఁ గన్యాకుమారియుఁ బ్రాక్పశ్చిమముల వారినిధులు మేరలుగాఁగ నెలకొన్న ధారుణీ రాజ్యములకు నెల్ల రాజధానియై | ఉత్తరమునయందు బంగాళదేశంబు = (ఆ చెన్నపురికి) ఉత్తరదిశను బంగాళదేశంబును | అవాచినిఁగన్యాకుమారియున్ = దక్షిణ దిక్కున కన్యాకుమారి యనుస్థలంబును | ప్రాక్పశ్చిమముల వారి నిధులు = తూరుపు పడమర దిశల సముద్రంబులును | మేరలుగాఁగన్ = సరిహద్దులుగా | నెలకొన్న = వ్యాపించియున్నటు

వంటి | ధారుణీరాజ్యంబులకు నెల్లన్ = భూమియందుఁగల రాజ్యములకన్నిఁటికి | రాజధానియై = ప్రధాన రాజస్థానమై ||ఇది చెన్నపురికి విశేషణము|| సకలాంతరీపాంతర దేశాంతరాగత వివిధ జనాళిసంకులంబును | (మఱియు నా చెన్నపురం బెట్టిదనఁగా) సకల = సమస్తమైన | అంతరీపాంతర = (ఈ భూమండలంబునం గలిగిన) ఇతర ద్వీపంబులందుండియు | దేశాంతర = అన్యదేశంబులందుండియు | ఆగత = వచ్చి యున్నట్టువంటి | వివిధ = నానావిధంబయిన | జనాళి = జనసమూహము చేత | సంకులంబును = క్రిక్కిఱిసినదనియు|| రమాస్పదంబును | రమ = లక్ష్మీదేవికి||ఆస్పదంబును = ఆధారమును| (అనఁగా నైశ్వర్యంబున కాధారమనుట) | లసితహర్మ్యరమ్యమును |లసిత = ప్రకాశించుచున్నట్టువంటి | హర్మ్య = గొప్ప మేడల చేత | రమ్యమును = మనోహరమును||అగు = అవునట్టి | చెన్నపురంబునకును = చెన్నపురికి | ప్రాంతమందున దక్షిణపశ్చిమమునన్ || ప్రాంతమందునన్ = సమీపమునందు | దక్షిణ పశ్చిమమునన్ = నైరృతి మూలయందు తనరు మద్వాసభూమి చింతాద్రిపేట|| మద్వాసభూమి = నా నివాసప్రదేశమైన|చింతాద్రిపేట = చింతాద్రిపేటయను గ్రామంబు | తనరు = ఒప్పుచుండును.

తాత్పర్యము :—సమస్తచరాచరంబులకు నాధారమైయుండు నీ భూమండలమున నే చోటనైతే యెన్నఁటికిని అహోరాత్రములు సమములై యుండునో ఆచోటే నిరక్షస్థలంబనంబడు. నిరక్షస్థలమనఁగా భూమధ్యరేఖ. ఆ నిరక్షస్థలంబు మొదలుచేసికొని యుత్తర దిక్కునఁ బదుమూఁడవ భాగంబులును నాలుగు కళలును నెనిమిది వికళలుగల ప్రదేశంబునందు నూహింపఁబడిన తూర్పు పడమర రేఖయును గాశీపట్టణములో సూర్యుఁడుచ్చమునఁ గనఁబడు వేళకు తరువాత నిరువదేడు నరాపరక విగడియకాలమునకు నెచ్చోటనయితే సూర్యుఁడు తిరిగి నుచ్చంబగునో అట్టి చోటనుండి యూహింపఁబడిన సగి యుత్తర దక్షిణ రేఖయును సంధించుచోటను చెన్నపట్టణపుకోట కొడికంబము గలిగియున్నది. మఱియును ఆ చెన్నపట్టణ రాజ్యంబునకు నుత్తరంబున బంగాళాదేశంబును, దక్షిణంబున కన్యాకుమారియను స్థలంబును, తూర్పు పడమటిలయందు సముద్రంబులును మేరలుగాఁ గలిగియున్నవి. ఈ నాలుగు మేరలు గలిగిన భూమియందుండు సకల రాజ్యములకు నీ చెన్నపట్టంబు రాజధానిగా నున్నయది. మఱియు నీ చెన్నపురంబు ఈ భూమండలంబునంగల సర్వద్వీపములనుండియు సర్వదేశములనుండియు వచ్చియుండు నానావిధ జనుల వలనను మనోహరమై యున్నది. ఇట్టి చెన్నపట్టణంబునకుఁ జేరకగా నైరృతిమూలయందు నా నివాసప్రదేశంబయిన చింతాద్రిపేట యను గ్రామంబొప్పుచుండును.

ఆ గ్రామంబు చతురాగమ చతుర ధరామర వివిధమధుర వ్యాహారంబులగు నగ్రహారంబులచే ననారతనిజోచితాచార పరతంత్రంబులగు తాంత్రిక మాంత్రిక కార్తాంతిక తార్కిక శాబ్దిక పౌరాణిక వైణిక వైణవిక లేఖక రుక్మకారక కటకారిక ధారిక కులక కులాలిక మాలిక జాలిక సౌచిక శిల్పిక శౌండిక మారజిక రజక వైతంసిక వైనధిక వైతనిక ప్రభృతి ప్రభూతజన జాతంబులచే నశ్రాంత నిజకాంత స్వాంత కాంత నితాంత సౌజన్య సమగ్ర కాంతిలగు కులకాంతలచేఁ దిదృక్షు జనగణ మనస్సమాకర్షణ చణ తీక్షణవిలాస వీక్షణ విచక్షణలగు చర్షణులచే నభంగురానంగ సంగరరంగా నుషంగ భుజంగపుంగవాంతరంగ విహంగ వాగురాయమాణ రంగదపాంగ భ్రూభంగంబులగు గణికాంగనాజనంబులచే నవ్యాహతత్యాగభోగభోగానురాగపరులగు ధనికవరులచే వివిధపదార్థ సమృద్ధికరంబులగు విపణినికరంబులచే నాదిలక్ష్మీ త్రిపురసుందరీ నామంబులఁ జెలంగు మంగళదేవతా సర్వమంగళలకు మనోదయితులయి జగద్విదితులయి యాదికేశవాదిపురీశ్వరాఖ్యలఁ బ్రఖ్యాతిగాంచిన కాంచనాంబరాంబరాంబరుల ప్రాసాదంబులచేఁ గలిపయ

-హారంబ దేవాగారంబులచే నుచ్చావచ మహీరుహ వారంబులచే నుచ్చానుచ్చ నికేతన జాతంబులచేఁ జేతోహరంబయి యొప్పారుచుండు. ఆదికేశవునకు మీనమాసంబున శ్రవణనక్షత్రంబున నాదిపురీశ్వరునకు మేషమాసంబున స్వాతినక్షత్రంబునను ధ్వజారోహణంబులుగ బ్రహ్మోత్సవంబులు నయ్యా సమయంబుల నితరోత్సవంబులుం బ్రవర్తిల్లెడు. ఇయ్యూరికిం బరిఖాకారంబై క్షారనీరపూరంబై యొక్క యేఱు ప్రవహించు. మఱియు నియ్యేఁటి కవ్వల నిప్పేటకుఁబశ్చిమంబగు చోట గ్రామాధిదేవత దేవళంబు దనరారు. అయ్యంబ సంస్కృతంబున స్వర్ణాంబ యనంబరఁగు. ఈభాష నాది పొన్నమ్మయను నామమ్మునం దనరు. అద్దేవి దన్ను భావించి సేవించిన వారి వాంఛితార్థంబులు సిద్ధిబొందించుచుఁ గవి రవి కుజవారంబుల మనుజవారంబులచే నానావిధారాధనలందుచు మహామహిమ వెలుగొందు చుండు. ఆదియప్పనాయండనియెడి బలిజకొలంబునం బొడమిన మహావిభవుండద్దేవ భవనంబులఁ గట్టించి నిజనామాధిగతంబగు నాదిపదంబు తద్దేవతా నామంబుల కాది గతంబుగావింపుటంజేసి యాదికేశవుండు నాదిపురీశ్వరుండు నాది పొన్నమ్మయునని యా దైవతంబులు లోకవిదితంబులయ్యె.

మఱియు నియ్యూరికిఁ జేరికఁ బూర్వదక్షిణభాగంబున నవ్వాఁక కివ్వలిగట్టునఁ జెన్నపట్టణ పరిపాలనంబొనరించు గవర్నరుగారి రమ్యంబగు మహాహర్మ్యం బభ్యర్ణగ ప్రాగర్ణవ రంగత్తరంగ మాలికాడోలిక విహరమాణ జగత్ప్రాణ సముల్లసిత పల్లవిత కోరకిత పుష్పిత ఫలిత లలితనీచానీచ చూతాది బహుమహీరుహ స్తోమంబగు నారామంబుచే నభిరామంబైయుండు.

సీ. ఇమ్మహీమండలి నెసఁగు నిరక్షస్థ
 లంబాదిగానుత్తరంబునందుఁ
బదియును నేడక్షభాగములు నలువది
 రెండు కళల యెడ నుండు ప్రాక్ప్ర
తీచిరేఖయు దిగ్దీధితి చెన్నపు
 రమునను చ్చస్థితినమరు కాల
మున కన్నమున్నగా ముప్పదొక్కటియు ము
 క్కాలు మువ్విసము గాఁగ విఘటి
కకు నినుండుచ్చ సంగతి గాంచునట్టి
దక్షిణోత్తరరేఖయు దగులు చోటఁ
గోటు యమరినదై శుభకోటి కాట
పట్టయి తనర్చును విశాఖపట్టణంబు.

దీని తాత్పర్యము:—ఈ భూమండలంబునం దొప్పుచుండు నిరక్షస్థలంబు మొదలు నేసి యుత్తరదిశను బదియేడక్షాంశలు నలువది రెండు కళలుగల ప్రదేశంబున సూచింపఁబడిన తూరుపు పడమర రేఖయును చెన్నపట్టణమున సూర్యుఁడే వేళకు నుచ్చమునకు వచ్చునో ఆవేళకంటెకుండు (౩౧౪౯) ముప్పదొకటి ముప్పాతిక మువ్విసముం గాఁగ విఘటికా కాలమునకు సూర్యుఁడెచ్చటనయితే యుచ్చమునకు వచ్చునో అచ్చట సూచింపఁబడిన దక్షిణోత్తర రేఖయును సంధించుచోటను విశాఖపట్టణపు కోట గలిగి యున్నదనుట.

ఆ విశాఖపురంబునం గాపురంబుంతు కోటీశ్వరుండగు గొడే సూర్యనారాయణ రాయేశ్వరుని యగ్రతనూభవుండు శ్రీ వేంకట జగ్గారాయ విభుండు బుధవిభవిభ విభవుండు నిజజనకా దేశంబున నీ దేశంబున నెంగిలీషు భాషాభ్యసనం బభిమతంబుగ నిరువది వత్సరంబులకు మున్ను వచ్చి యిచ్చెన్నపట్టణంబు వత్సరాష్టకంబధిష్ఠించి యనంతరంబ నిజపురంబధిగమించి యచ్చట నిచ్చలుఁ బెచ్చు పెరుగు నిఖిలసుఖంబు లనుభవించుచుండెడు. అన్నిరుపమచరితుం డిచ్చెన్నపురంబునకు విచ్చేసిన కతిపయ మాసంబుల కవ్వల నా సుకృతి చెలికారంబు పురాకృతసుకృత పరిపాకంబున నాకధిగతంబగు యత్ప్రతి హతంబయి నానాఁటఁ బరపాటిఁ బ్రబలెంగావున నా కనుభూతంబులగు నా ప్రభూత గుణజాతుని శుభ చరితంబులిచ్చట గొండొక యభివర్ణించెద.

సీ. పలుకఁడు కల్లనవ్వులఁదప్ప నెన్నఁడు
        నెన్నఁడు ధనమెంతయేని నీవి
    దగవుల నిష్పత్తారతి దక్కఁడు
        దక్కఁడు పరుల హితంబిన లకు
    బాంధవావళి యెడఁ బ్రాభవమూనఁడు
        మానఁడు మహిత క్షమాగుణంబు
    స్తోత్రములకు నెంత మాత్రమింపూనఁడు
        పూనఁడు బుధ నింద్యములకు నెపుడు.

    నార్య జనముల కవి నయ మగపఱుఁడు
    పలుపడు నిజాపకృతు నేని మఱుఁగుగనిన
    నవిరతారోగ్యభాగ్య భవ్యాపఘనుఁడు
    ఘనుఁడు వేంకట జగ్గ సంక్రందనుండు.

సీ. సరవి సామాన్య బీజక్షేత్ర ఘాతక
        చ్ఛాయా గణిత నామశాస్త్రవిదుఁడు
    దృక్సిద్ధ శాస్త్ర సమిద్ధ బలాబల
        తా విద్యమాన సిద్ధాంత విభవ
    శాలి జ్యోతిశ్శాస్త్ర చతురుఁడు భూవియ
        ద్గోళ పరిజ్ఞాన కుశలధీని
    ధియు వసుతత్వ నిర్ణయశాస్త్ర దక్షుఁడుఁ
        దర్కశాస్త్రమునఁ దద్దయు నిపుణుఁడు.

    వెండి వివిధ మతగ్రంథ వేత్త బహుక
    ళా విదగ్ధుఁడు సంగీత కోవిదుండు
    మహిత మతి బంగరయ్యమాంబామనఃప్రి
    యుఁడు వేంకట జగ్గరాయోత్తరుండు.

మఱియును.

సీ. శ్రీనివాసుఁడు నిరతానంతభోగసం
కలితుండు బహ్వబ్ధి ఖ్యా ప్రసిద్ధుఁ
శరదర కరుఁడు తార్క్ష్య గమనాసక్తుండు
పురుషోత్తముఁడు భవవిరహితుండు
లోక విచారణాలోలుండు వరదుండు
ధర్మ రక్షకుఁడు స్వతంత్రుఁడా శ్రి
తాఘ సమూహనిహంత దురంత క
ర్బుర దానరతుఁడు విబుధ నుతుండు
భాస్వద న్యాయతాత్ముఁడు భవ్య లక్ష
ణ ప్రశోభితుఁడ విరతానంద చిత్తుఁ
డతఁడు వేంకట జగన్నారాయణుండు
వరమె శేషునకైన నాతని నుతింప.

ఈ పద్యము కృతిపతి వెంకటాచలపతుల కిరువురకు నర్థద్వయము గలయది.

ఇట్టి రమణీయగుణ పారాయణుండును నసాధారణ ప్రతిభాధురీణుండునగు నారాయణ నారాయణుండు నామీఁద నెడఁబడక యుడియుండెడి ప్రేముడికిం దగినవడువున నుడుగర తదాగ్రహానుగుణంబును నా శక్తి కుపయుక్తంబును నీ యాంధ్రభాషాదేశంబు లీలోకంబున నెంతకాలంబు ప్రవర్తిల్లు నంత కాలంబక్షయంబును నపూర్వంబును నగు దాని నెద్దానినేని సమర్పింపంగోరి నిధానాది సప్త సంతానంబులలో నితాంత భవ్యంబగు కావ్యంబొండుదక్కఁ దక్కినయది నా కోరిన యట్టిదిగాదని నామది నిశ్చయించి యాసమంచిత కావ్య నిర్మాణంబున కపూర్వ కథాన్వేషణంబు సేయుచుండఁ గొండొక కాలంబునకు దైవానుకూల్యంబున నీలశైలయాత్ర సంఘటిల్లుటంజేసి సంతుష్టాంతరంగుఁడనై కలరూపెఱింగించు వేడ్క నతిశయోక్త్యాది కావ్యాలంకారంబులం దొలంగి నిఖిల జన సుఖబోధనంబగు వచన కావ్యంబుగా నియ్యాత్ర రచియించి యారుచిర చరిత్రునకు సమర్పించి చరితార్థుండనైతి.

సీ. కలియుగంబున వర్షములు నాల్గువేలుఁదొ
మ్మిది నూఱులును నైదు పదులు నాఱు
జను విక్రమార్కుని శకమున వేయుదొ
మ్మన్నూట పదియేండ్లు మఱియు రెండు
నబ్దముల్ శాలివాహన శకంబున వేయు
నేడు నూఱులు డెబ్బదేడుఁ గ్రైస్తు
శకమున నొకవేయి శతములెన్మిది పదు
లయిదును మఱి నాల్గు హాయనములు
నడుచు నానంద వర్షంబునను నినుండు
వృషభ రాశి గతుండైన వేళ నిష్ట
దేవతానుగ్రహంబునఁ దేర్చి నాఁడ
నీలగిరియాత్ర నెమ్మది నెఱయ వేడ్క.

సీసమాలిక.—

శ్రీ వల్లభుఁడు వసుదేవ కుమారుఁడై
యే వంశమున నభివృద్ధి నొందె
నట్టి గోపాలాన్వయమున వల్వాల గోత్ర
మున నుద్భవించిన భూరిధర్మ

రతుఁడు కోలా వీరరాఘవ పతికి సు
వ్రత వెంగమకును బ్రపౌత్రుఁడనతి
ధీరుండు నా బొల్చు తెప్పల నాయని
కనవద్యచరిత కామాక్షియమ్మ

కును బౌత్రుఁడను బరవనితా విముఖుఁడు ద
యాళుండు సహనుఁ డ నామయుండు
భాగ్యవంతుఁడు సత్యవాక్యలోలుఁడు వేంక
టాచల నాయని కఖిలబంధు

మాన్య సౌజన్యధీమతి మంగమకుఁ బ్రియ
సుతుఁడఁ గృతజ్ఞతా శోభితుండు
ఘనుఁడు రాఘవనాయకునకు శ్రీరామ చిం
తనుఁడు రామస్వామి నాయనికిని

నయశాలి లక్ష్మణ నాయనికనవదాత
చారిత్ర యాది లక్ష్మమకు ననుజుఁ
డను బతిహితలనఁజను రంగమాంబికా
నంతాంబలకు బాలనాయనికిని

మఱఁదిని మఱి రాగమకుఁ గొండమకును ది
ర్మలమాంబకును మంగమకును గనక
మకు శిష్టలోక సమ్మతుఁడు వీరాసామి
నాయకునకును భ్రాత్రీయుఁడ గుణ

భవ్యబాలమ్మకు బావనుతుండ మ
తెల్ల గోత్రభవుండు స్థిరయశ శ్శ
శాంతుండు గోవిందు వేంకటేశాఖ్య నా
యనికి సౌశీల్యధన్యయగు తిరుమ

లమకు దౌహిత్రుఁడన కళంకయోగి నా
రాయణస్వామి నాయని కు దారుఁ
డయిన గోవిందనాయనికి మేనల్లుఁడ
వీరి సగోత్రుఁడై వెలయుఁ బార్థ

సారథిపద భక్తి సారథి గోవిందు
చినతంబు నాయనికిని బ్రశాంతి
విభవ సమన్విత వేంకటు లక్ష్మమాం
బికకు జామాతను మిత వచస్కుఁడ

నానొప్పు మాంగాడు శ్రీనివాస మొదలి
కి గణితశాస్త్రశిక్షితుఁడు దీక్ష
మతి రామధేను రామానుజ నాయని
కిని మిత్రబంధుఁడు కనకపల్లి

తే. గీ. ముద్దు కృష్ణమవిభునకు ముఖ్యహితుఁడ
వడగల యనంగఁదగు వైష్ణవంబు సంప్ర
దాయముగలాడ నంబికాఖ్యాన మాన
సాంబుజుండను శేషాచలాహ్వయుండ.

కం. విరచించితి నీ కృతి కృతి
వరులాదృతి కల్మిఁదాల్మి వఱల ననూయా
విరహితులై వివిధ కథా
భిరతిం దగఁగైకొనుండు పెంపురహింపన్.

కంద గర్భిత ప్రమితాక్షరవృత్తము.

సరసీజనేత్ర ! మహిజా వర ! భా
స్కర జాప్త ! గంధవహజ ప్రియ ! సా
గర గర్వభంగ ! దశ కంధర సం
హర ! యాశ్రితావన ! సుఖానుభవా !

గర్భగత కందము.

సరసీజనేత్ర ! మహిజా
వర! భాస్కరజాప్త ! గంధవహజప్రియ ! సా
గర గర్వభంగ ! దశ కం
ధర సంహర ! యాశ్రితావన ! సుఖానుభవా !

సంపూర్ణము.

చింతాద్రిపేటకు నుదకమండలంబునకు నంతర్గతంబు లగునట్టి స్థలంబుల దూరంబులు.

| | | | కోసులు |
|---|---|---|---|
| పూవిరుంజిమల్లి | ... | ... | ౬ |
| పెరుంబూరు | ... | ... | ౫౹ |
| రాయాజి సత్రము | ... | ... | ౬౯౨ |
| బాలిసెట్టి సత్రము | ... | ... | ౫౯౨ |
| ఓచేరి ... | ... | ... | ౮ |
| వాలాజాపేట | ... | ... | ౮౺ |
| రాణిపేట | .. | .. | ౧౪౨ |
| పాలేటి యీవలిదరి | ... | ... | ౧౪౬ |
| పాలేటి వెడల్పు | ... | ... | ౺ |
| వేలూరు | ... | ... | ౮౪౬ |
| పళ్లికొండ | . | ... | ౭ |
| తోటాళము | ... | ... | ౮౹ |
| ఆమూరిపేట | .. | ... | ౮౺— |
| వాణియంబాడి | . . | ... | ౫౯౨ |
| తిరుప్పత్తియూరు | .. | ... | ౬౺౬ |
| మత్తూరు | | ... | ౬౺౨ |
| ఇరుమత్తూరు | ... | ... | ౫౪౬ |
| ధర్మపురి | ... | ... | ౬౪— |
| అదమాన్కోట | ... | ... | ౭౪- |
| తోప్పూరు | | ... | ౫౺౨ |
| పూజారిపట్టి | ... | ... | ౮౯౬ |
| ఓమలూరు | ... | ... | ౩౯౬ |
| సేలము | ... | ... | ౮౺౨ |
| కాకాపాలియము, మగ్డనాల్లు సత్రము | | ... | ౬౪ |
| ముద్దునాయనిపాళెము, శంకరదుర్గము | | ... | ౫౪ |
| పళ్లిపాళియము (కావేరి) | ... | ... | ౫౹౨ |
| ఈరోడు | ... | ... | ౧ |
| పెరుందొరై | ... | ... | ౫౺ |
| విజయమంగళము | ... | ... | ౩౹ |
| వెంగపల్లి | ... | ... | ౩౹ |

| | | | కోసులు. |
|---|---|---|---|
| అవినాశి | ... | ... | ౫౺ |
| అన్నూరు | ... | ... | ౬।- |
| మేటుపాళియము | ... | ... | ౬౺ |
| కల్లారు | ... | ... | ౨౻- |
| నీలగిరి శిఖరము | ... | ... | ౩౭౨ |
| ఉదకమండలము | ... | ... | ౪౺ |

యోజనంబులు ౪౨ కో. ౧।-